ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# సాయిబాబా చరిత్రము

## నిత్య పారాయణ గ్రంథము

తృతీయ ముద్రణము





రచయిత

**ఆలూరు గోపాలరావు**

పె. న్యూ రు

1996..

ప్రథమ ముద్రణ : 1993

ద్వితీయ ముద్రణ : 1995

తృతీయ ముద్రణ : 1996

ప్రతులు : 1000

మూల్యము : రూ. 15/-

రూ. 17/- (బుక్‌పోస్టు ద్వారా)



ఇతర గ్రంథములు : 1. శ్రీ షిరిడీ సాయిబాబా సంక్షిప్త జీవిత చరిత్ర రూ. 2-50

2. శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత సంగ్రహము (బాల బాలికల ఉపయోగార్థము)

3. **The Life Sketch of Sri Shiridi Sai Baba.**
(Pearless from the Depp. (wirh Book Post) **Rs. 10-00**

4. సమర్థ సద్గురువు శ్రీ సాయిబాబా (అముద్రితము)

ప్రాప్తిస్థానము : **ఆలూరు గోపాలరావు**
రిటైర్డు పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు
భావనగర్ కాలనీ
ఆర్. టి. సి. డిపో ఎదురు బజారు:
పొన్నూరు – 522 124.
గుంటూరు జిల్లా.

ముద్రణ : శ్రీ నటరాజ ప్రింటర్స్
తోటమ్మగుడి వద్ద.
పొన్నూరు – 522 124.
గుంటూరు జిల్లా
ఫోన్ నెం. 2484.

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# పెద్దల ఆశీస్సులు

**శ్రీశ్రీశ్రీ శివనేశన్ స్వామి**

షిరిడీ : ది 29-12-92.

సాయి చరిత్రలోని కొన్ని భాగాలు రచయిత వినిపించినారు. భక్తులకు సమాధి యైన వెనుక బాబా యిప్పుడు కూడ దర్శనమిచ్చి కాపాడుచున్నారు. బాబా లీలలు ఎక్కువగా ప్రచారము కావాలి. ఇప్పుడు ఎన్నో జరుగుచున్నవి అందరికి తెలియాలి. బాగా ఉన్నది. ప్రింటు చేయించు. ఇటువంటి పుస్తకాలు ఇప్పుడు కావాలి.

* * *

**శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ**

విశ్వమందిరము : గుంటూరు.

ది 2-1-1993

సాయి చరిత్రలోని ఏడు అధ్యాయములు బాగున్నవి. ఏడు రోజులు పారాయణకు బాగుంటుంది. నా ఆశీస్సులతో ప్రింటు చేయించుకో.

* * *

**శ్రీ డి. శంకరయ్య**

సాయిదత్త నివాస్ హైదరాబాదు

ది 13-1-1993

పూజ్యశ్రీ శివనేశన్ స్వామి ఆశీస్సులు పొందుట సాయినాథుని ఆశీస్సులు పొందుటే. ఈ రహస్యమును అందరు తెలుసుకొనలేరు. బాబా సమాధి అనంతరము నేటికిని భక్తుల మొరలు వినుచున్నారు. సాయి మందిరములు, సమాజములు దేశ విదేశములలో ఎక్కువ అగుట బాబా సజీవత్వమును తెలుపుచున్నది. ప్రింటు చేయించుటకు ఆలస్యము చేయవద్దు. వెంటనే ప్రెస్సుకు ఈయవలెను. మీరు ఇంకా కొన్ని పుస్తకములు వ్రాయగలరు.

## శ్రీ సాయినాథుని శరత్‌బాబు

(బాపూజి) షిరిడీ

మకాం పొన్నూరు. 18-1-1993

నేను పొన్నూరులోని షిరిడీ సాయి మందిరమునకు వచ్చినపుడు శ్రీ ఆలూరు గోపాలరావుగారు వ్రాసిన సాయి చరిత్రను చూచినాను. రచన బాగున్నది. పారాయణ కాని, ఏదైన కాని ఆగకూడదు. అనుభవించుటే కాదు లక్ష్యము, సాయి సాక్షాత్కారమే మన లక్ష్యంగా ఉండాలి. సాయి చరిత్రలు ఎన్నయినా చాలవు. ప్రింటు చేయించు.

★ ★ ★

## శ్రీ యస్. బాలచంద్రరావు

గుంటూరు. ది. 27-1-93

సాయినాథుని తత్త్వ ప్రచారమనే ఈ మహాయజ్ఞానికి తన వంతు కృషిని జరిపి తనతో పాటు పాఠకులు కూడ సాయి లీలామృతాన్ని గ్రోలి ఆనంద డోలికలలో ఊగిసలాడాలన్న తపనతో రచయిత మరియు సంకలనకర్త అగు శ్రీ ఆలూరు గోపాలరావుగారి కృషి ఈగ్రంథము ద్వారా అవగతమగుచున్నది. పాఠకులు ఈ గ్రంథాన్ని నిత్య పారాయణ చేసి ఆయురారోగ్య ఐశ్వర్యముల కన్నా మిన్న అయిన ఆత్మ జ్ఞానమును శ్రీ సాయినాథుని కృప వలన పొందగల రని ఆశిస్తున్నాను.

★ ★ ★

## మాతృశ్రీ చుండూరు కామేశ్వరమ్మ

(పూలమ్మ) నండూరు

మకాం పొన్నూరు. ది 31-1-1993

తెలిసినవాళ్ళకు, తెలియనివాళ్ళకు కూడ అర్థమవుతుంది పుస్తకము. చిన్న పిల్లలకు కూడ అర్థమవుతుంది. ఇది చదివినందువలన చెప్పకుండానే, బోధించకుండానే భక్తి - జ్ఞాన - వైరాగ్యాలు కలుగుతవి. మనకు తెలియకనే అవి అన్ని కలుగుతవి. అన్ని విధాల అనుకూలముగా లేకపోతే బాబా చెప్పి

వ్రాయించరు. ఉపన్యాసము చెప్పేవారికి కూడ ఈ చరిత్ర ఉపయోగపడుతుంది. పుస్తకము త్వరలో ప్రింటు చేయించు.

★ ★ ★

## శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహారాజ్

(శ్రీ విఠల్ బాబా) విజయవాడ

మకాం. పొన్నూరు. ది. 31-1-1993

నీవు వ్రాసిన సాయి చరిత్ర ఆనందముతో చూచాను ప్రతి అధ్యాయములోని విషయం బాగుంది. ప్రింటు బాగా చేయించు. నేను ఇచ్చుచున్న రూ. 11/-లు ముద్రణకు దక్షిణగా స్వీకరించు.

★ ★ ★

## శ్రీ పి. వేంకటేశ్వరరావు

మద్రాసు. ది. 1-2-1993

మీరు చేయుచున్న సాయి ప్రచారము,పలువురికి మీరు చేసి చూపించు సాయి సేవ అమోఘము. మీరు క్లుప్తముగా వ్రాసి ప్రచురించదలచిన సాయి చరిత్ర కూడ అటువంటిదే. సాయి చరిత్ర ప్రచురించి అందరికి అందజేయుటకు ప్రభు సాయినాథుడు అంగీకరించి మీకు బాబా వారి ఆశీర్వాదములు అందజేయమన్నారు. బాబా మీకు పంపమని నిన్నటి రోజున విభూతిని కూడ ఇచ్చినారు. ఆ విభూతి యిందు (లేఖ)తో పంపుతున్నాను.

★ ★ ★

## శ్రీ యం. రంగాచార్య

సాయిరత్నం, సాయి భక్త శిఖామణి.

శ్రీ సాయి దివ్యాశీస్సులతో

హైదరాబాదు ది. 2-2-1993

సంపూర్ణ దత్తావతారము శ్రీ సమర్థ సద్గురు సాయినాథుడు. శ్రీ సాయిబాబా చరిత్ర సర్వ శాస్త్రిలను, వానిని వ్రాసిన మహాత్ములను కూడా సృష్టించిన భగవంతుడైన సాయి కథ. శ్రీ ఆలూరు గోపాలరావు సమగ్రంగా శ్రీ సాయి

నాథుని చరిత్ర ఎంతో భక్తితో సమర్పించిన కుసుమము. ఇది భక్త జను లందఱికి ఎంతో ఉపయుక్తము కాగలదు. సహృదయులందఱు ఇందులోని మధురసాన్ని అస్వాదించి, శ్రీ సాయినాథుని చరణ కమలముల మధుపాయులు కాగలరని ఆశిస్తున్నాను. ఆ కృపాసింధువు. అపార దయాళుడు అయిన శ్రీ సాయినాథుని ఆశీర్వాదములను, రక్షను పొందగలరు.

"నమామీశ్వరం సద్గురుం సాయినాథం"



శ్రీ మన్నవ సత్యం
చీరాల. ది 2-2-1993

సాయిని గుఱించి ఎవరు ఏమి వ్రాసినా తమకు ఇతరులకు మేలు చేసిన వారే అవుతారు. నిజానికి శ్రీ సాయిని గుఱించి వ్రాసిన ప్రతి వాక్యమూ అత్యంత పవిత్రమైనదే. మీరు ఒక పుస్తకము తయారు చేసి తద్వారా శ్రీ సాయి స్మరణను పెంపొందించుకొంటూ సాటి సాయి బంధువులలో సాయి పట్ల అవగాహన పెంపొందించడానికి ప్రయత్నించడం సంతోషము కలిగిస్తుంది. మీ కార్యక్రమాలన్నింటికి శ్రీ సాయి ఆశీస్సులు లభించాలని మనసారా కోరు కొంటున్నాను.



శ్రీ బాపట్ల వేంకట పార్థసారధి
సాయి నిలయం చెఱువు
బాపట్ల మండలము : ది. 5-9-1993

శ్రీ సాయి ప్రభువు తన లోక కల్యాణార్థముగ సర్వ మానవ సౌభ్రాతృత్వము - సర్వ మత సమానత్వము - తన ప్రేమ తత్త్వము ద్వారా విశ్వ వ్యాప్తముగావించుకొనుటకు - నిష్ఠ - సబూరి కలిగిన భక్త వర్యులను తన ప్రతినిధులుగ నియమించుకొని తన చరిత్ర - లీలలు - మహిమలు - బోధలు ప్రతి మానవునకు ఎఱుక పఱచుటకు వారి ద్వారా తాను కోరిన పద్ధతిలో సేవ చేయించుకొనుచున్నారు. అట్టి ప్రతినిధులలో చి॥ ఆలూరు గోపాలరావుగారు

ఒకరు. శ్రీ గోపాలరావుగారు నిస్వార్థబుద్ధితో నిశ్చల మనస్సుతో, నైపుణ్యముతో తనకు తెలిసిన తెలుసుకొన్న, శ్రీ సాయినాథుని మహిమలు, పుస్తకరూపములో ప్రజా బాహుళ్యానికి అందించి, ఆనందించి తన జీవితాన్ని ధన్యత్వము చేసుకొను కృషిలో ఈ గ్రంథము ద్వారా ప్రారంభోత్సవము జరుపుకొను చున్నారు. వారి కృషిని శ్రీ సాయి ప్రభువు అనుగ్రహించి, ఆమోదించి సకల శుభములు చేకూర్చాలని శ్రీ సాయికి నా అభ్యర్థన, నా ప్రార్థన.

* * *

## శ్రీ సత్యసదానంద ప్రభుజీ

గౌరవాధ్యక్షులు : ఆంధ్ర రాష్ట్ర సాయి సేవక సంఘము.

రామలింగంపల్లి - హైదరాబాదు

మకాం. విజయవాడ. ది. 4-10-93

శ్రీ సచ్చిదానంద సమర్థ సద్గురు సాయినాథులవారి చరిత్ర ఒక స్ఫటిక మణి. ఎన్ని ముఖాలో ! ఎన్ని కోణాలో ! మన దృష్టి కోణాలన్ని దాంట్లో ప్రతిఫలిస్తూ ఉంటాయి. శ్రీ మద్భగవద్గీతకు అశేషముగా వ్యాఖ్యలు వస్తున్నట్లే బాబా వారి చరిత్ర కూడా ఎందరెందరో సాయి కరుణకు పాత్రులైన భక్త వరేణ్యుల చేత మఱల మఱల పునశ్చరణ చేయబడుతూనే ఉంది. చిరంజీవి ఆలూరు గోపాలరావు అటువంటి అదృష్టశాలి.

ఈ "సాయిబాబా చరిత్రము" నూతన సంవిధానముతో, చక్కని విషయ విశ్లేషణతో సాయి భక్తులందరి చేత మళ్ళీ మళ్ళీ చదివించగలగిన సులభ శైలిలో రచించబడింది.

ఈ రచయిత సాయినాథుల వారి పరిపూర్ణ కృపకు పాత్రుడైనాడని చెప్పడానికి ఈ పవిత్ర కార్యాన్ని ఇంత చక్కగా నిర్వహింపజేయుటయే ఋజువు.

ఇంకా యిటువంటి అనేక గ్రంథాలను వీరి చేత రచింపజేసి తమ సేవలో వినియోగించుకొంటూ సాయినాథులు వారికి (రచయితకు) సర్వ శుభాలు చేకూర్చాలని ఆ పరమ యోగేశ్వరేశ్వరుని మనసారా ప్రార్థిస్తూ....

**డా॥ కె. రాంకుమార్** M.B.B.S., M.D.
గుంటూరు; ది. 10-10-93.

శ్రీయుత గోపాలరావుగారు అత్యంత భక్తిశ్రద్ధలతో వ్రాసిన శ్రీ సాయి చరిత్ర వ్రాతప్రతిని నేను ఆమూలాగ్రము చదివినాను. చాలా బాగున్నది. ఇది మిక్కిలి సులభశైలిలో అందరికి అర్థమగురీతిలో వ్రాయబడినది సాయి చరిత్రకు సంబంధించి మిక్కిలి వివరముగా విషయములు తెలుపబడినవి. ఇది భక్తులకు బాగా ఉపయోగించు ననుటలో ఎట్టి సందేహము లేదు.

* * *

**శ్రీ కాళి భగవాన్ బాబా**
సాయి ఆశ్రమము. ఏటుకూరు రోడ్డు
గుంటూరు

శ్రీ ఆలూరు గోపాలరావుగారు సాయి భక్తులు. శ్రీ సాయినాథుని గురించి వీరు ఇంతకు పూర్వమునుండి వ్యాసములు వ్రాసి పత్రికలకు పంపిస్తూ ఉండేవారు. ఇప్పుడు వీరు "శ్రీ సాయి చరిత్ర"మనే గ్రంథము వ్రాసి భక్త కోటికి అందించారు. చాలా సంతోషము శ్రీ గోపాలరావుగారు ఇంకా ఎన్నో బాబా కార్యక్రమములు నిర్వహించవలసి యున్నది. సాయిబాబా పరిపూర్ణాను గ్రహము వీరికి సదా కలుగు గాక.

★ ★ ★

**Sri T. KESAVA RAO**
President
All India Sai Samaj
**Mylapoor MADRAS,**
Camp : VIJAYAWADA
Date : 3-10-1993.

**With Sashtanga Namaskarms to the great Master Sri Sai Baba and my Beloved Gurudev**

Sadguru Narasimha Swamiji, I am happy in Study the First, Second and Third Chapters of Sri Sai Baba Jeevitha Cheritham and his mission, his Leelas and upadesh beeing written by my good friend and Sai brother Sri Aluru Gopala Rao garu of Ponnur. I am sure this book in Telugu written easy style will bring the Supreme Masters Grace to every home in a pleasing andearnest manner and will result in Sai Bless - Satchitananda.

At the feet of the Master.

★ ★ ★

## ద్వితీయ ముద్రణము – అభిప్రాయములు

శ్రీమతి జి. విజయప్రసాద్
42 దయానంద్, గోపాలనగర్
రోడ్ నెం 1 : దోంబివల్లి
మహారాష్ట్ర పిన్ 421 201.

మీరు వ్రాసిన సాయిబాబా చరిత్రము ప్రతి దినము చదువుచున్నాను. మీ పుస్తకము ద్వారా ప్రస్తుతము ఆంధ్రదేశములో సాయిని గురించి విశేషాలు చాలా తెలిసినవి. మాతాజీ కృష్ణప్రియ, మాతృశ్రీ పూలమ్మగార్ల గురించి వినుట ఇదే ప్రథమము మీ "షష్ఠాధ్యాయము" ద్వారా భక్తుల అనుభవములు చదువుచున్న కొలది చాలా ఆనందము కలిగినది. ఈ చరిత్ర వలన చాలా విశేషాలు తెలిసాయి. మీ పుస్తకము నాలాంటి వారికి మిక్కిలి సౌకర్యముగా ఉంది.

★ ★ ★

ఈ. సురేష్ కుమార్ వైస్ ప్రెసిడెంటు
ఓం సాయి శ్రీ సాయి జయ జయ సాయి
అఖండ నామ సప్తాహ సమితి, హైదరాబాదు.

మీరు అమ్మగారికి (శ్రీమతి సరస్వతి గారికి) పంపిన "సాయిబాబా

చరిత్రము" నిత్య పారాయణ గ్రంథము మాకు అందినది. అమ్మగారు ఈ పుస్తకాన్ని చదివి సాయి **(Philosophy** : ఫిలాసఫి) తత్త్వ ప్రచారానికి చక్కటి కృషి చేసినారని అభినందించినారు. సాయిని గురించి ఏమి వ్రాసినా, సాయి భక్తులందరికి అత్యంత ఆమోదము. ఆనందము. మీకు సాయి ఆశీస్సులు లభించాలని, మీ నుండి మరెన్నో పుస్తకాలు రావాలని అమ్మగారు ఆశిస్తున్నారు.



శ్రీమతి సాయి లీలమ్మ

ప్లాట్ నెం B/3 వెస్టుమారేడిపల్లి.
బంజారా ఆర్కాట్ సికింద్రాబాద్.

మీరు పంపిన పుస్తకము "సాయిబాబా చరిత్రము" (నిత్య పారాయణ గ్రంథము) నాకు 21-1-94 నాడు షిరిడీ సాయిబాబా మహాత్మ్యము సినిమా చూస్తూ ఉండగా అందినది. ఇప్పుడు చదువుచున్నాను. 1953 నుండి ఈ దినము వరకు ప్రత్తి నారాయణరావుగారి పుస్తకము చదువుచున్నాను. మీరు పంపిన పుస్తకమే రెండవ పుస్తకము నేను చదువుచున్నది. ఇది చాలా బాగున్నది.

మీరు చేస్తున్నటువంటి కృషికి నా యొక్క ఆశీర్వచనములు ఎల్లప్పుడు ఉంటాయి. మీ యొక్క ఆశయము తప్పకుండ నెరవేరగలదు. ఆ సాయి బాబా మీ యందు ప్రవేశించి, సర్వ జనులకు భక్తి అనే అమృతాన్ని పంచి పెట్టుమని ఆదేశించినటుల మీరు ఈ కార్యక్రమమున లగ్నమై ఉన్నారు. ఈ సందర్భమున ఆశీః పూర్వకముగా రూ. 116/- లు అందజేస్తున్నాను. స్వీకరించవలసినది.



యం. రామకృష్ణ M. Tech.
ది 1-10-11. శ్రీరామ్‌నగర్
కాకినాడ

మీరు రచించిన "సాయి చరిత్రము" ఒకసారి పారాయణ చేయాలని తలపెట్టిన వాడిని నాచే బాబా మూడు సార్లు పారాయణ చేయించినాడు. పారాయణ చేస్తున్నంతసేపు బాబా నా ఎదురుగా కూర్చున్నట్లు అనుభూతి కలుగుచున్నది. చక్కని సరళి (భాష) సులువైన శైలి. దీనికి "నిత్య పారాయణ గ్రంథము" అని పరియైన పేరు పెట్టినారు. దీని ధరను బట్టి చూచిన యెడల ఆర్థిక లబ్ది పొందుటకు కాక, కేవలము నిస్వార్థ సేవ కోసం రచించినారని తెలుస్తుంది. ప్రతి లీల కళ్ళకు కట్టినట్లు బాగా రచించినారు.

సాయి చరిత్ర పారాయణ మొదలు పెట్టినప్పటి నుండి "ఆ అవ అధ్యాయము" ఎప్పుడు వస్తుందా అని చాలా ఆతురత పడవలసివస్తున్నది. తేట తెలుగు మాటలతో ఒప్పారి. అతి తక్కువ చదువు ఉన్నవారికి కూడ ఉపయోగకరంగా ఉన్నది. మీ గ్రంథము చదువుతుంటే ఎన్నో విషయములు తెలుస్తున్నవి. గెటప్ చాలా బాగుంది. ధర కూడ తక్కువ,

* * *

ఇ. మునిరత్నం నాయుడు
శ్రీరామపురం. చిత్తూరు జిల్లా

మీరు రచించిన "శ్రీ సాయిబాబా చరిత్రము" ప్రతి దినము పూజా సమయమున పారాయణ చేసితిని శ్రీ సాయినాథుని చరిత్ర కన్నులకు కట్టినట్లు ఉన్నది. ఈ చరిత్ర పారాయణ చేసిన యెడల భక్తులకు చాలా ఉపయోగ పడగలదు. పూజలో ఉంచుకొనవలసిన పవిత్ర గ్రంథము. వాస్తవమునకు రూ. 10/- లకు మాత్రమే లభించడం చాలా కష్టము. కాని భక్తులకుప యోగముగ నుండునట్లు ధర నిర్ణయించుట తమకు (రచయితకు) బాబా భక్తుల పై గల ప్రేమే.

ఈ గ్రంథ మొకసారి చదివినచో షిరిడీ దర్శించినట్లుండును. శ్రీగురు

పౌర్ణమికి షిరిడీ వెళ్ళితిని. మఱల మీ గ్రంథము షిరిడీని దర్శింపచేసినది చాలా కృతజ్ఞుడను.



M.V.V. SARMA
NAGAPUR
14-4-94

The Book is nicely printed and is very much abridged from Leelas of Baba. Every chapter takes for reading 50 Minutes to one hour.

In fact I desire to handle a small Book written sufficent leelas that could be studied in one hour atleast. Your book full filled my desire.



ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# ముందుగా ఒక్కమాట

సంకల్ప వికల్పములనునవి శ్రీ సాయినాథుని కృపవలననే కలుగుచుండును. అతని సంకల్పములనంతములు. వానిని తెలిసికొనుట యెవరి తరమగును ?

1986 సం॥ వఱకు సాయిని గుఱించి నాకేమియు తెలియదు. ఈనాడు తెలిసినదని తలంచుటయు పొరపాటే. 1986 సెప్టెంబరులో పొన్నూరు పట్టణమున శ్రీ సాయి సేవా మండలి ఏర్పడినను అందు నేను సభ్యుడుగా చేరలేదు. శ్రీ సాయి సంకల్పమేమో తెలియదు కాని ఆ మండలి నిర్వాహకులు మాత్రము అచట జరుగు ప్రతి కార్యక్రమమునకు నన్ను పిలుచుచుండెడివారు ఈ విధముగా ఆ మండలితో నాకు సంబంధమేర్పడినది. 1987 సం॥న విజయ దశమీ దినమున ఆ మండలి యందు నేనును సభ్యుడనైతిని. ఈ మండలిలో సందర్భము ననుసరించి జరుగు వివిధ కార్యక్రమములో తఱచు పాల్గొనుచుండెడి వాడను. తుదకు చీపురు పట్టి నడుము వంచి చిమ్ముట నుండి వేదికలెక్కి యుపన్యసించుట వఱకు వచ్చినది. మండలిలో సభ్యుడనైన నాకు క్రమ క్రమముగా పెద్దల సాంగత్యముతో పాటు వారి శుభాశీస్సులు కూడ లభించినవి. ఇదంతయు శ్రీ సాయినాథుని లీలగా సంభావించుచున్నాను. ఆ లీలలు అనంతములు గదా ! శ్రీ సాయినాథుడే నన్ను తన మార్గమున నడిపించు చున్నాడని తలంతును.

ఇక ప్రస్తుత విషయము మాతృశ్రీ పూలమ్మ (చుండూరి కామేశ్వరమ్మ) గారి ఆదేశానుసారము కొన్ని కార్యక్రమములను తగ్గించుకొనినాను. ఇట్లుండగా కృష్ణా పుష్కరముల సందర్భమున శ్రీ డి. శంకరయ్యగారు విజయవాడలోని శ్రీ సాయి మందిరము వద్ద కలసి నపుడు "గోపాలరావుగారు ! మీరు వ్రాసిన "సాయిబాబా వ్యాసాలు" గ్రంథరూపమున ముద్రింప దలచుచున్నాను" అని చెప్పిరి. అందులకు నేనును సమ్మతించితిని ఇట్లు జరుగుట శ్రీ సాయినాథుని ప్రేరణయే కాని మఱియొకటి కాదు గదా !

1992 నవంబరులో బాబాను గురించి సంగ్రహముగా ఐనను వ్రాయవలెనను సంకల్పము కలిగినది. వెంటనే పొన్నూరులోని మా షిరిడీ సాయి సేవా మండలి కార్యవర్గ సభ్యులకు చెప్పగా వారు నన్ను ప్రోత్సహించిరి మరియు గుంటూరులోని శ్రీ సాయి అంకిత భక్తులు ప్రొఫెసరు డా॥ కె రామకుమార్‌గారు ధైర్యము చెప్పుచు "సాయి చరిత్ర" సాధ్యమైనంత వఱకు విపులముగా విశేషాంశములతో వ్రాయవలెనని వెన్ను తట్టిరి. తెలిసిన సాయి పెద్దలు, మిత్రులు ఈ కార్యక్రమమునకు దోహద మొసంగిరి. ఇదంతయు శ్రీ సాయి లీలా విశేషమేమో !

ప్రస్తుత కాలములో స్థిమితముగా కూర్చుండి చరిత్రలు చదువు తీరిక, ఓపిక లేక యాంత్రిక జీవితముతో సతమతమగుచున్న సాయి భక్తులు బాబాను గురించి యింకను విశేషాంశములు అధికముగా తెలుసుకొనవలెనను నా తపనయే యీ రచనకు పురిగొల్పినది. మాతృశ్రీ పూలమ్మగారు కూడ "ఇందుకే కాబోలు నిన్ను కొన్ని బాధ్యతలు తగ్గించుకొనుమని బాబా చెప్పినది మరి యిది వ్రాయించుటకే అట్లు చెప్పియుండవచ్చు"నని అన్నారు. సంకల్పము కలిగించుచున్నది. గ్రంథమును వ్రాయించుచున్నది. శ్రీ సాయినాథుడే యని నా ప్రగాఢ విశ్వాసము. నేను మాత్రము నిమిత్త మాత్రుడను. మరి ఇంతకంటే నాకేమెరుక.

ఈ గ్రంథము నందు బాబా జీవితమునకు సంబంధించిన ముఖ్య సంఘటనలు అందరికి అర్థమగుటకై, సులభ శైలిలో మాత్రమే తెలుపబడి నవి. దీనిని చదినవారు అమందానందానుభూతులు పొందగలరని నా నమ్మకము.

వ్రాత ప్రతి యందలి యధ్యాయములను ది. 10-12-92 నుండి ప్రారంభించి నిత్యము ఒక అధ్యాయము చొప్పున నియమ పూర్వకముగా పారాయణ చేసినాను. తత్ఫలితముగా ది. 27-12-92 న షిరిడీ క్షేత్ర సందర్శన భాగ్యము కలిగినది. ది. 28-12-92న ద్వారకామాయిలో కూడ ఈ వ్రాతప్రతి యగు శ్రీ సాయి చరిత్రను సంపూర్ణముగ పారాయణ చేసినాను.

పొన్నూరు భావనగరు కాలనిలోని సాయి మందిరము నందు ది. 14-1-1993 నుండి ది. 20-1-1993 వఱకు ఈ సాయి చరిత్ర పారాయణము జరిగినది. పారాయణము పరిసమాప్తమైన దినమున ఒక గోవు ఎచ్చటి నుండియో వచ్చి సరాసరి మందిరద్వార ప్రాంగణమున నిలచి లోనికి చూచుచు నిలువబడినది. దానిని తోలినను కాలు కదపక యట్లే నిలుచున్నది అప్పుడు మందిరము నుండి కదళీ ఫలములను తెచ్చి పెట్టిన పిమ్మట అచటి నుండి కదలి తన గమ్యస్థానమునకు వెళ్ళినది. బాబాయే స్వయముగా కామధేను రూపమున సాక్షాత్కరించి దర్శన మొసంగినారని యచటి వారందఱు సంభావించి ఆనందపరవశులయినారు. ఇది నా ప్రత్యక్షానుభవము.

శ్రీ నాగిశెట్టి వీరబ్రహ్మంగారి (సాయి ఆశ్రమము. కసుకుఱ్ఱు) వద్దకు నేను వెళ్ళినపుడు వారు శ్రీ సాయి పూజా నిమగ్నులై యున్నారు. కొంత సేపటికి వారు నన్ను చూచి "మీరు వ్రాసిన శ్రీ సాయి చరిత్రలోని 6, 7 అధ్యాయములు ఇంకా బాగా వ్రాయాలి అని బాబా చెప్పుచున్నారు" అని అన్నారు. (అప్పటికి అసలు నాగిశెట్టి వీరబ్రహ్మంగారు నేను వ్రాసిన శ్రీ సాయి చరిత్రను చూడలేదు. చదువలేదు).

ఇంటువంటిదే మఱొకటి నేను వ్రాసిన యీ సాయి చరిత్ర వ్రాతప్రతి నా జ్యేష్ఠ పుత్రిక చి॥ల॥సౌ॥ గోపరాజు రాజ్యలక్ష్మి నియమ పూర్వకముగా సప్తాహ పారాయణము చేసిన పిమ్మట "నాన్నగారు ! ఆఱవ అధ్యాయము ఎందుకో అసమగ్రముగా ఉన్నట్లు తోస్తున్నది. దీన్ని మీరు శ్రద్ధ వహించి చాలా జాగ్రత్తగా వ్రాయాలి" అని చెప్పినది.

ఈ విధముగా వారిద్దఱి ప్రేరణతో "సమాధి అనంతరము సాయి సశరీర దర్శనము మఱియు అభయ ప్రదానములు" అను శీర్షికను వ్రాసి చేర్చినాను.

ఇంత వఱకు జరిగినదంతయు ఒక ఎత్తు. ఇక జరుగవలసినది మఱొక ఎత్తు బాబా చరిత్రను నాకు తోచిన రీతిలో వ్రాసినాను. వ్రాయుటకు తగిన భాషా పాండిత్యములంతగా నాకు లేవు. నేను వ్రాసిన యీ వ్రాతప్రతిని పరిశీలించి, పరిష్కరించి సరిచేయు వారెవ్వరు? ఎవరి పనులలో వారు మునిగి

తెలుచుందురు గదా ! నా ప్రయత్నము నెఱవేరుటెట్లు ? తమ అమూల్యమగు సమయమును వ్యర్థము చేసికొని తీరికగా, ఓపికతో, శ్రద్ధతో సరిచేసి యిచ్చు వారెవ్వరా ? అను ఆలోచన కలిగినది. శ్రీ. సాయినాథుని అనుగ్రహమున - నా అదృష్ట వశమున పొన్నూరు వాస్తవ్యులును రిటైర్డు సీనియరు తెలుగు పండితులును, "శాతవాహన చరిత్ర" కృతిపతులను అగు "భాషాప్రవీణ" శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య గారిని కలసి మాటాడుట జరిగినది. వారు ఏ మాత్రము సంకోచింపక నా అభ్యర్థనము మన్నించి శ్రద్ధాసక్తులతో శ్రమించి ఈ నా వ్రాతప్రతిని సుమారు ఒక నెల రోజులుగా పరిశీలించి, పరిష్కరించి, సరిచేసి ముద్రణకు అనువగు రూపమును కల్పించినారు. ఇంతటితో తన పని పూర్తియైనదని శ్రీ జానకిరామయ్యగారు విరమించుకొనలేదు. ఈ సాయి చరిత్ర ముద్రణ జరుగుచున్న సమయములో కూడ మిక్కిలి జాకరూకతతో అక్షర దోషములేమాత్రము దొరలనీయక ప్రూపు రీడరుగా కూడ పని చేసి నాకెంతయో సహాయము చేసిరి. వారి సహకారమే లేనిచో ఈ గ్రంథము వెలుగు చూచెడిది కాదేమో ! పరిచయమేమాత్రము లేని నేను వారిని అభ్యర్థించుట, వెంటనే వారంగీకరించుట చూడగా ఇది యంతయు శ్రీ సాయినాథుని లీలా విశేషముగా నాకు తోచినది. వారు చేసిన ఈ సహాయము విస్మరింప రానిది. అందులకు శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్యగారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు నిండు మనస్సుతో అర్పించుచున్నాను.

శ్రీ సాయి చరిత్రలోని భాగములను వినిన పెద్దలు, మిత్రులు అందఱు ఉత్సాహ ప్రోత్సాహముల నిచ్చుటయే కాక తమ తమ శుభాశీస్సులందించి, అమూల్యములైన అభిప్రాయములు ఒసంగిరి. వారందఱికి మనః పూర్వక నమోవాకములు.

ఈ గ్రంథ ముద్రణకు తమ వంతుగా యథాశక్తి ఆర్థిక సహాయ మందించి సహకరించిన మాన్యులగు వదాన్యులకు హృదయ పూర్వక నమస్కారములు. వారందఱి పేర్లు ప్రత్యేకముగా ముద్రించి నా కృతజ్ఞతను వెల్లడించికొనినాను.

ఈ గ్రంథమున సాయి చరిత్రకు సంబంధించిన విషయములను ప్రతి పాదించుటలో దొసగులేమేని యున్నచో వానిని పాఠకలోకము తెలియజేసిన

యెడల పునర్ముద్రణములో సవరించుటకు ప్రయత్నము చేయుదును.పుస లేవేని యున్నచో మన్నింప వేడెదను.

ఈ గ్రంథము ప్రజలకు ఉపయోగించినచో నా జన్మ ధన్యమైనట్లు భావించెద. అంతయు సాయినాథుని కృప.

ఈ సాయి చరిత్రమును సకాలమునకు సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీ నటరాజ ప్రింటర్స్ వారికి, వారి సిబ్బందికి అభినందనలు.

ఆలూరు గోపాలరావు

రచయిత

★ ★ ★

## ద్వితీయ ముద్రణము
## తొలిపలుకు



"శ్రీ సాయిబాబా చరిత్రము" నిత్య పారాయణ గ్రంథము ప్రథమ ముద్రణలోనే ఆశించిన ఫలితము చేకూరినది. ముఖ్యముగా ఈ గ్రంథము యువతచే ఆకర్షింపబడినది. ప్రథమ ముద్రణ గ్రంథములన్నియు శ్రీ షిరిడీ సాయినాథుని కృపా విశేషము చేత అచిరకాలములోనే సాయి భక్తుల యొక్క ఆదరాభిమానములకు పాత్రములైనవి ప్రస్తుతము ద్వితీయ ముద్రణమునకు నోచుకున్నది. ఈ గ్రంథ ద్వితీయ ముద్రణకు భక్తుల ప్రేరణ, ప్రోత్సాహము అధికమైనది. ఈ గ్రంథమిప్పటికి ఏడు మాసముల క్రిందటనే భక్తుల చేతుల లోనికి రావలసియున్నది. అనివార్య కారణముల వలన భక్తుల కోరికను వెంటనే నెఱవేర్చలేకపోయినందుకు క్షంతవ్యుడను. "శ్రేయాంసి బహు విఘ్నాని" అని గదా ఆర్యోక్తి.

ప్రథమ ముద్రణలో లేని మఱికొన్ని ముఖ్యాంశములను ఈ ద్వితీయ ముద్రణములో ఆయా యధ్యాయముల యందు పొందుపఱచినాను. వానిని చదువరులు శ్రద్ధగా గమనించ ప్రార్థన.

ఈ గ్రంథము యొక్క ద్వితీయ ముద్రణ సమయమున కూడ ప్రథమ ముద్రణము నందు వలెనే నాకు మిక్కిలి చేదోడు వాదోడుగా నుండి తగిన సూచనలొసంగును మిక్కిలి జాగరూకత వహించి, అక్షర దోషములేమాత్రము దొరలనీయక ప్రూపు రీడరుగా పని చేసిన "శాతవాహన చరిత్ర" కృతిపతులు బ్రహ్మశ్రీ "భాషా ప్రవీణ" శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య (రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, పొన్నూరు) గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు. వీరి సౌజన్యమును, సారస్వత వ్యాసంగమును గుఱించి నేనెంత చెప్పినను, ఎంతగా వ్రాసినను తనివి తీరదు. కావున ప్రథమ ముద్రణములో శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య గారిని గుఱించి నేను తెలియజేసిన అభిప్రాయము పైననే పాఠకులు మఱియొకసారి దృష్టి సారించవలసినదిగా సవినయముగ మనవి చేసుకొనుచున్నాను.

ఈ ద్వితీయ ముద్రణకై తమ అమూల్యాభిప్రాయముల నొసంగిన వారందఱికి ప్రత్యేకముగా కృతజ్ఞతాపూర్వక వందనములు తెలుపుకొను చున్నాను.

ఈ గ్రంథముపై పాఠకులైన మీ యభిప్రాయములను, మీరు పొందిన యనుభూతులను ఆనందముతో తెలిపిన యెడల సంతోషింతును.

ఈ ద్వితీయ ముద్రణకు మిక్కిలి ప్రోత్సాహ సహకారములందించిన శ్రీయుతులు S. పూర్ణచంద్రరావు (రిటైర్డు ఇ. బి.1విజయవాడ) గారికి ప్రత్యేకాభివందనలు.

ఈ గ్రంథ ముద్రణకు విరాళమిచ్చిన వదాన్య శేఖరుల శుభ నామధేయములను ప్రత్యేకముగ మఱియొకచోట తెలియజేసినాను. వారందఱికి శ్రీ షిరిడీ సాయినాథుని శుభాశీస్సులు కలుగవలెనని మనసారా కోరుకొను చున్నాను.

విద్యుల్లోపము నిరంతరము జరుగుచున్నను సరకుచేయక ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రించి అందించిన శ్రీ నటరాజ ప్రింటర్సు యజమానులకు, వారి సిబ్బందికి నా ధన్యవాదములు.

**ఆలూరు గోపాలరావు**

రచయిత

# తృతీయ ముద్రణము

## తొలిపలుకు

సాయినాథుని కృపా విశేషముచే నిత్యపారాయణ గ్రంథమగు "సాయిబాబా చరిత్రము" యొక్క ద్వితీయ ముద్రణ ప్రతులన్నియు అనతి కాలములోనే సాయి భక్తుల భక్తి తాత్పర్యముల వలన, ఆదరాభిమానముల వలన ఖర్చుఅయి, నేటికి మఱల మూడవ ముద్రణకు నోచుకొన్నది. దీనికి శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానము వారిచే నడుపబడుచున్న "సప్తగిరి" మాసపత్రిక యొక్క సాహాయ్యము కూడ తోడైనది. ఇందు వలన మన రాష్ట్రమునందే కాక రాష్ట్రేతర సాయి భక్తులును ఈ గ్రంథమును తెప్పించు కొని చదువుట జరుగుచున్నది. అందుకు దేవస్థానము వారికి, "సప్తగిరి" పత్రికా నిర్వాహకులకు కృతజ్ఞతలు.

ఈ 'సాయిబాబా చరిత్ర' గ్రంథములను శ్రీ సాయి అంకిత భక్తులెంద ఱెందరో విరివిగా తెప్పించు కొనుచూ సాయి తత్త్వమును ప్రచారము చేయు చున్నారు. వారందఱికి నా హృదయపూర్వక నమోవాకములు.

సాయి అంకిత భక్తులైన శ్రీ బాపట్ల హనుమంతరావు గారిచే రచింప బడిన పద్యములను ఈ గ్రంథము నందలి ప్రతి అధ్యాయము చివర అచ్చొత్తించు కొనుటకు అనుమతించి, ఆమోదించి నందులకు, వారి కుమారు లైన శ్రీ బాపట్ల వేంకటపార్థసారథి గారికి హృదయపూర్వక నమశ్శతము లర్పించుచున్నాను.

లోకుల దృష్టిలో కేవల శిలారూపముగనున్న దానిని శిల్పి తన అదృశస శిల్పకళా నైపుణ్యముచే అద్భుతముగా, రమణీయముగా, సజీవ దేవతామూర్తిగా మలచినపుడు దానియందు ప్రజలకు భక్తి విశ్వాసములు ఇతరులు చెప్పకయే కలుగును గదా ! అట్లే ఈ "సాయిబాబా చరిత్రము" కూడా అచిరకాలములోనే తృతీయ ముద్రణ భాగ్యమునకు నోచుకొనుటకు నేపథ్యమున శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్యగారి అమోఘమైన, అనిర్వాచ నీయమైన, యవిరళ కృషి యెంతయో యున్నది. వారొనరించిన కృషిని తలచి ప్రథమ ద్వితీయ ముద్రణములలో విశదముగా విన్నవించు కొనినాను.

ఈ గ్రంథ తృతీయ ముద్రణ సందర్భమునను, ప్రథమ, ద్వితీయ ముద్రణము లందువలెనే నాకు చేదోడు వాదోడుగా ఉండి యనారోగ్యమును కూడా పరిగణింపక, మిక్కిలి జాగరూకతతో, ఓపికతో, ఓర్పుతో, అక్షర దోషములను దొరలనీయక,నిర్దుష్టముగా ఉండుటకై నా అభ్యర్థనను మన్నించి, ప్రూపురీడరుగా పనిచేసిన "శాతవాహన చరిత్ర" కృతిపతులు, బ్రహ్మశ్రీ "భాషాప్రవీణ" జొన్నలగడ్డ జానకిరామయ్య (రిటైర్డు సీనియరు తెలుగుపండిట్, పొన్నూరు) గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య గారితో నాకు పరిచయము కలిగి నప్పటి నుండి నా శ్రేయస్సును ఆకాంక్షించు వారిలో వారును ఒకరైరి. వారి యుత్సాహ ప్రోత్సాహములే ఈ తృతీయ ముద్రణమునకు ఆలంబనము లయినవి. వారు బహు నిరాడంబరులు, నిరహంకారులు, యథాశక్తి ఇతరులకు ఉపకారము చేయు తలంపు గలవారు. సారస్వత ప్రియులు. వీరిని గుఱించి నేను ఏమి వ్రాసినను అత్యంత స్వల్పమే యగును. కాన ప్రథమ, ద్వితీయ ముద్రణములలోని నా యభిప్రాయములనే మఱల మఱియొక సారి చదువుకొన వలసినదిగా చదువరులకు మనవి చేసికొనుచున్నాను.

ప్రస్తుతము పేపరు ధరలు, ముద్రణ వ్యయముకూడ పెరిగినందున ఈ గ్రంథము యొక్క మూల్యమును రూ 15/-లుగా నిర్ణయించక తప్పలేదు. కావున సాయి భక్తులు సహృదయముతో పరిశీలించి మన్నించ వలసినదిగా సవినయముగా కోరుచున్నాను.

ఈ గ్రంథమును ముద్రించుటకు విరాళము లొసంగిన వదాన్యులకు కృతజ్ఞతలు తెలుపుకొనుచు వారి నామధేయములను ఈ గ్రంథము చివర ప్రకటించినాను.

ఈ గ్రంథమును సకాలములో సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీ నటరాజ ప్రింటర్సు యజమానులైన శ్రీ విష్ణుమొలకల ఉదయభాస్కరరావు గారికి, వారి సిబ్బందికి నా ధన్యవాదములు.

ఇట్లు

**ఆలూరు గోపాలరావు**

రచయిత

# అంకితము

సమర్థ సద్గురువు, మద్గురువు

## శ్రీ సాయిబాబా పాదకమలములకు



నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నితాం
తాపార భూత దయయును
దాపస మందార ! నాకు దయసేయఁ గదే !

రచయిత
**ఆలూరు గోపాలరావు**

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# సాయిబాబా చరిత్రము

## విషయసూచిక

# చరిత్ర పారాయణ క్రమ విధానము

పారాయణ గురువారము ప్రారంభించి బుధవారముతో రోజుకొక అధ్యాయము చొప్పున పారాయణ చేయవలెను. గ్రంథమంతయు ఒక్క రోజులో కూడ పారాయణ చేయవచ్చు. కోర్కెలతో పారాయణ చేయువారు ప్రతిరోజు పారాయణ పూర్తి అయిన తరువాత ధూప, దీప నైవేద్యాదులు యథాశక్తి జరుపవలెను. షిరిడీకి రూ. 2/- లకు తక్కువ కాకుండ దక్షిణ పంపవలెను.

సాయినాథుని చరిత్రమును అర్థము చేసుకొనుచు పారాయణ చేయుట ముఖ్యము. నిష్కామ బుద్ధితో నిత్యము చదువుకొనువారు నియమ నిబంధనలు పాటించనవసరములేదు. విశ్వాసముతో చదివి ఆచరించుటే బాబాకు ఇచ్చు దక్షిణ. మీరు చదివిన తరువాత చరిత్రను ఊరకనే యుంచక మీ కుటుంబములోని వారికి, మిత్రులకు, బంధువులకు ఇచ్చి చదివించి బాబా తత్త్వము వారికి తెలియునట్లు జేయుటయే మనము చేయు బాబా సేవ. సాయి తత్త్వ సుస్థిరతను ప్రోత్సహించుట మనందఱి కర్తవ్యము. ఈ గ్రంథమును బహుమతిగా, జన్మదిన, వివాహ గృహప్రవేశాది శుభ సమయములలో బంధుమిత్రులకు ఇచ్చిన యెడల ఫలితమధికమగునని నా ఆశయము.

దక్షిణ పంపవలసిన చిరునామా : **Executive Officer,**
**Shiridi Sai Baba Samsthan, SHIRIDI Post,**
**Kopargam Tauk - Ahmed Nagar Dt.**
**Maharastra state, Pin 423 109.**

"అందఱి భగవంతుడు ఒక్కడే"
"దేహమే దేవాలయము"
"హృదయమే దైవ పీఠము"
"మానవ సేవయే - మాధవ సేవ"

# ప్రార్థన

## ఓం శ్రీ సాయిరాం – గురుదేవదత్త

ఏకదన్తం మహాకాయం లంబోదర గజాననం ।
విఘ్ననాశకరం దేవం హేరంబం ప్రణమామ్యహమ్ ॥

సరస్వతి మహాభాగే విద్యే కమలలోచనే ।
విద్యారూపే విశాలాక్షి విద్యాం దేహి నమోస్తు తే ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

జగదుత్పత్తి కర్త్రే చ స్థితి సంహార హేతవే ।
భవపాశ విముక్తాయ దత్తాత్రేయ నమోస్తు తే ॥

నమశ్శ్రీ వేంకటేశాయ నమో బ్రహ్మోదరాయ చ ।
నమో నాథాయ కాన్తాయ రమాయాః పుణ్యమూర్తయే ॥

సిద్ధి బుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని ।
మన్త్ర పూతే సదా దేవి మహాలక్ష్మి నమోస్తు తే ॥

బుద్ధి ర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వంచ హనుమత్స్మరణాద్భవేత్ ॥

# శ్రీ సాయినాథుని ఏకాదశ సూత్రములు

1. షిరిడీ ప్రవేశమే సర్వ దుఃఖ పరిహారము.
2. అర్హులైననేమి, నిరుపేదలైననేమి ద్వారకామాయి ప్రవేశించినంతనే సుఖసంపద లందగలరు.
3. ఈ భౌతిక దేహానంతరము సైతము నేనప్రమత్తుడనే.
4 నా భక్తుల రక్షణము నా సమాధి నుండియే వెలువడును.
5. సమాధి నుండియే నేను సర్వ కార్యములు నిర్వహింతును.
6. సమాధినుండి నా మానుష శరీరము మాట్లాడును.
7. నన్నాశ్రయించు వానిని, నన్ను శరణుజొచ్చిన వానిని నిరంతరము రక్షించుటయే నా కర్తవ్యము.
8. నా యందెవరి దృష్టి కలదో వారి యందు నా కటాక్షము కలదు.
9, మీ భారములు నాపై పడవేయుడు, నేను మోసెదను.
10. నా సహాయము గాని, సలహా గాని కోరిన తక్షణమే ఒసంగెదను.
11, నా భక్తుల గృహముల యందు లేమి యను శబ్దము పొడచూపదు.

ఓం

శ్రీ

# సాయిబాబా చరిత్రము

## నిత్య పారాయణ గ్రంథము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త



శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞాన మూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షి భూతం
సాయి నాథం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ॥

## ప్రథమాధ్యాయము

# శ్రీ షిరిడీ సాయిబాబా ఎవరు?

# వారి చరిత్ర ఏమి?

సకల దేవతా స్వరూపుడును, సర్వ వ్యాపకుడును, సమర్థ సద్గురువును నగు శ్రీ షిరిడీ సాయిబాబాను గురించి తెలుసుకొనుటకు ప్రతి సాయి భక్తుడును ప్రయత్నిస్తాడు. అణువులో అణువై ప్రపంచమంతా తానైన స్వామిని, పరబ్రహ్మ పరిపూర్ణావతారుడైన ఆ సద్గురు సాయిని గురించి పూర్తిగా తెలుసుకొనగలుగుట మానవమాత్రులమైన మనకు సాధ్యము కాదు. అనంతమైన ఆ స్వామి లీలలు - చర్యలు వేదముల వలె నిగూఢములై, పవిత్రములై, ఫలదాయకములై మానవులు తరించు మార్గమును చూపునట్టివి. అట్టి ఆ స్వామి లీలలు కొన్ని మనము తెలుసుకొని ఆనందించి జన్మ సాఫల్యము చేసికొందము.

## సాయిబాబా ప్రకటన

1854లో షిరిడీ గ్రామములో గ్రామమునకు ఉత్తరపు ప్రక్కన నున్న ఒక వేప చెట్టు క్రింద మొదటిసారిగా శ్రీవారి ప్రకటన జరిగినది. అప్పటి వారి వయస్సు 16 సంవత్సరములుగా గుర్తించబడినది. చక్కని అందమైన, తేజో మూర్తియైన కుర్రవానిగా చలికి - వేడికి లెక్కచేయక ఎవరితో మాట్లాడక, దేనికి భయపడక, ఆహారము కోరక నిరంతర తపమాచరించిన తపోమూర్తియైన బాల ఫకీరుగా షిరిడీ వాసులు వారిని దర్శించిరి. వారిని స్వయముగా చూచిన వృద్ధురాలైన నానా చోప్‌దారు తల్లి కూడ ఇట్లే చెప్పినది. మూడు సంవత్సరములు అచటనే యుండి హఠాత్తుగ అదృశ్యమై ఎచటికో వెళ్ళిరి.

## బాబా రెండవసారి షిరిడీ వచ్చుట

1858వ సంవత్సరములో ఔరంగాబాద్ జిల్లాలోని ధూప్ గ్రామము దగ్గర ఒక మామిడి చెట్టు క్రింద తలపై టోపీతో పొడవైన చొక్కా ధరించి చంకలో "సటకా" (ఇనుప చువ్వ) పెట్టుకొనిన వారి రూపును చాంద్ పాటీలు అను నతడు దర్శించుట జరిగినది. చాంద్ పాటీలు యొక్క తప్పిపోయిన గుఱ్ఱపు జాడ చెప్పుటయే గాక సటకాతో భూమిపై కొట్టి నీరు-నిప్పు తెప్పించి వానితో చిలుము వెలిగించుట చూచిన చాంద్ పాటీలు వీరిని గొప్ప "ఔలియా" గా గుర్తించి వారిని ధూపు గ్రామమునకు ఆహ్వానించిరి. అప్పుడే వారి లీలలకు పంచభూతములను శాసించుటతో నాంది పలుకుట జరిగినది. చాంద్ పాటీలు యొక్క చుట్టముల పెండ్లి బృందముతో బండ్లపై బాబా షిరిడీ వచ్చిరి. బాబా షిరిడీ వచ్చుట యిది రెండవసారి. ఖండోబా మందిరమునకు ముందు గల ఖాళీస్థలములో ఆగిన ఆ పెండ్లివారి బండిలోని ఒక ఎద్దులబండి నుంచి దిగుచున్న ఆ బాల ఫకీరును చూచి ఆదరముగా "ఆయియే సాయి" (దయ చేయుము సాయి) అని ఖండోబా మందిర పూజారియగు "భక్త మహాల్సాపతి" స్వాగతము పలికిరి. నామ రహితుడైన భగవంతుడు 'సాయీ' అనే నామముతో నాటి నుంచి "సాయిబాబా"గా పిలువబడినారు. సాయి అనగా పరమాత్ముడనియు, బాబా అనగా తండ్రి అనియు అర్థము. వారు షిరిడీలోనే స్థిర నివాసముగ నున్నందున "శ్రీ షిరిడీ సాయిబాబా"గా గుర్తించుట జరిగినది,

"సాయి" అనే యీ రెండక్షరముల నామమే కలియుగ మానవులకు ఇహ-పర సుఖములను ప్రసాదించి భవ సాగరము దాటించు తారక మంత్రమైనది.

## సాయిబాబా వయస్సు

1858 కి అనగా బాబా రెండవసారి షిరిడీ వచ్చునప్పటికి వారి వయస్సు 20 సంవత్సరములుగా గుర్తించబడినది. కనుక వారి ప్రకటన (పుట్టుక) 1838 వ సంవత్సరమయి యుండవచ్చు. 1918 లో వారు దేహ త్యాగము చేయునప్పటికి వారి వయస్సు (దేహముతో) 80 సంవత్సరములు. 1858లో వారు రెండవసారి షిరిడీ వచ్చునప్పటి నుండి 1918 లో అనగా వారు దేహత్యాగము చేయువఱకు (మహా సమాధి వఱకు) 60 సంవత్సరములు షిరిడీలో యుండిరి. ఒకసారి ధూలియా కోర్టు వారికి సాక్ష్యము ఇచ్చుటలోనే బాబా తన వయస్సు లక్షల సంవత్సరములని చెప్పినారు. ఇంతే కాక మొదటిసారి బాబా వచ్చిన తన 16 సంవత్సరముల వయస్సు నాటికే 12 సంవత్సరముల పాటు తపమాచరించినట్లు ఖండోబా యను దేవత ఆవేశించిన గణాచారి చెప్పినాడు. కనుక బాబా వయస్సును ఎవరు నిర్ణయించగలరు ?

## బాబా పుట్టుక—మతము

బాబా పుట్టుకను గుఱించి సరియైన సమాచారము లేదు - తల్లి దండ్రు లెవరో తెలియదు. వివాహము లేదు. ఆజన్మ బ్రహ్మచారి. బాబాది ఏమతమో, ఏ కులమో తెలియదు. ధూలియా కోర్టు వారికి "తన మతము కబీరు అని, కులము దైవకులమని" బాబాచెప్పినారు. తనకు ఎట్టి అవసరము లేకపోయినను మానవ రూపము ధరించి, మానవుల మధ్య సంచరించి తన మాట - చూపు ఆచరణల ద్వారా ధర్మ రక్షణకు, సర్వ మత సమైక్యతకు, దీన జన సంరక్షణకు, సకల జీవ జంతు పశు పక్ష్యాది శ్రేయస్సుకు, దుర్మార్గులను సన్మార్గ వర్తనులను చేయుటకు అవతరించిన పరిపూర్ణ పరబ్రహ్మము శ్రీ షిరిడీ సాయిబాబా. బాబా తన జీవితమును బీద - సాదలతో కలసి మెలసి వారి సంరక్షణతో ప్రారంభించినారు. సాయి కారణ జన్ముడు. స్వయంభువు.

## సాయిబాబా నివాసము

సాయిబాబా షిరిడీలో పాడుబడిన మసీదులో నివసించిరి. దానికి "ద్వారకామాయి" అని పేరిడిరి. ఈ మసీదుకు రాక పూర్వము 'తకియా' (రచ్చ) మఱియు మారుతీ ఆలయములందును ఇతర సాధువుల తోడను కలసి నివసించిరి. భక్తులు బాబాను ఈ మసీదులోనే దర్శించేవారు. మొదటి రోజులలో భక్త మహాల్సాపతి, అప్పాజోగ్లే, కాశీరాంలు మాత్రమే బాబా వద్దకు వస్తూ ఉండేవారు. బాబా ద్వారకామాయి ముందు ఖాళీ జాగాలో తులసి వనము పెంచిరి.

## బాబా రూపు రేఖలు

ప్రప్రథమమున షిరిడీ ప్రజలు బాబాను పిచ్చి ఫకీరుగా భావించారు. సాయిబాబా అప్పుడప్పుడు తనలో ఏదో మాట్లాడుకొనుచుండేవారు. అది ఎవ్వరికి అర్థమయ్యేది కాదు. ఒక్కొక్కప్పుడు కోపంగా ఉండేవారు. కేకలు వేస్తూ ఉండేవారు. ఆ సమయంలో వారి దగ్గరకు వెళ్ళుటకు భక్తులు భయ పడేవారు. వారి చర్యలు అగమ్య గోచరములు.

యవ్వనమందు బాబా తల వెంట్రుకలు కత్తిరించిక పెంచేవారు. పహిల్వాన్ వలె దుస్తులు వేసుకునేవారు. మొట్ట మొదటలో ఆకుపచ్చ జుబ్బా ధరించేవారు. బాబా జీవిత చరిత్ర పుస్తకములో ఈ క్రింది విధముగా ఉన్నది.

షిరిడీలో మొహియుద్దీన్ తంబోలి అను నతడు తరచుగా కుస్తీలు పట్టెడివాడు. బాబా అతనితో కుస్తీ పట్టి అందులో ఓడి పోవుటచే బాబా తాను ధరించు దుస్తులు, నివసించు రీతులు మార్చుకొనినారు. అప్పటి నుండి తలకు గుడ్డ కట్టుకొనుట ప్రారంభించినారు. కొంత కాలమునకు తంబోలిలో పరివర్తన వచ్చి సాత్త్విక భావుడై షిరిడీ విడిచివెళ్ళి ఒక దర్గా వద్ద కుటీరములో నివసించినాడు. బాబా అలా ఓడి పోవుట తంబోలీని కరుణించుటకై ఉండవచ్చు. ఈ మానవులకు భౌతికమైన బలము కంటె ఆధ్యాత్మిక సంపదయే ముఖ్యమనియు అది తనకున్నదనియు నిరూపించినారు సాయి.

కాని పై సంఘటనకు భిన్నముగా ఈ క్రింది విధముగా తెలియచున్నది. షిరిడీలో కుస్తీ పోటీలు జరుగు చుండెడివి. కాని తంబోలీ మాత్రము కుస్తీలు పట్టెడివాడు కాదు. తమాషాలు చేసెడివాడు, ఒకరోజు తంబోలీ బాబా వద్దకు వచ్చి కుస్తీలో బాబాను ఓడినట్లుగా వ్రాసి ఈయమని కోరినాడు. బాబా ఒక కాగితముపై "నేను ఓడినాను"అని వ్రాసి యిచ్చినారు. తంబోలి అ కాగితమును తన యింటికి తీసికొని వెళ్ళి తన భార్యకు ఈయగా ఆమె కాగితమును చదివి, నవ్వి తిరిగి ఆ కాగితమును తంబోలికి ఇచ్చినది. తంబోలి ఆ కాగితమును చదివి అది తన వ్రాతగా ఉండుట. క్రింద తన సంతకముగా ఉండుట చూచి ఈ లీలకు ఆశ్చర్యపడి బాబా వద్దకు వచ్చి శరణు వేడినాడని చెప్పబడు చున్నది.

బాబా లంగోటి బిగించుకొని, పొడవైన చొక్కా తొడుగుకొని, నెత్తిపై గుడ్డ కట్టుకొనేవాడు. తెల్లని వస్త్రములే ధరించేవారు. తలపై గుడ్డ జడ వలె యెడమ చెవి పైనుంచి వెనుకకు వ్రేలాడునట్లు వేసుకొనేవారు. గోనె (పట్టా) ముక్కపైనే మసీదులో ఈశాన్య మూల కూర్చునేవారు. 1890 వరకు బాబా కాలికి గజ్జెకట్టి 'తకియా'లో ఇతర ఫకీర్లతో కలసి నాట్యముచేసి భక్తి పాటలు పాడేవారు. బాబా ఎప్పుడును పగటివేళ పడుకొనేవారు కాదు. కూర్చుని ఉండేవారు. భక్తులు రాగానే ఒకసారి వారి వంక చూచేవారు. సాయిబాబా జనులతో కలసి - మెలసి యుండేవారు. అలిగినప్పుడు మాత్రమే జవాబు చెప్పేవారు. మిత భాషి, మొదట్లో దినమంతయు వేప చెట్టు నీడ యందు (అదే యిప్పటి గురుస్థానము). ఊరి వెలుపల నున్న కాలువ యొడ్డున తుమ్మ చెట్ల నీడ యందు కూర్చునేవారు. సాయంకాలము పచారు చేయుట కాని, నీమ్ గామ్ వెళ్ళుట కాని చేసేవారు. బాబా షిరిడీ వచ్చిన మొదటి రోజులలో నీమ్ గామ్‌లో డేంగలే యింటికి, రాహతాలో దౌలత్ షా కుశాల్ చంద్ అనే భక్తుని యింటికి వెళ్ళి వచ్చేవారు. నీమ్ గామ్‌లో గాని, రహతాలో గాని నిద్రించేవారు కాదు. దినమంతయు బాబా చుట్టు భక్తులుండేవారు. పిల్లలతో వినోదముగా మాట్లాడేవారు. ఎత్తుకొని ముద్దు చేసేవారు.



## బాబా దిన చర్య

బాబాకు 1) చిలుము గొట్టము 2) పొగాకు 3) తంబిరేలు డబ్బా 4) పొడుగు చొక్కా 5) తల పైని గుడ్డ 6) సటకా మాత్రమే ఉండేవి. గుడ్డలను వారముల తరబడి ఉతకకుండా ధరించేవారు. రెండు మూడు నెలల కొకసారి కఫ్నీ మార్చి పాతది ధునిలో వేసేవారు. కాశీనాథ్ అనే దర్జీని పిలిచి కఫ్నీ తెప్పించుకొనేవారు. స్నానం చేసేటప్పుడు తప్ప కఫ్నీ లేకుండా ఎప్పుడూ ఉండేవారు కాదు. అప్పుడప్పుడు బాలా అనే మంగలి చేత తల నున్నగా గొరిగించుకొనేవారు. మీసము కోసగా కత్తిరించుకొనేవారు. చెప్పులు తొడిగేవారు కాదు. లెండి తోటకు వెళ్ళేటప్పుడు (ఉదయం 9-30) మాత్రము బాబా పాదరక్షలు తొడిగేవారు. చిలుము తాను పీల్చి యితర భక్తులకు ఇచ్చేవారు. ఆ చిలుము పీల్చిన భక్తులు ఆరోగ్యవంతులగు చుండిరి. కాశీరాం అనే భక్తుడు చిలుము గొట్టములు, పొగాకు ధునిలో వేయుటకు కట్టెలు ఇస్తూ ఉండేవాడు. బాబా ధునిలో చేయి పెట్టినప్పటి నుండి భాగోజి అనే కుష్ఠురోగి ప్రతిరోజు ఉదయం గం. 7-30 లకు బాబా చేతికి నెయ్యి మర్దించి దానిపై ఆకువేసి కట్టు కట్టేవాడు. కాలిన గాయము తగ్గినా బాబా దేహత్యాగము వఱకు భాగోజి కట్టు కట్టుచునే యుండేవాడు.

రాను రాను బాబా దినచర్యలో కొంత మార్పు వచ్చినది. దినమంతయు మసీదులో గోనె పట్టా పైనే కూర్చునేవారు. 1912 లో మసీదులో నగిషి రాళ్ళు తాపడము చేసినప్పటినుండి చిన్న పరుపుపై కూర్చుండుట ప్రారంభించిరి. కౌపీనము ధరించేవారు. చలి నివారించుటకు 'ధునికి' ఎదురుగా ఎడమ చేయి కట్టడా పై వేసి దక్షిణ ముఖముగా కూర్చుండేవారు. ఉదయమున లేచిన తరువాత ధుని దగ్గర గల స్తంభమును ఆనుకుని ధ్యాన నిమగ్నులయ్యేవారు. ఏవో భంగిమలు చేసేవారు. తన చేతులు, వ్రేళ్ళు చిత్ర విచిత్రముగా కదిలిస్తూ "హాక్" (పరమాత్మ) అనే పదము ఉచ్చరించేవారు. బాబా పగటివేళ తన గద్దె ప్రక్కన తన వద్దనున్న యిటుక రాతిపై చేయి యుంచి కూర్చుండేవారు. రాత్రి వేళ ఆ యిటుక రాతిని తల క్రింద పెట్టుకొనెడివారు.

బాబా ఎల్లప్పుడు అల్లా నామము ఉచ్చరించుచుండేవారు. ఉదయం గం. 9-30 ప్రాంతములో, మధ్యాహ్నము, సాయంత్రము గం. 5-00

ప్రాంతములో లెండితోట వైపు గాని, చావడి వైపు కాని పచారు చేయుచుండేవారు. బాబాకు అన్ని భాషలు తెలిసినప్పటికిని మరాటి భాషలోనే మాట్లాడేవారు. శ్యామా స్కూలు టీచరుగా పని చేస్తూ మసీదుకు ఎదురుగానున్న తన స్కూలులో రాత్రులు నిద్రించేవారు. మసీదులో రాత్రులందు హిందీ, ఇంగ్లీషు భాషలలో ఎవరో మాట్లాడుచున్నట్లు వినిపించేది. బాబా ఒక్కరే ఉండేవారు. బాబా కొందఱి భక్తుల తలలపై తన హస్తము నుంచేవారు. కొందఱి వీపుపై చేతితో తట్టేవారు. కొందఱిని వారి వాక్కుతోనే ఆశీర్వదించేవారు. కొందఱిని వారి చూపుతో ఆనందపఱచేవారు. అయా భక్తులు తమ తపు యోగ్యతను బట్టి బాబా యొక్క స్పర్శ, వాక్కు, చూపులతో ఫలితము పొందేవారు. బాబాను భక్తులు పూలతో పూజించేవారు.

ప్రస్తుతము బూటీ (బుట్టి) యను కోటీశ్వరుడు నిర్మించిన సమాధి మందిర స్థానమున ప్రథమమున బాబా చదును చేసి 'రహతా' నుంచి బంతి గన్నేరు, నిత్య మల్లెమొక్కలు మున్నగునవి తెచ్చి యిచట పూల తోట పెంచినారు. వామన్ తాత్యా అనే కుమ్మరి భక్తుడు సాయికి రోజు రెండు కాల్చని కుండలు ఇచ్చేవాడు. బాబాయే బావి నుంచి ఈ కుండలతో నీళ్ళుచేది ఆ చెట్లకు నీరు పోసేవాడు. సాయంకాలము వేపచెట్టు క్రింద ఆ కుండలు బోర్లించితే అవి కాల్చనివి కనుక పగిలి పోయేవి. వామన్ తాత్యా మరు రోజున ఇంకా రెండు కుండలు తెచ్చి యిచ్చేవాడు. అచట బాబా కృషి వలన పూలతోట అభివృద్ధి చెందినది. ఈ విధముగా మూడు సంవత్సరములు మాత్రమే జరిగినది.

## బాబా భిక్షాటన

1858 లో బాబా రెండవసారి షిరిడీ వచ్చిన తరువాత బాబాను చూచీ చూడగనే బాబాలోని భగవత్తత్త్వమును గుర్తించి త్రికరణ శుద్ధిగా బాబాకు అంకితమైన సద్భక్తులు శ్రీ భక్త మహల్సాపతి, శ్రీమతి బయాజా బాయిలు మాత్రమే. బాబా షిరిడీ వచ్చిన మొదటలో, తాత్యా కోటే పాటీలు తల్లి బయాజీబాయి రొట్టె, కూర చేసి అవి గంపలో పెట్టి, ఆ గంపను తన తలపై పెట్టుకొని మధ్యాహ్నము గం. 12-00 లకు బాబా యెచట నున్నను వెదకి, చివరకు అడవిలో బాబా తపస్సు (సమాధి స్థితిలో) చేయుచున్న చోటుకుపోయి

బాబాకు భోజనము బలవంతముచేసి తినిపించిన తరువాతనే ఆమె భుజించెడిది. కొంత కాలము తరువాత బాబా అడవికి పోవుట మాని మసీదులోనే కూర్చుండి భోజనము చేసేవారు. ఆమె చనిపోయేంతవఱకు బాబా భోజనము చేశాడని తెలిసిన తరువాతనే ఆమె భోజనము చేసేది. బాబా కాఫీ, టీలు వంటివి త్రాగేవారు కాదు.

సాయిబాబాకు షిరిడీలో మొట్ట మొదటిగా భిక్ష పెట్టినది అమీన్‌భాయి అనే ముస్లిమ్ భక్తుడు. బాబా ప్రతి నిత్యము మధ్యాహ్నం గం 12-00 లకు సఖారాం షెల్కె, నందూ మార్వాడి, గణపతిరావు కోతే, బయాజా మామి, వాగున్ గోండ్కర్ అను ఐదుగురి యిండ్లలో భిక్ష చేసేవారు. బాబా ఒక చేతితో తంబరేలు డొక్కు, ఇంకొక చేతితో గుడ్డజోలె పట్టుకొని భిక్షకు పోయేవారు. ఇండ్ల వద్ద భిక్షకునివలె నిలచి "అక్కా! రొట్టె ముక్క పెట్టు" అనుచు దానిని అందుకొనుటకు చేయి చాచేవారు. అన్నము, రొటెలు మొదలగునవి జోలెలో వేసుకునేవారు.పలుచని పదార్థములు పులుసు, మజ్జిగ, కూరలు మొదలగునవి డొక్కులో పోసుకునేవారు. భిక్ష నుంచి తిరిగి వచ్చిన తరువాత ఒక రొట్టె, కొద్ది అన్నము ధునిలో ఆహుతిగా వేసేవారు. ఈ భిక్షలో దొరికిన పదార్థములన్నియు మసీదులో ఒక మట్టి పాత్రలో పోసేవారు. మసీదు తుడిచి శుభ్రము చేయు స్త్రీ 10, 12 రొట్టె ముక్కలు తీసుకొనుచుండేది. కుక్కలు, పిల్లులు, కాకులు విచ్చల విడిగా తినుచుండగా, వానితో కలిసి బాబా కూడ తినెడివారు. బాబా రుచులకాశించి ఎరుగరు. బూటీ వంటి కోటీశ్వరులు తమ ప్రక్కన నున్నను, భక్తులు ప్రేమతో పంచ భక్ష్య పరమాన్నములు తెచ్చి వారి ముందుంచినను, వానికాశించక భిక్షాన్నమునే వారు భుజించెడివారు. బాబా మొదటి 15 సం॥లు ప్రతి రోజు పలుసార్లు భిక్ష చేసేవారు. తరువాత ఒకేసారి చేసేవారు. బాబా నడవ లేనప్పుడు కూడ భక్తులను పట్టుకొని భిక్షకు మఱియు లెండి తోటకు వెళ్ళేవారు. సాయిబాబా తన జీవిత కాలమంతయు ఈ విధముగా ఆచరణ ద్వారా చూపి గృహస్థుడైనవాడు అన్నదానము చేయవలెనని వారి విధిని వారికి జ్ఞప్తికి తెచ్చిరి. ప్రతి నిత్యము మనము చేయు పంచ పాపములను తొలగించుకొనుటకు పంచ యజ్ఞములు చేయవలెను. అతిథేయులకు భోజన సత్కారము చేయుట ఈ పంచ యజ్ఞములలో ఒకటి.

బాబా మసీదులో నేలపై గోనె పఱచి, దానిపై తిరుగలి యుంచి చేటలో గోధుమలు పోసి కఫ్నీ, చేతులు పైకెత్తి పిడికెడు చొప్పున గోధుమలు వేయుచు విసరెడివారు. ఆ గోధుమ పిండితో రొట్టెలు చేసేవారు. లక్ష్మీబాయి షిండే పంపే రొట్టె (బాబా భిక్షాటన చేస్తూనే) బాబా తినగా మిగిలినది రాధా కృష్ణమాయికి పంపేవారు. బాబా తాంబూలము రాత్రి - పగలు వేసుకొనేవారు. కొంత కాలము తరువాత యీ తాంబూలం రాధా కృష్ణమాయి సిద్ధము చేసేది. తాంబూలము వేసుకొన్న తరువాత బాబా ఎక్కువగా మంచి నీరు త్రాగేవారు. మధ్యాహ్న భోజనం తరువాత తాంబూలము వేసుకొని కొంతసేపు ప్రశాంతముగా గడిపేవారు.

## బాబా సముఖములో హారతులు

షిరిడిలో ఈ హారతులకు ప్రత్యేక స్థానమున్నది. ఉదయం గం. 5-15 లకు కాకడ హారతి, మధ్యాహ్నము గం. 12-00 లకు మధ్యాహ్న హారతి. సాయంత్రము గం. 6-15 లకు సంధ్యా హారతి (ఈ సంధ్యా హారతి సూర్యాస్తమయ సమయములో ఈయబడును.) రాత్రి గం. 10-00 లకు శేజహారతి ఈయబడుచున్నవి. దేశములోని అన్ని సాయి మందిరములలో కూడ ఒకే సమయమునకు ఈ హారతు లీయబడుచున్నవి. సాయంత్రము గం. 6-15 లకు ఇచ్చు హారతికి ఒకే వత్తితోను, మిగిలిన మూడు హారతులకు 5 వత్తులతోను హారతి ఇస్తారు. రాధా కృష్ణమాయీ కృషివలన బాబా సముఖములో ఈ హారతులు ప్రారంభించుట, సాయి సంస్థానమును ఏర్పరచుట, కావలసిన వస్తువులు భక్తుల నుంచి నమకూర్చుట జరిగినది. ఈ సంస్థానమునందు బాబా దగ్గర ఇద్దరు పెద్దవారు ఫౌజుదారులు గాను (రక్షకులు గాను) ఇద్దరు యువకులు బాదీ దార్లుగాను (వాయిద్యగాళ్ళు) ఉండేవారు. నప్పుతీ పాటిల్ అను నతడు బాదీ దారుగా 3 సం॥లు సాయి సేవ చేసియున్నాడు.

1908 నుండి మొదట మేఘుడు, తరువాత బాపు సాహెబు జోగ్ నిత్యము నాలుగు వేళల సాయి సన్నిధిలో హారతి యిచ్చేవారు. ది. 10-12 1910 నుండి చావడిలో రోజు మార్చి రోజు రాత్రి శేజహారతి, మరు రోజు ఉదయము కాకడ హారతి యిచ్చుట ప్రారంభించిరి. ఇప్పటికీ నాలుగు వేళల

హారతులు మసీదులో కాని, చావడిలో గాని ఇచ్చుటలేదు. హారతులన్నియు సమాధి మందిరములోనే యిస్తున్నారు.

మధ్యాహ్న హారతి అయిన పిమ్మట బాబా మసీదు బయటకు వచ్చి రోడ్డు ప్రక్క మసీదు ముందు గోడ ప్రక్కగా నిలుచుండి ప్రేమతో, దయతో భక్తులకు ఊది ప్రసాదము పంచి పెట్టెడివారు. బాబా భక్తుల చేతులలో పిడికెళ్ళతో "ఊది" పోయుచు వారి నుదుటిపై తమ చేతులతో "ఊది" పెట్టేవారు. "అన్నా ! మధ్యాహ్న భోజనమునకు పొమ్ము !" "బాబా! బసకు పో !" "బాపూ! భోజనము చేయుము!" అని ప్రతి భక్తుని సాయి ఆదరముతో పల్కరించి యింటికి పంపేవారు. హారతి పూర్తి అయిన తరువాత భక్తులు బాబా పాద తీర్థమును తీసికొనేవారు. ఊది తీసికొని వెళ్ళునట్లుగా, బాబా పాద తీర్థము కూడ ఇండ్లకు భక్తులు తీసికొని వెళ్ళేవారు. ఈ హారతుల సమయములో మాత్రము బాబా తన ఆసనముపై ప్రశాంతముగా కూర్చొనేవారు.

బాబా దేహ త్యాగము చేసిన మరుసటి రోజు ఉదయం లక్ష్మణ్ మామా జోషికి బాబా స్వప్నములో కనుపించి "బాపు సాహెబు జోగ్ నేను మరణించితి ననుకొనుచున్నాడు, అందుచే అతడు రాడు. నీవు పూజ చేసి కాకడ హారతి నిమ్ము" అని చెప్పగా, సనాతనాచార పరుడైన జోషి వచ్చి నిర్జీవమైన బాబా దేహమునకు పూజచేసి హారతి యిచ్చెను. అనగా తాను దేహ త్యాగము చేయుట తన అవతార పరి సమాప్తి కాదని, సర్వగతుడనై యున్నానని, తనకు - తన పటమునకు భేదము లేదని చెప్పినట్లుగా హారతులు ఆపకుండా నిరంతర మీయుమని ఆదేశించుటయే యగును. ప్రాతః కాలములో ఉదయము గం. 5-00 లకే తన భక్తులు మేల్కొనవలెనని, రాత్రి గం. 10-00 ల తరువాత నిద్రించవలెనని, అనారోగ్య వంతులకు వైద్యుడు నిర్ణీత వేళలలో మందులిచ్చి స్వస్థత కలిగించునట్లుగా, మనస్సు అన్యచింతనల యందు లగ్నము కాకుండ హారతులకు నిర్ణీత వేళలు నిర్ణయించబడి సాయి భగవంతుని సద్గురుని నిరంతరము తలచు చుండుటే యీ నాలుగు వేళల హారతుల అంతర్యము కదా! ఈ హారతుల పాటలు ఎక్కువగా మరాటి భాషలో నున్నవి. వాని అర్థమును తెలుసుకొనుట అవసరము. షిరిడీ దర్శించు వారీ హారతులలో పాల్గొనుటకు ప్రాధాన్యత యిస్తారు.

## బాబా నిద్రించుట – పడకలు

సాయినాథుడు ఆదిలో మసీదులో చింకి చాపపై పరుండుట ప్రారంభించినాడు. కొద్ది కాలము తరువాత బాబా, తాత్యా కోతే పాటీలు, మహాల్సాపతి తలలను తూర్పు - పడమర - ఉత్తరముల పెట్టి ఒకరి కాళ్ళకు ఒకరి కాళ్ళు తగులునట్లుగా రాత్రులందు మసీదులో పడుకొనేవారు. రాత్రి ప్రొద్దు పోయేంత వఱకు పరస్పరం మాట్లాడుతుండేవారు. ఒకరు నిద్రపోయినట్లు తెలిసిన మఱియొకరు లేపుచుండెడివారు. తాత్యా 14 సం॥లు, తన తండ్రి చనిపోయేంత వఱకు మసీదులోనే పడుకొన్నాడు.

బాబా పడుకొనుటకు నానా సాహెబు డేంగలే యిచ్చిన నాలుగు మూరల పొడవు, జానెడు వెడల్పు గల ఒక చెక్క (కర్ర) బల్లను మసీదు వెన్నుపట్టెకు (దూలమునకు) చింకి గుడ్డ పీలికలతో వ్రేలాడదీసి ఆ బల్లమీద నాలుగు చివరల నాలుగు దీపపు ప్రమిదెలు పెట్టి పడుకొనేవారు. బాబా అంత ఎత్తు బల్లపై ఎట్లు పడుకొనెడివారో ఎవరికి అంతు పట్టెడిది కాదు. కొన్నాళ్ళు గడచిన తరువాత ప్రజలు వచ్చి వింతగా చూచు చుండుటచే విసుగుచెంది బాబాయే స్వయముగా ఆ బల్లను విఱచివైచిరి.

1909 డిశంబరు 9వ తేది నుండి ఒకరోజు మసీదులోను, ఒకరోజు చావడిలోను (రోజు మార్చి రోజు) బాబా పడుకొనేవారు. ఛావడిలో తన పరుపును తానే అమర్చుకొని 50, 60 దుప్పట్లు ఒకదానిపై ఒకటి వేసి దానిపై నిద్రించేవారు. చావడిలో పడుకొన్న మరుసటి యుదయము కాకడ హారతి అయిన తరువాత మాధవ ఫస్లే మసీదు శుభ్రము చేసి చావడి వద్దకు వచ్చి బాబాను పిలిచిన తరువాత బాబా బయలుదేరి మసీదుకు వచ్చేవారు. మసీదు వద్ద ఫస్లే పెట్టిన నీళ్ళ బక్కెటులోని నీళ్ళతో కాళ్ళు, చేతులు, ముఖము కడుగుకొని నీళ్ళు పుక్కిలించి కొంత సేపు మౌనంగా కూర్చొని తరువాత ధునిలో కట్టెలు సరిచేసి భక్తులతో రాత్రి తాము భక్తులనే విధముగా కాపాడింది, ఏ ఏ లోకాలకు వెళ్ళినది చేప్పేవారు.

## "ధుని" – ఊది మహిమ – రోగ నివారణ

ద్వారకామాయిలో (మసీదులో) నిరతాగ్నిహోత్రమును అనగా "ధుని"ని ఏర్పాటు చేశారు. ఆ ధుని నేటికిని అట్లే వెలుగుచున్నది. ఆ ధుని నుండి వచ్చు 'ఊది' చాలా పవిత్రమైనది. బాబా మొదటలో రోగులకు మూలికలు - మందులు ఇస్తూ ఆరోగ్యవంతులను చేస్తుండేవారు. తరువాత ఊదినే మందుగా ఇస్తూ - తన వాక్కే సర్వరోగములు-బాధలు తీర్చగలదని నిరూపించి ఎందఱినో రక్షించిరి.

## సర్వాంతర్యామి సాయి

సాయి వద్దకు వచ్చు భక్తుల భూత, భవిష్యత్, వర్తమానములు, ఎట్టి ఆలోచన చేయకయే చూచి - చూడగనే చెప్పిన - ఎచ్చటనో దూరములో జరుగుచున్న సంఘటనలు మసీదులోనే యుండి ఆ సంఘటనలు చెప్పగలిగిన- ఎంత దూరములోనున్న భక్తుడైన ఎట్టి ప్రమాదములో నున్నను "సాయీ" అని ఆర్తితో అర్థించినా, ఆ క్షణములోనే తాను మసీదులోనే యుండి అంత దూరములో నున్న వారిని రక్షించిన-సర్వాంతర్యామి "సాయి". ఇప్పుడు కూడ త్రికరణ శుద్ధిగా సాయిని సేవించు భక్తులు రక్షింపబడుట జరుగుచున్నది.

బాబా వాక్కు జవదాటరానిది. వారి అనుమతి లేనిదే ద్వారకామాయి మెట్లు ఎవరూ ఎక్కలేరు. షిరిడీ వచ్చినవారు బాబా అనుజ్ఞ లేనిదే వెళ్ళేవారు కాదు. బాబా, వెళ్ళుటకు అనుమతి యిచ్చిన తరువాత ఆ భక్తుడు మఱల అచట నుండుటకు వీలులేదు.

## ద క్షి ణ

మొదటిలో బాబాకు పైసలు ఇస్తూ ఉండేవారు. ఒక కాని యిచ్చినా బాబా దానిని జేబులో వేసుకొనెడివారు. అర్థణా యిచ్చిన తిరిగి యిచ్చేవారు. దానితో నూనె, పొగాకు కొనేవారు. కొంత కాలము తరువాత భక్తులు ఎక్కువగా వస్తూ ఉండగా బాబా భక్తుల నుండి దక్షిణ స్వీకరించుట ప్రారంభించారు. నేను ఎవరి వద్ద దక్షిణ స్వీకరిస్తానో, వారికి దానికి పదిరెట్లు ఈయవలసియుండునని

బాబా చెప్పిరి. ప్రతి నిత్యము భక్తులు ఇచ్చు దక్షిణలు ఆ సాయంత్రమే బాబా బీదలకు పంచేవారు. బాబా నిర్యాణ సమయమున వారి వద్ద రూ. 7/- లు మాత్రమే యున్నవి. బాబా దేహ త్యాగము చేయుటకు ముందు లక్ష్మీబాయి షిండేకు మొదట రూ. 5/-ల నాణెములను, తరువాత రూ. 4/-ల నాణెములను తన జేబు నుండి తీసి యిచ్చిరి. ఈ తొమ్మిది నాణెములు నవ విధ భక్తులకు సంకేతముగా భావించబడినవి. కొందరి నుండి దక్షిణకు బదులుగా ఆయా భక్తులు చదువు ఆధ్యాత్మిక గ్రంథముల నుండి విషయములు తెలుసుకొని ఆచరించుటను దక్షిణగా అడిగేవారు. పురందరుని బాబా రెండు రూపాయలు దక్షిణ కోరి "నాకు కావలసినవి నాణెములు కావు" 1) నిష్ఠ (గాఢ విశ్వాసము) 2) సబూరి (ధైర్యముతో కూడిన ఓర్పు) అని అన్నారు. తరఖడ్ అను వాని భార్యను బాబా రూ. 6/-లు దక్షిణ కోరగా దానిని గూర్చి "కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలను బాబా నిన్ను దక్షిణగా కోరారని" ఆమె భర్త ఆమెకు వివరించి చెప్పినారు. జి.జి. నార్కేను రూ.15/- లు దక్షిణ అడిగి అతడు చదువుచున్న యోగ వాసిష్ఠము నుండి దక్షిణ కోరినట్లు చెప్పి, అతని ఆత్మ జ్ఞానశక్తిని వృద్ధిపఱచి తరించునట్లు చేసిరి. కొందఱి ఉద్యోగుల నుండి బాబా దక్షిణ కోరిన వెంటనే ఆ ఉద్యోగులకు మరుసటి నెల నుండి జీతములో బాబా దక్షిణగా కోరినంత పెరుగుట జరిగినది. గణపతిరావు బోడస్ అను గొప్ప నటుని బాబా గడియ - గడియకు దక్షిణ కోరుచుండగా తన డబ్బు సంచి బాబా ముందు కుమ్మరించెను. ఆనాటి నుండి అతని జీవితములో డబ్బుకు లోటు లేకుండెను.

గోవా నుంచి వచ్చిన మొదటి వ్యక్తిని బాబా 15/- రూపాయలు దక్షిణ అడిగి తీసికొనెను. ఇతడు జీవనాధారము లేక తిరుగుచు, దత్తమూర్తికి నమస్కరించి, నాకు ఏదైనను ఉద్యోగము ప్రసాదించినచో మొదటి నెల జీతమును మీకు సమర్పించుకొందునని మ్రొక్కుకొనెను. దత్త భగవానుని అనుగ్రహముతో అతనికి రూ. 15/- ల జీతముతో ఉద్యోగము దొరికినది. తరువాత ఆ విషయమును (మ్రొక్కును) అతడు మరచిపోయెను. ఇప్పుడు అతని జీతము రూ. 700/- లకు పెరిగినది. అతడు సాయిని దర్శించగనే అతని మ్రొక్కును గుర్తింపు చేసి మొదటి నెల జీతము రూ. 15/- లు అతని నుండి బాబా దక్షిణగా కోరి, దత్తాత్రేయుడు, తాను ఒక్కటేనని గుర్తింపు చేసిరి.

దక్షిణ అడుగుటలో బాల - వృద్ధ, స్త్రీ - పురుష, ధనిక - బీద భేదములుండేవి కావు. దక్షిణ ఒకరినే ఎక్కువసార్లు అడుగుట కూడ జరిగేది. దక్షిణ ఈయకపోయినను కోపించేవారు కాదు. అందఱు వారికి సమానమే. అడుగనిదే దక్షిణ యిస్తే నిరాకరించేవారు. రాధా కృష్ణమాయి నివసించే యింటిని బాబా 'శాల' (పాఠశాల) అనేవారు. కొంత మందిని శాలకు పొమ్మనే వారు. భక్తులను దక్షిణ అడుగుట, శాలకు పొమ్మనుటలో త్యాగము - మనో నిగ్రహములతో ఆధ్యాత్మిక జ్ఞానము కలిగించుటకే.

ధూమల్‌ను బాబా ఒకసారి రూ. 50/-లు దక్షిణ అడిగారు. అతని వద్ద లేకపోతే బాబా చెప్పినట్లు సాఠె నడిగి ధూమల్ రూ. 50/- లు తెచ్చి బాబా కిచ్చాడు. సాఠె లోగడ తన పెన్షన్ పెంచమని పెట్టుకున్న ప్రకారము ఆ రోజునే సాఠెకు రూ. 50/- లు పెన్షన్ పెంచుతూ ఆదేశమిచ్చారు. పోలీస్ ఇన్‌స్పెక్టరు సోమనాథ్ వద్ద సాయి రూ. 10/- లు దక్షిణ తీసికొన్నారు. ఆ రోజు నుంచే అతని నెల జీతములో రూ. 10/- లు పెరిగినది.

నాందేడు నివాసియగు రతన్‌జీ షాపుర్జీ వాడియాని బాబా దక్షిణ రూ. 5/- లు కోరి అతడు ఇచ్చు లోగానే 3-14-0 లు ముట్టినవని చెప్పి రూ. 1-2-0లు మాత్రమే తీసికొన్నారు. ఇందుకు సమాధానంగా నాందేడులోని మోలా సాహెబు అను సాధువుకు ఖర్చు పెట్టిన రూ. 3-14-0 లు తనకు చెందినట్లేనని నిరూపించి సాధు స్వరూపులంతా ఒక్కటే అని బాబా తెలియునట్లు చేసారు. 1917 లో హరి భాఊ కార్ణిక్ సాయిని దర్శించి పూజించి, వస్త్రము, దక్షిణ సమర్పించి సెలవు తీసికొని ద్వారకామాయి మెట్లు దిగుచు మఱల ఒక రూపాయి దక్షిణ బాబాకు ఇస్తే బాగుండునని తలచినాడు. కాని బాబా నుండి సెలవు తీసికొన్న తరువాత మఱల మసీదు మెట్లెక్కుటకు వీలు లేదు. నాసిక్‌లో కాలారాముని ఆలయము వద్ద నరసింగ మహారాజు అను యోగి భాఊ చేయి పట్టుకొని నా రూపాయి నాకు ఇమ్ము అని అడిగి తీసికొన్నారు. వెంటనే కార్ణిక్ సాయియే ఈ రూపమున సాక్షాత్కరించి దక్షిణ స్వీకరించారని తలచి సంతోషముతో రూపాయి యిచ్చారు.

ఒక శివరాత్రి రోజు సాయి అనుమతితో దాసగణు గోదావరిలో స్నానం చేసి ఒక సాధువునకు పావలా దక్షిణ యిచ్చాడు. షిరిడీ చేరగానే బాబా నవ్వుచు "గోదావరి వద్ద నీవిచ్చిన దక్షిణ చేరిందని" చెప్పుచు తన చేతిలోని పావలా చూపారు. మఱి గోదావరి వద్ద దాసగణు నుండి దక్షిణ తీసికొన్న దెవరు? ఒక రోజు సాయంత్రం దీక్షిత్ తన ఆఫీసు నుండి వస్తుంటే ఒక బిచ్చగాడు అతని వద్దకు వచ్చి కొద్ది చిల్లర డబ్బు లిస్తావా? అని అడిగాడు. అతనికి దీక్షిత్ చిల్లర డబ్బులు ఇవ్వగానే మరెవ్వరిని అడగకుండా వెళ్ళిపోయాడు. ఆ రోజు సాయంత్రము దీక్షితు షిరిడి రాగానే సాయి నవ్వుతూ "నీ విచ్చిన చిల్లర డబ్బులు నాకు చేరాయి" అని అన్నారు. ఇతర సాధువులకు ఇచ్చిన దక్షిణ తనకిచ్చినట్లే యని సాయి ఋజువు పఱచినారు.

ప్రతి రాత్రి గం. 8-00 ల ప్రాంతములో సాయి ఆ రోజు స్వీకరించిన దక్షిణ అంతా దానమిచ్చేవారు. జేబులో చెయ్యిపెట్టి చేతికి వచ్చినంత యిచ్చేవారు. కాని ప్రతి రోజు ఎవరికి ఎంత యిస్తున్నారో అంతే వారి చేతికి వచ్చేది. ఈ యిచ్చిన దానికి ప్రతిఫలముగా ఎవరి నుండి సేవ పొందలేదు. నిత్యము బడే బాబాకు రూ. 55/- లు, తాత్యాకు రూ. 35/- లు, బయాజీ కోతే పాటీలుకు రూ. 4/- లు, భాగోజీకి రూ. 4/- లు, జంతే ముసల్మానుకు రూ. 7/- లు, రామచంద్ర పాటీలుకు రూ. 4/-లు, 3 ఏండ్ల అమానికి రూ. 1/- బాబా యిచ్చు చుండెడివారు.

భక్తులకు దానము గుఱించి బోధించుటకు, ధనము నందు వారికి గల అభిమానము పోగొట్టుటకు, వారి మనస్సులను శుభ్ర పఱచుటకు బాబా ఈ దక్షిణ అడుగుచుండెనేమో ? అనగా దానము - త్యాగము బోధించుటగా గుర్తించవలెను.

## గురు – శిష్య సంబంధము

ఆధ్యాత్మిక జ్ఞానము పొందుటకు గురువును ఆశ్రయించుట అవసరము. జౌహర్ అలీ అను కపట గురువు బాబాను తన శిష్యునిగా చెప్పుకొనినప్పుడు,

గురువుకు శిష్యుడెట్లు సేవ చేయవలెనో, ఆ కపట గురువుకు శిష్యుడుగా బాబా వ్యవహరించి చూపిరి. చివరకు జౌహర్ అలీ తన అనర్హతను గుర్తించి పశ్చాత్తాపపడి షిరిడీ వదలి వెళ్ళి కొంత కాలమునకు తిరిగి వచ్చి బాబాను సద్గురువుగా దర్శించుకొన్నాడు.

బాబా ఆచరణ, విధానమంతయు తన భక్తులు కూడ ఆచరించి కలిమాయ నుండి రక్షణ పొందుటకే. బాబా వద్ద కొన్ని నాణెములుండేవి. వాటిని భక్తుల పేర్లు చెప్పి తోముచు నుండేవారు. ఆ తోముట తన భక్తుల పాపమును ప్రక్షాళనము చేయుటగా చెప్పబడినది.

## బాబా ఉపదేశము

ఒక్కొక్కరినే పిలచి రహస్యముగా ఉపదేశించుట వారి విధానము కాదు. భక్తులు తన చుట్టు చేరి యున్నప్పుడు చిన్న-చిన్న కథల ద్వారా చెప్పిన దాని నుంచి ఆత్మజ్ఞానము పొందుట జరిగినది. అచట చేరిన భక్తులు అడగకుండానే వారి సమస్యలు ఈ కథలు వినుట ద్వారా తీరేవి. తనకు – తన పటమునకు భేదము లేదని ఈ 3 1/2 మూరల శరీరమే తాను కాదని, అన్నిట - అంతట తనను దర్శించువారే నిజమైన భక్తులని బాబా చెప్పిరి. ఆ భక్తులను వెంట నంటి కాపాడిరి.

## మన కర్తవ్యము

పై సంఘటనలన్నింటిని మనము పరిశీలించినట్లయితే పరబ్రహ్మమైన బాబా దేహ ధారిగా తనకంటు ఎట్టి అవసరము లేక, మానవ శ్రేయస్సుకు అవతరించినట్లు విశదమగుచున్నది. వారి యొక్క ప్రతి సంఘటనయు మనము ఆచరించి తరించుటకే. కనుక సాయిబాబా జీవిత చరిత్రను శ్రద్ధగా మనము చదివి వారి దిన చర్యలోని ఆంతర్యమును బాగా అర్థము చేసుకొని మన నిత్య జీవితమున ఆచరణలో పెట్టుకొనినచో సుఖ శాంతులు పొందగలము.

రాగ ద్వేష రహితులమై మన జీవితమును తీర్చి దిద్దుకొందము. భగవత్స్వరూపమైన సద్గురువు ఇచ్చే మహోపదేశమే శాశ్వతమైనది. మనము మనస్ఫూర్తిగా బాబాకు అంకితమైనప్పుడు బాబా మన వెంట నంటి ఉండుట నిశ్చయము. స్వయముగా ప్రత్యక్ష నిదర్శనములు ఎందరికో యిచ్చి యున్నారు. మనకును ఈయగలరు. సాధు రూపములలోనో, కలలలోనో కనిపించి నిదర్శనములిచ్చుట జరుగుచున్నది గదా!

సర్వము మన ఆచరణ, నమ్మికమీదనే ఆధారపడి యున్నది. సాయి దిన చర్యలు చదివి షిరిడీ సందర్శిస్తే శ్రీ సాయి సన్నిధి అనుభవమునకు వస్తుంది. కనుక సాయినాథుని యందు పూర్తి విశ్వాసముంచి, తత్త్వము ననుసరించి ఆచరించుట మన యొక్క కర్తవ్యము.

ఓం శ్రీ సాయి నాథాయ నమః



సాకారుండవా ! లేక ని
రాకారుండవా ! మఱేమి యగుదువా ! యెఱుఁగన్
నాకగునె ? శ్రితుఁడ జడుఁడను
సాకవె ! నీ కరుణఁబఱపి సాయీ నాథా !

# సాయిబాబా చరిత్రము

## ద్వితీయాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

## సాయి తత్త్వము - సేవ - బోధ

శ్రీ షిరిడీ సాయిబాబా విధానము సత్సంప్రదాయమైనది. సకల మత ధర్మములకు అనుగుణమైనది. ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు అవతరిస్తానని గీతలో చెప్పినట్లుగా ఈ లోకములో అవతరించి ధర్మోద్ధరణకు పూనుకొన్నారు సాయి. మానవ సేవయే-మాధవ సేవయని, నిరూపించిన కలియుగ అవతార పురుషుడు శ్రీ షిరిడీ సాయిబాబా. మానవ సేవే - మాధవ సేవయా ? అను సంశయముతో నున్న మానవులకు సంశయనివృత్తి కలిగించుచు, శ్రీ సాయి నాథుడు మానవుడుగా జన్మించి, తన ఆచరణ ద్వారా భగవంతుడు ఎక్కడో లేడనియు, తాను మానవ సేవ చేయుచు తన ఆశ్రితులచే చేయించుచు, మానవుడే-మాధవుడని నిరూపించుట ద్వారా మానవ సేవకు-మాధవ సేవకు భేదము లేదనే సత్యమును తెలియజేసినారు సాయి.

అట్టి స్వామి యొక్క, సద్గురువు యొక్క బోధలు విని మన జీవితములను తీర్చి దిద్దుకొందము. భక్తులు స్వామి చుట్టు పరివేష్టించి యున్న సందర్భములో వారు చెప్పిన హిత బోధలు తెలుసుకొందము. సర్వ జీవ జంతు, పశు పక్ష్యాదులలో అంటే సర్వ ప్రాణులలో తనను దర్శించుమని సాయి చెప్పిన సత్యాన్ని గుర్తించుదము.

## సర్వ మత సమైక్యత - సాయి తత్త్వము

సర్వమానవులు (మతముల) సమైక్యతతో జీవించుట సాయి తత్త్వముగా గుర్తించబడినది. సర్వ మత సామరస్యము - విశ్వ మానవ ప్రేమ అనునవి ముఖ్య సూత్రములు. ఆనాడు (1858 - 1918) హిందు - మహమ్మదీయు

మతములకు వైరములుండెడివి. వీరి మైత్రికి, సమైక్యతకు సాయిబాబా మిక్కిలి కృషి చేసిరి. "హిందువుల దైవమగు శ్రీరాముడు, మహమ్మదీయుల దైవమైన రహీమ్ ఒక్కరే. వారిరువురి మధ్య భేదము లేదు. అట్లయినప్పుడు వారి భక్తులు వారిలో వారు కలహమాడుట యెందుకు? ఓ అజ్ఞానులారా! చేతులు-చేతులు కలిపి రెండు జాతుల వారు కలసి మెలసి యుండుడు. బుద్ధితో ప్రవర్తింపుడు. జాతీయ ఐకమత్యమును సమకూర్చుడు. వివాదముల వల్ల కాని, ఘర్షణల వల్ల కాని ప్రయోజనములేదు. వివాదములు విడువుడు. మీ యొక్క అభివృద్ధిని, మేలును చూచుకొనుడు. భగవంతుడు మిమ్ము రక్షించును. యోగము, త్యాగము, తపస్సు, జ్ఞానము మోక్షమునకు మార్గములు. వీనిలో నేదైనా అవలంబించి మోక్షమును సంపాదించనిచో మీ జీవితములు వ్యర్థములు. ఎవరైనా మీకు కీడు చేసినచో ప్రత్యపకారము చేయకుడు. ఇతరుల కొఱకు మీరేమైనా చేయగలిగినచో ఎల్లప్పుడు మేలును మాత్రమే చేయుడు" అని బాబా భక్తులకు హితవు చెప్పినారు. మానవులంతా భగవంతుని బిడ్డలైనప్పుడు అనగా పరమాత్మలోని ఆత్మ స్వరూపులైనప్పుడు ద్వేష భావమెందుకు? ఎవరి మతమును వారు తీర్చి దిద్దుకొనుచు, పర మతముల జోలికి పోక, సహన భావమును వహించి, మనమందఱము మానవులమనే మానవతా భావమును గుర్తించుకొని కలసి మెలసి జీవించి సుఖ శాంతులు పొందవలెను.

సాయి నాథుని మతమేది? ఆ స్వామి మతాతీతుడు. మతాల మధ్య సమన్వయమే కాక, ఒక మతములో పరస్పర విరుద్ధ భావాలు, వైరుధ్య భావాలు, వివిధ భాష్యాలు గందరగోళమును సృష్టిస్తున్న నేటి సమాజానికి. సమాధానముగా సరియైన మార్గాన్ని తన చర్య ద్వారానే చూపుచు భగవంతుని చేరుటకు మార్గాన్ని సులభతరం చేస్తూ మన మధ్య సంచరించారు సాయి. విశ్వములో నున్న సమస్త జీవ జడ పదార్థాలు తానేనని అనుభవ పూర్వకముగా నిరూపించిన మహితమూర్తి సాయి. మరెవరితోను పోల్చేందుకు కూడ అందనంతటి ఉన్నత శిఖరము సాయి.

సాయి చర్యలు పరిశీలించినట్లయిన మహమ్మదీయులకు పవిత్రమైన మసీదును తన నివాసముగా చేసుకొన్నారు. దానికి "ద్వారకామాయి" అని పేరు పెట్టారు. మసీదుకు ముందు హిందువులకు పవిత్రమైన తులసి వనము

పెంచారు. మసీదునందు "ధుని" ఏర్పాటుచేసి నిరతాగ్ని హోత్ర మేర్పరచారు. శ్రీరామ నవమి రోజు పగలు జెండాలు ఊరేగింపుగా తీసికొనిపోయి మసీదు రెండు ప్రక్కల పెట్టెడివారు. పగలు హిందువులకు పవిత్రమైన శ్రీరామ నవమి ఉత్సవము, రాత్రులందు మహమ్మదీయులకు (1897 నుంచి అమీరు షక్కర్ చేత) పవిత్రమైన చందనోత్సవము జరుపబడినవి. వెడల్పు పళ్ళెములో చందనపు (గంధము)ముద్ద నుంచి ఆ పళ్ళెమును తలపై పెట్టుకొని, సాంబ్రాణి ధూపముతో, బాజా భజంత్రీలతో ఉత్సవ మూరేగిన పిమ్మట మసీదుకు వచ్చి మసీదు గూటిలోను, గోడల పైనను చందనమును చేతితో నందఱు తట్టుటయే చందనోత్సవము. ఇది మహమ్మదీయ ఫకీరుల గౌరవార్థము చేయుదురు. సాయి నాథుని వద్దకు కుల, మత భేదము లేక ధనిక - బీద తారతమ్యము లేక అందఱు వచ్చి సేవించేవారు. అబ్దుల్లా అనే మహమ్మదీయుడు తన మతాను సారముగా మసీదులో బాబాకు సేవచేస్తూ ఉంటే హిందువైన భక్త మహాల్సాపతి హిందూ మతానుసారముగా బాబాను పూజించేవాడు. శిష్టాచార పరులు కూడ సాయిని దర్శించినంత మాత్రముననే తమ మూఢత్వమును వదలుకొని మానవు లంతా ఒక్కటే అని గుర్తించియున్నారు. కుల, మత రహితముగా ఇప్పటికి వంద సంవత్సరముల పూర్వమే అప్పట్లో ఉన్న మూఢ సంప్రదాయములకు స్వస్తి పలికి, యిప్పుడు మన ప్రభుత్వము కోరు సమైక్యతా భావమునకు పునాది వేసి అన్ని మతముల వారికి సహపంక్తి భోజనములు పెట్టి మానవులంతా ఒక్కటే అని నిరూపించారు సాయి నాథుడు. అందఱితో మాట్లాడుచు "అల్లా మాలిక్" అని సంబోధించేవారు.

రోహిల్లా అనే మహమ్మదీయుడు బాబా కీర్తి విని 'షిరిడీ' తన నివాసముగా ఏర్పరచుకొన్నాడు. అతడు రాత్రింబగళ్ళు ఖురాన్‌లోని "కల్మాను" చదువుచు "అల్లాహూ అగ్బర్"యని యాంబోతుఱంకెవేయునట్లు బిగ్గరగా నఱచుచుండెడి వాడు. కష్టపడి పనిచేయు షిరిడీ ప్రజలు రోహిల్లా అరుపులు వారికి నిద్రా భంగమును కలిగించి అసౌకర్యముగా ఉండెడివి. వారు రోహిల్లా అరుపులు ఆపించుమని బాబాను బతిమాలిరి. బాబా "రోహిల్లా జోలికి పోవద్దని, ఆ బాధను సహించవలసినదేనని, త్వరలో అరుపులు తగ్గునని" వారికి చెప్పిరి. రోహిల్లాకు ఆధ్యాత్మిక స్థితిని కలిగించు మార్గమిది. కనుక బాబా విధానమంతా ఆధ్యాత్మిక మార్గమున మనలను తీసికొని వెళ్ళుటయే అని మనము గుర్తించవలసియున్నది.

హిందువుల పండుగ అయిన శ్రీరామ నవమి, గోకులాష్టమి, మహమ్మదీయుల పండుగ అయిన మొహరం ఈ మసీదులోనే జరిగేవి. మొహరం పండుగకు కొంతమంది మహమ్మదీయులు తాజియా లేక తాబూతు నిల్పి కొన్ని దినములు మసీదులోనే ఉండేవారు. ఈదుల్ పితిర్ పండుగనాడు మహమ్మదీయులచే మసీదులో నమాజు చేయించేవారు. మహమ్మదీయుడైన పీర్ మహమ్మద్ ఉరఫ్ బడే బాబా చిలుము పీల్చిన తరువాత సాయి పీల్చేవారు. మధ్యాహ్న భోజన సమయమున బడే బాబాను ఎడమ ప్రక్కన, తాత్యాను కుడి ప్రక్కన కూర్చుండబెట్టుకొని బాబా భోజనము ప్రారంభించేవారు. బడే బాబాకు ప్రతి దినము రూ. 50/-లు చొ॥న దక్షిణ యిచ్చేవారు. హిందువైన తాత్యాతోను, మహాల్సాపతితోను, లకసి మసీదులో పడుకొనేవారు. అన్ని మతముల వారు వారికి సమానమే. ఎక్కువ - తక్కువలు చూపుట మచ్చుకైన లేదు.

మతములు మార్చుకొనుటకు సాయి అంగీకరించలేదు. ఒక భక్తుడు తన మతమును మార్చుకొనినానని చెప్పినప్పుడు శ్రీ సాయి వానితో "నీ అబ్బను మార్చుకుంటావా"అని మందలించారు. అతడే మతోన్మాదమును నిరసించుటయే అందఱు ఒకటనే భావన కావాలి. ఏ మతము వారైనా వారి ఆచార ప్రకారము సాయిని అర్చించినను వారు ఆమోదించియున్నారు. ఒక భక్తుడు మసీదులో బాబా వద్ద రవ్వకేసరి అందఱికి పంచుతుండగా మఱొక భక్తుడు అతని వద్ద నుండి ప్రసాదము తీసికోలేదు. బాబా "ఎందుకు ప్రసాదము తీసికోలేదని అడుగగా అతనితో తనకు అభిప్రాయ భేదమున్నదని చెప్పాడు. అప్పుడు బాబా అతనితో "ఎవరిని శత్రువుగా భావించవద్దని, ఇచ్చేది, పుచ్చుకొనేది, తినేది ఎవరు ? అంతా ఒక్కటే. అన్యము లేదు" అని అతనిని మందలించారు. అందఱిలో నున్న ఆత్మ - పరమాత్మ స్వరూపమే. ఆత్మకు ఎట్టి కుల మత-లింగ భేదము లేదు. భగవంతుడున్నాడని, సత్యము పలుకుట, సత్ప్రవర్తన కలిగి ఉండుట, సమస్త జీవ - జంతు పశు పక్ష్యాదుల యందు దయ కలిగి ఉండుట, కలిగినంతలో (తన సంపాదనలో) దాన ధర్మములను చేసి తోటి మానవులను ఆదుకొనుటే అన్ని మతముల ఆశయము. పుట్టుట - గిట్టుట లోను, పాంచ భౌతికమైన శరీరములోను కూడ మార్పులేని మానవుల మధ్య ఈ అనైక్యత యేల ? సాయి నాథుని ఆదేశానుసారము అన్ని మతముల వారము సమైక్యతతో పురోగమించి మన శ్రేయస్సుకు కృషి సలుపుకొందము.

దేశ సుస్థిరతకు సౌభాగ్యమునకు దోహదము చేయుదము.

## బీదల, రోగుల సేవ

శ్రీ సాయిబాబాను స్మరించినంతనే మనకు స్ఫురణకు వచ్చునది సేవా భావమే. కాబట్టి సేవయే సాయి. రోగులకు మొదటిలో బాబా మందులు ఇచ్చి నయము చేసెడివారు. అందువలన మంచి వైద్యుడని పేరు కూడ వచ్చినది. సమాజముచే అంటరాని రోగమని మనము తలచు కుష్ఠరోగముచే పీడితుడైన భాగోజిని చేరదీసి స్వస్థత కలిగించినారు బాబా. బాబా ధునిలో చేయి పెట్టి నప్పుడు కాలిన చేతిని చివరి వఱకు భాగోజి తోమి కట్టు కట్టేవాడు. తరువాత ధునిలోని ఊది యిచ్చుట ద్వారా సాయి రోగులను ఆరోగ్యవంతులను చేశారు. గ్రుడ్డి వారికి కళ్ళు, కుంటి వారికి కాళ్ళు ప్రసాదించారు సాయి. అంగవికలులను ఉద్ధరించుట జరిగినది. షిరిడీ గ్రామములో కలరా ఉన్నప్పుడు తిరుగలి ద్వారా విసరిన గోధుమపిండిని ఊరి పొలిమేరలలో చల్లించి ఆ వ్యాధిని ఆపిరి.

వ్యాధులు నయమగుటకు చూపిన లీలలు అనంతములు. 1909 లో భీమాజీ పాటీలు యొక్క క్షయ రోగమును ఒక కలలో ఉపాధ్యాయుడు దెబ్బలు కొట్టినట్లును, రెండవ కలలో ఛాతిపై బండను వైచి క్రిందకు మీదకు త్రోయు చున్నట్లుగా జూపి తగ్గించెను. బాలా గణపతి షింపీ యొక్క మలేరియా వ్యాధిని లక్ష్మి మందిరము వద్ద నున్న నల్ల కుక్కకు పెరుగన్నము పెట్టించుట ద్వారా నివారించిరి. బూటి జిగట విరేచములను "జాగ్రత్త, నీవు విరేచములు వమనములు చేయరాద"ను వారి వాక్కు ద్వారాను, మఱియొకసారి బూటికి టైఫాయిడ్ వచ్చినప్పుడు బాబా అతనిచే రోజు పాయసము తినిపించుట ద్వారాను, ఆళంది స్వామి చెవి పోటును "అల్లా అచ్ఛాకరేగా" అని ఆశీర్వ దించుట ద్వారాను, కాకా మహాజని నీళ్ళ విరేచనములను వేరుశనగపప్పు తినిపించుట ద్వారాను (వేరుశనగపప్పు విరేచనములను అధికము చేయు వస్తువు), దత్తో పంతు కడుపు నొప్పిని ఊది ప్రసాదము ఇచ్చి అతని తలపై తన హస్తమునుంచి ఆశీర్వదించుట ద్వారాను తగ్గించిరి. మాధవరావు దేశ పాండే మూలవ్యాధి సునాముఖి కషాయము త్రాగించుటద్వారా బాబా తగ్గించిరి. రెండు సంవత్సరముల తరువాత మఱల ఇదే మూలవ్యాధి వస్తే బాబా ఆజ్ఞ లేకుండా సునాముఖి కషాయము పుచ్చుకుంటే వ్యాధి అధికమైనది. తిరిగి బాబా

అశీర్వాదముతో ఆ వ్యాధి తగ్గినది. గంగాధర పంతు కడుపు నొప్పి బాబా వాని కడుపు పట్టుకొని "భగవంతుడే బాగుచేయగలడని" అనుట ద్వారాను, నానా సాహెబు చాందోర్కరు కడుపు నొప్పి బాబా ఆశీర్వాదముతోను తగ్గెను. బాబా కాశీనాథ్ ఉపాసనీని మొదటగా తానే కలుసుకొని ఆయన కడుపు నొప్పి నివారణకు సూచనలిచ్చారు బాబా. ఒకసారి గోదావరిలో చన్నీళ్ళు (ఇతనికి ఆరోగ్యమునకు సరిపడదు) త్రాగబోతుంటే త్రాగవద్దని వీపు తట్టి హెచ్చరించారు సాయి. రాహురీ గ్రామములో గల ఒక యోగి ఉపాసనీ బాబా అధ్యాత్మికంగా అందరాని స్థితిలోఉన్నాడని గ్రహించి పరమాత్మ స్వరూపుడైన సాయిని దర్శించమని చెప్పిరి. ఉపాసనీ బాబా తన వ్యాధి నిర్మూలనకు 1911 లో సాయిని దర్శించిరి. యశ్వంత దేశ పాండే అనే భక్తుని తండ్రి సాయిని దర్శించి కళ్ళు కనిపించుటలేదని చెప్పాడు. బాబా దైవమే మేలు చేస్తాడు అని ఆశీర్వదించగానే అతనికి దృష్టి వచ్చినది. ఒక భక్తుడు కండ్లు వాచి, ఎఱ్ఱబడి బాధపడుచు బాబా వద్దకు వచ్చెను. బాబా నల్ల జీడిగింజలను నూరి రెండు కండ్లయందుంచి కట్టు కట్టి మరుసటి దినమున విప్పించి నీటితో కడిగించెను. కండ్లు శుభ్రపడి తేజోవంతములై ప్రకాశించినవి. (బాబా చేసినారని ఎవరైనా నల్ల జీడిగింజలను కండ్లలో పెట్టుకున్న గ్రుడ్డివారగుదురు) 1911 లో ఒక వైశ్యుడు కాళ్ళు చచ్చుపడిన తన కుమార్తెను బాబా వద్దకు తీసికొనివచ్చి బాబా పాదాల వద్ద ఉంచాడు. సాయి ఆమెను ఆశీర్వదించి కొంతకాలము షిరిడీలో ఉండమన్నాడు. కాని మూడవ రోజుకల్లా ఆమె లేచి తిరిగింది. యం.డబ్ల్యు ప్రధాన్ కుమారుని వ్యాధి బాబా తగ్గించి దత్తాత్రేయుడు. సాయి ఒకటేనని వారికి నిరూపించారు. అమీరు శక్కర్ కీళ్ళ వాతము జబ్బును ఎల్లప్పుడు తేమగా నుండు చావడిలో నుండుమని పలికి తన యాశీర్వచన రూపమైన ఔషధము ద్వారా నివారించిరి. (తడిగల స్థలము ఇట్టి రోగికి తగిన స్థలము కాదు). బాబా వామన్ గోండ్కర్ యింటి కప్పు ఎక్కి రాధా కృష్ణమాయి యింటి పై కప్పు దాటి ఇంకొక ప్రక్కకు దిగుట ద్వారా రాధా కృష్ణమాయి మలేరియా వ్యాధిని తగ్గించిరి. హరిశ్చంద్ర పితళే కుమారుని మూర్ఛ రోగము బాబా చూపుతో తగ్గినది. ఆ సందర్భమున "ఎవరికైతే ఓపిక - నమ్మకము కలదో వారిని భగవంతుడు రక్షించునని" బాబా చెప్పిరి.

మాధవరావు దేశ పాండే పాము కఱచి బాబాను శరణు వేడినప్పుడు "ఓరి పిరికి పురోహితుడా! ఎక్కవద్దు నీ వెక్కినచో నేమగునో చూడు, పో, వెడలి పొమ్ము. దిగువకు పొమ్ము" అని వారి వాక్కుతో రక్షింపబడ్డాడు. అవి పామును గురించి విషము ఎక్కకుండా అన్న మాటలు ఇట్లే బాలా సాహెబ్ మిరీకర్, బూటి, అమీర్ శక్కర్, హేమాడ్ పంతు, మహాల్సాపతి మొదలగు వాళ్లని ముందు హెచ్చరికతో విష సర్పముల బారి నుండి తప్పించినారు. దాదా సాహెబు ఖాపర్దే కుమారుని ప్లేగు బొబ్బలు తన శరీరము పైకి తెప్పించు కొని ఆ కుఱ్ఱవానిని రక్షించిరి. "చూచితిరా నాభక్తుల కొఱకెట్లు బాధపడెదనో! వారి కష్టములన్నియు నావిగా భావించెదను" అని చెప్పిరి. అన్నింటికి వారి వాక్కే మూలము. నాస్తికుడైన డి యం. ముళ్లీకి 1916 లో తీవ్రముగా జబ్బు చేసినపుడు సాయి వాని స్వప్నములో కనుపించి "రోగము తగ్గగనే తనను దర్శించినచో నయమగుననిరి. వెంటనే జ్వరము తగ్గినది. అతడు షిరిడీ దర్శించాడు. ఇందులకు సాయి వాక్కే మూలము కదా!

బాబా ప్రసాదించిన ఊది సేవించుటచే చెడు స్వప్నములచే నిద్రపట్టని పెద్ద మనిషికి స్వస్థత కలిగినది. నాసిక్ జిల్లా మాలెగాంలోని ఒక డాక్టరు మేనల్లునికి వచ్చిన రాచకురుపు ఆపరేషన్ చేసినను తగ్గలేదు. అది నయము కానట్టిది. కాని వారు బాబాను నమ్మి షిరిడి వచ్చి బాబాను దర్శించగానే, బాబా ఊది పూయగానే నెమ్మదించి కొన్ని రోజులలో ఆ రాచ కురుపు తగ్గినది. అటులనే డాక్టరు పిళ్ళె నారికురుపు బాబా యిచ్చిన ఊది పూయుట, తినుట వలన తగ్గినది. శ్యామా మఱదలు (బాపాజీ భార్య) కు వచ్చిన ప్లేగు బొబ్బలు, బాబా యిచ్చిన ఊది ఆ ప్లేగు బొబ్బలపై పూసి, నీళ్ళలో కలిపి త్రాగించుట ద్వారా వెంటనే తగ్గినవి.

అపుడే కాదు. ఇపుడు కూడ ప్రముఖ వైద్య నిపుణులకు కూడ అర్థము కాని, మఱియు వైద్యులు నయము కాదని చెప్పిన రోగములు సహితము షిరిడీ ధుని "ఊది" విశ్వాసముతో సేవించు భక్తులను రక్షించుట జరుగుచున్నది. శస్త్ర చికిత్స అవసరమని వైద్యులు చెప్పినను, విశ్వాసముతో ఊది సేవించిన వారిని మరల వైద్యులు పరీక్షించినపుడు శస్త్ర చికిత్స

అవసరము లేదని చెప్పుచున్న సంఘటనలును ఎన్నో గలవు. ప్రతి సాయి భక్తునికి అంటే మనందఱికి ఏదో ఒకటి యిట్టి అనుభవము ఉన్నది. 6వ అధ్యాయములో ఆ లీలలు తెలుసుకొనవచ్చు. ఈనాడు సాయి సంస్థలు బీదల, రోగుల సేవకు ప్రాధాన్యమిచ్చి అనేక సంక్షేమ కార్యక్రమములను నిర్వహించుచున్నవి. సాయి అప్పుడే కాదు. ఇప్పుడు తన అంకిత భక్తులను వెన్నంటి యున్నాడు. ఇక ముందు ఉండును. సందేహము లేదు.

## బీదల సేవ - అన్నదానము

ఈ కలియుగములో సద్గతికి దాన - ధ్యానములు నిర్దేశించబడినవి. దానములలో అన్నదానము శ్రేష్ఠమైనది. బాబా నా భక్తుని గృహములో 'లేమి' అను శబ్దము లేదని చెప్పియున్నారు. 1910 వఱకు బాబా స్వయముగా అన్ని పదార్థములు సేకరించి మసీదు ముందు వంట పాత్రలతో తామే స్వయముగా వండేవారు. పదార్థములు ఉడుకుచున్నప్పుడు ఆపాత్రలలో తన చేయి పెట్టి పదార్థములు ఉడికినవి లేనిది పరీక్షించేవారు. ఆ వండిన పదార్థములు మసీదులోనికి తెప్పించి, మౌల్వీలచే ఆరగింపు చేయించి, అన్ని మతముల వారికి సహపంక్తి భోజనము పెట్టెడివారు. అన్నదానమంటే బాబాకు చాలా యిష్టము. షిరిడీలో శ్రీరామ నవమిరోజు అన్నదానము ఎక్కువగా జరిగెడిది. తన వద్దకు వచ్చు భక్తులు భోజనము చేసినది లేనిది తెలుసుకొనేవారు. ఎచట నుండియో వచ్చు భక్తులను, అచటనే నివాసమేర్పరచుకొనిన వారి యిండ్లకు భోజనమునకు బాబా పంపేవారు. వారి భిక్షాటనలో తెచ్చిన పదార్థములో కూడ బీదలకు, అంగవికలులకు బాబా పెట్టేవారు. 1910 తరువాత భక్తులు షడ్రసోపేతమైన పదార్థములు తెచ్చినను బాబా వాని కాశించకతన కొఱకు 5 యిండ్ల వద్ద భిక్ష చేసి జీవించారు. భక్తులు తెచ్చిన పదార్థములను మధ్యాహ్నం గం. 12-00 లకు భక్తులకు పెట్టేవారు. భోజనము చేయునపుడు బాబాకు కుడిప్రక్క తాత్యా పాటీలు, రామచంద్ర పాటీలు, బయ్యాజి పాటీలు, ఎడమప్రక్క బడే బాబా, శ్యామా, బ్యూటి, కాకా దీక్షితు కూర్చునేవారు. మధ్యాహ్నం గం. 12-00 లకు భోజనము జరుగునప్పుడు తెరవేసి యుండెడిది. తెరవేసి యున్నప్పుడు లోపలకు ప్రవేశించుటకు ఎవరును సాహసించరు.

ఈ అన్నదానము చేయుటవలన తోటి బీదలకు ఆదుకొనుటే కాదు. దాని వలన వచ్చు పుణ్యము మరుసటి జన్మకుపయోగపడును. ఇప్పుడు షిరిడీ సాయి పేర ఏర్పడిన సేవా సంస్థలు ఈ అన్నదానమునకు ప్రాధాన్యత యిచ్చి సేవ చేయుచున్నవి. మనము బ్యాంకులో వేసిన ధనమును నిల్వబెట్టుకున్నట్లు ఈ అన్నదానము వలన పుణ్యము మరు జన్మకు నిల్వబెట్టుకొనుట జరుగును. మనము బ్యాంకులో వేసుకొన్న ధనము ఈ జన్మలోనే ఉపయోగపడును. దాన ధర్మముల ద్వారా నిల్వచేయు మొత్తము పుణ్యము మరు జన్మలో మన శ్రేయస్సుకు ఉపయోగపడును.

ఉపవాసములుండుట కాని, మితి మించి భుజించుటకాని, మంచిది కాదని బాబా చెప్పిరి. గోఖలే భార్య బాబా వద్ద 3 రోజులు ఉపవసించుటకు రాగా ఉపవాసము చేయవలసిన అవసరమేమి ? దాదాబట్టు ఇంటికి పోయి బొబ్బట్లు చేసి అతని పిల్లలకు పెట్టి నీవు కూడ తినుము అని చెప్పి ఆమెను బాబా ఉపవసించనీయలేదు. దీక్షితు యావజ్జీవితము రాత్రిపూట ఉపవసించాలని నిశ్చయించుకొని, బాబా వద్దకు రాగా"రాత్రి భోజనానికి రొట్టె కూర చేయించి, అక్కడే నైవేద్యము పెట్టి, నువ్వు తిను" అని అన్నారు. అలా అతనికి చెప్పుచు వానిని ఉపవసించనీయలేదు.

## సర్వ జీవ జంతు పశు పక్ష్యాదుల యందు కారుణ్య దృష్టి

బాబా సకల జీవ జంతు పశు పక్ష్యాదుల యందు కారుణ్య దృష్టితో ఉండేవారు. ఆకలిగొన్న ప్రాణము గల ఏ జీవికైనా ఆహారము పెట్టుతె శ్రేయస్సు కలిగిస్తుందని చెప్పిరి. తాను భిక్షతో తెచ్చిన ఆహార పదార్థము లన్నింటిని ఒక కుండలో పోసి కుక్కలు, పిల్లులు, కాకులతో కలసి తినేవారు. వాటిని తోలేవారు కాదు.

ఆత్మారాముని భార్య షిరిడిలో ఉన్నప్పుడు ఒకరోజు మధ్యాహ్న భోజన సమయమున, అందరికి భోజనము వడ్డించబడిన సమయములో ఆకలితో ఉన్న ఒక కుక్క అచటికి వచ్చి మొరుగుట ప్రారంభించగా ఆత్మారాముని భార్య లేచి

యొక రొట్టెముక్క ఆ కుక్కకు వేసినది. ఆ కుక్క ఎంతో మక్కువగా ఆ రొట్టెముక్క తిన్నది. ఆనాడు సాయంకాలము ఆమె మసీదుకు పోగా బాబా ఆమెతో "తల్లీ నా కడుపు నిండా గొంతు వఱకు భోజనము పెట్టినావు. నా జీవ శక్తులు సంతుష్టి చెందినవి. ఎల్లప్పుడు ఇట్లే చేయుము. ఇది నీకు సద్గతి కలుగజేయును. మొదట ఆకలితో నున్న జీవికి భోజనము పెట్టిన పిమ్మట భుజింపుము. దీనిని జ్ఞప్తియందుంచుకొను"మని బాబా అనగా, ఆమెకు బోధపడక "బాబా ! ఇతరుల యింట్లో భోజనము చేయుచుండిన నేను మీకెట్లు భోజనము పెట్టగలను ?" అని అన్నది. దానికి బాబా యిట్లన్నారు. "భోజనము నకు పూర్వము ఏ కుక్కను నీవు చూచి రొట్టె పెట్టితివో అదియు,నేను ఒక్కటియే ఆ విధముగానే పిల్లులు, పందులు, ఈగలు, ఆవులు మొదలుగా గల వన్నియు నా అంశములే. నేనే వాని యాకారములలో తిరుగుచున్నాను. ఎవరైతే జీవ కోటిలో నన్ను జూడగలుగుదురో వారే నా ప్రియ భక్తులు. కాబట్టి నేనొకటి- తక్కిన జీవరాశి యింకొకటి యను ద్వంద్వ భావమును, భేద భావమును విడచి నన్ను సేవింపుమని" బాబా చెప్పిరి. పై చెప్పిన విషయములు ఆత్మారాముని భార్యకు మాత్రమే చెప్పినవి కావు. బాబాను నమ్మి సేవించు సాయి భక్తులెల్ల ఇప్పుడు కూడ తప్పక ఆచరించవలసిన విధ్యుక్త ధర్మము.

ఒకరోజు సాయంకాలము లక్ష్మీబాయి షిండే బాబా వద్దకు వచ్చి నమస్కరించినపుడు బాబా ఆమెతో "ఓ లక్ష్మీ ! నాకు చాలా ఆకలి వేయుచున్నది" అని అనిరి. ఆమె యింటికి వెళ్ళి రొట్టె, కూర తయారుచేసి తీసికొని వచ్చి బాబా ముందర పెట్టినది. బాబా దానిని అందుకొని అచట ఉన్న యొక కుక్కకు వేసెను. లక్ష్మీబాయి అది చూచి "బాబా ! ఇది యేమి" నేను పరుగెత్తుకొని పోయి మీ కొఱకు రొట్టె చేసితిని. మీరు దానిని కొంచె మైనను తినక కుక్కకు వేసితిరి" అని ఆమె బాబాతో అనగా, బాబా ఆమెతో ఇట్లనిరి. "అనవసరముగా విచారించెదవేల ? కుక్క ఆకలి తీర్చుట నా ఆకలి తీర్చుటవంటిది. ప్రతి ప్రాణికి కూడ ఆత్మ కలదు. రూపము వేఱుకావచ్చు. కాని అందఱి ఆకలి ఒక్కటే. కొందఱు మాట్లాడలేరు. ఎవరైతే ఆకలితో ఉన్నవారికి భోజనము పెట్టెదరో వారు నాకన్నము పెట్టినట్లే దీనిని గొప్ప నీతిగా గుర్తించుము" అని బాబా తన సర్వ వ్యాపకత్వమును తెలిపిరి. ఆరోజు

నుండి ప్రతి రోజు అదే సమయమునకు లక్ష్మీబాయి షిండే బాబాకు రొట్టె సమర్పించేది. అందుకే చాలామంది వారు భోజనము చేయుటకు ముందు ఆ భోజనము నుండి ఒక ముద్ద కాకబలి (భూత బలి) గా బైట ఉంచుట చూచు చున్నాము. భోజన సమయములో తనకు తఱచుగా అతిథులు దొరుకుటలేదని నానా సాహెబ్ చాందోర్కర్ అను భక్తుడు బాబాతో అన్నారు. "అతిథి అంటే మానవుడే కాదని, భోజన సమయమునకు వచ్చిన ఏ ప్రాణియైన అతిథియేనని, క్రిమి కీటకాదుల నుండి మానవుల వఱకు అందఱు అతిథులే యని, కావున కాకబలి బయట సమృద్ధిగా విడచి రమ్ము. ఏ ప్రాణిని పిలువవద్దు, తఱుమవద్దు. ఏ ప్రాణి వచ్చినదన్నది పట్టించుకోవద్దు. ఆ విధముగా చేసిన యెడల అన్నింటిని అతిథులను ఆదరించినట్లే" అని బాబా చెప్పిరి.

విశ్వములో ప్రతి వ్యక్తికి ప్రతి జీవికి జరుగు చర్య తన నుండి జరుగు చున్నట్లుగా చూపుటే విశ్వరూపము. శ్యామకర్ణా అనే గుఱ్ఱమునకు తర్ఫీదు ఇచ్చు వ్యక్తి దానికి తర్ఫీదు ఇస్తూ కొట్టినప్పుడు ఆ కొట్టినది శ్యామకర్ణా అనే గుఱ్ఱమును కాదని, ఆ దెబ్బలు తన పై చూపించి, ఏ ప్రాణిని హింసించినను తనను హింసించినట్లేనని గుర్తింపుచేసి, తాను "విశ్వరూపుడ"నని ఋజువు చేసిరి బాబా.

శ్రీమతి కపర్దే (మనూతాయి లేక లక్ష్మీబాయి ఈమెను అజీబాయ్ అంటే ముసలమ్మ అని పిలిచేవారు) షిరిడీలో ఉన్నప్పుడు వారింటికి భోజనమునకు వస్తానని బాబా మాట యిచ్చారు. ఆ మాట ప్రకారము ఒక రోజు ప్రక్కయింటి వారి గేదె రూపములోను, రెండవ రోజున ఒక కుక్క రూపమునను వచ్చి ఆమెచే దెబ్బలు తిని, మూడవ రోజున చీమల రూపములో వచ్చి వంటకముల నారగించిరి. కాని యీ విషయములు ఆమె గ్రహించలేక భోజనమునకు రాలేదని బాబాను అడిగినది. అందుకు బాబా నీ చేత దెబ్బలు తిన్న గేదె, కుక్క మఱియు వంటకముల నారగించిన చీమలు నేనే అని తెలిపి అన్ని రూపములలో నున్నది నేనే యని, విశ్వములో నున్న సర్వ జీవులు తన రూపమేనని తెలియజెప్పిరి.

భక్త మహాల్సాపతి ఒక కుంటి కుక్కకు అన్నము పెట్టుచుండెడివాడు. ఒకరోజు అది ఎంతకు వెళ్ళలేదు. మహాల్సాపతి కఱ్ఱతో ఆ కుక్కను రెండు

దెబ్బలు కొట్టాడు. తరువాత మహాల్సాపతి మసీదులో బాబా పాదములు వత్తునప్పుడు "అరె భగత్ ! ఈ గ్రామములో నా వంటి జబ్బు కుక్క ఒకటి ఉన్నది. దానిని ప్రతి వెధవ కొట్టేవాడే" అని అనగానే, మహల్సాపతి ఆ కుంటి కుక్కను కొట్టిన తన తప్పును గుర్తించాడు. ఎంతో సులభముగా అర్థమగు రీతిలో జ్ఞాన బోధ చేసినట్లు దీనిని బట్టి తెలియుచున్నది.

ఉపాసని బాబా షిరిడీలో వంట చేసుకొనుచు మొదట మసీదులో సాయికి నివేదించిన తరువాత భోజనము చేసేవాడు. నేను ఏ రూపములో వచ్చినా గుర్తిస్తావా అని బాబా ఉపాసనీ బాబాతో అని, నల్ల కుక్క రూపములో వెళ్ళగా గుర్తించలేదు. మరురోజు ఒక బిచ్చగాని రూపములో వస్తే తిట్టి వెళ్ళగొట్టాడు. మసీదుకు వెళ్ళినప్పుడు నివేదన అంగీకరించక "బిచ్చగానిగా, [illegible] రూపములో ఉన్న నన్ను తిట్టావు. అంతటా నేనే యున్నానని గుర్తుంచుకో" అని తన సర్వ వ్యాపకత్వమును గుర్తింపు చేసిరి. కనుక జీవ - జంతు - పశు పక్ష్యాదుల యందు, మానవుల అందరిలో నున్న ఆత్మ - పరమాత్మ యైన తన స్వరూపమే, కనుక "సర్వ ప్రాణుల యందు కారుణ్య దృష్టి కలిగి యుండి ప్రేమతో మెలగవలెనని" బాబా బోధించిన ఈ తత్త్వమును మనము ఆచరణలో పెట్టుట అవసరమని గుర్తించవలెను.

## దుష్టులను సహితము సన్మార్గుల చేయుట

ఇతర యుగములలో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ జరిగినవి. ఈ కలి యుగములో దుష్ట శిక్షణకు అవకాశము లేదు. దుష్టత్వమే అధికముగా నున్న యీ కలియుగంలో దుష్టులను శిక్షించక సంస్కరించి సన్మార్గుల చేయుటయే యిప్పటి ధర్మము. అదియే సాయి తత్త్వము. బాబాకు అందరు సమానులే. అందఱు తన బిడ్డలైనప్పుడు ఎవరి యందైన భేదభావ మెట్లుండును ? ధూలియా కోర్టువారి విచారణలో ఒక దొంగ తాను చేసిన తప్పును గుర్తింపు చేసి బాబా అతనిని సంస్కరించుటకు ప్రయత్నించిరి. ఒకరోజు ఒక భక్తుడు ఇంకొక భక్తుని గూర్చి పరోక్షమున ఇతరుల ఎదుట నిందించుచుండెను. మిక్కిలి హీనముగా తిట్టెను. బాబా లెండి తోటకు పోవునప్పుడు ఆ భక్తుడు బాబాను కలిసెను. బాబా వానికొక పందిని చూపి యిట్లనెను. "చూడుము

ఈ పంది కసువును ఎంత రుచిగా తినుచున్నదో ! నీ స్వభావమట్టిది. నీవు మనస్ఫూర్తిగా, నీ సోదరునే తిట్టినావు. ఎంతయో పుణ్యము చేయగా నీకు మానవ జన్మ లభించినది. ఇట్లు చేసినచో షిరిడీ నీకు తోడ్పడునా ? అని మెల్లగా మందలించిరి. పర నింద మహా పాపము. "ఎవరైతే యితరులను నిందించెదరో నన్ను హింసించిన వారగుదురు. ఎవరైతే బాధలను భరించెదరో వారు నాకు ప్రీతి గూర్చెదరు" అని బాబా ఒక సందర్భంలో చెప్పిరి. కనుక మనలో నున్న దుష్ట భావములను సంస్కరించుకొని సాయి నాథుని ఆశ్రయించి సన్మార్గముతో జీవించుదము.

## బాబా బోధలు

సాయి బోధలకు ఒక సమయము గాని, సందర్భము కాని యుండదు. వేదికలపై ఎక్కి ఉపన్యసించుటకాని, ప్రత్యేకముగా ఏ ఒక్కని కొరకో చెప్పుట గాని జరుగదు. భక్తులు వారి చుట్టు పరివేష్టించి యున్నప్పుడు చిన్న చిన్న కథల ద్వారా చెప్పినదే బోధ. అది అప్పటి వారికే కాదు. ఇప్పటి వారికి కూడ వర్తించుచుండుట గమనార్హము. ప్రపంచములో మానవుని ఆధ్యాత్మికత వైపుకు తీసికొని వెళ్ళుటకు ఎన్ని మార్గాలున్నాయో ఆ అన్ని మార్గాలు తనవే నని, తన నిరంతర లీలా యజ్ఞము ద్వారా బాబా చెప్పక చెప్పారు. సాయి ఎప్పుడును వాచా బోధించినది అతి స్వల్పము. ఆయన బోధలన్నియు వారి చర్యల నుండి ఉద్భవించినవే.

## అహంకారమును వదలవలెను

మానవునికి అహంకారము ప్రధాన శత్రువు. అది తనను పతనము చేయుటయే కాక, తనపై ఆధారపడియున్న వారిని కూడ దహించివేయును. హేమాడ్ పంతు బాబా జీవిత చరిత్ర వ్రాయుటకు కోరినప్పుడు "వాడు తన అహంకారమును విడువవలెను. ఆ యహంకారమును నా పాదములపై పెట్టవలెను. వాని యహంకారము పూర్తిగా పడిపోయిన పిమ్మట అది మచ్చునకు కూడ లేనప్పుడు, నేను వాని మనసులో ప్రవేశించి నా చరిత్ర నేనే వ్రాసుకొందును" అని బాబా చెప్పియున్నారు. ఆత్మ జ్ఞానము అహంకారము

వదలనిదే కలుగనేరదు. భగవంతుని మనము ప్రథమముగా కోరవలసినది అహంకారమును నశింప చేయుమనియే. అహంకారము వదలనిదే ఆత్మ జ్ఞానము కలుగదని ఎన్నో సందర్భములలో బాబా చెప్పుట జరిగినది. "మనలో నున్న మన శత్రువైన అహంకారమును వదలుకొనుట" బాబాకు దక్షిణగా సమర్పించుకొను అంతశ్శత్రువు బారి నుండి రక్షించుకొనుటయే.

## అభయ ప్రదానము

"నా యందే మనస్సు నిలిపి, భక్తి శ్రద్ధలతో మనఃపూర్వకముగా నన్నే ఆరాధించు వారి యోగ క్షేమములు నేనే చూచెదను. వస్త్రాహారముల కొఱకు ప్రయాస పడవద్దు. నీకు ఏమైనా కావలసినచో భగవంతుని వేడుకొనుము. ప్రపంచములో పేరు, కీర్తులు సంపాదించుట మాని భగవంతుని కరుణా కటాక్షములు పొందుటకు ప్రయత్నించుము. మనస్సు నందు ఇష్ట దైవము యొక్క ఆకారము నిలుపుము. మనస్సును ధనము, గృహాదుల పట్ల సంచరించకుండ గట్టిగా నిలుపుము" అని చెప్పిరి. కావున నిష్కామ కర్మ చేయుచు సాయి నాథుని యందే మనస్సు నిలిపి ధ్యానించినచో బాబాయే మన యోగ క్షేమములు చూచుచు అభయ మొసంగగలరు.

## మన ప్రవర్తన

బాబా చర్చలకు గాని, వివాదములకు గాని యిష్టపడువారు కాదు. "ఎవరు కాని, ఎట్టి జంతువు కాని నీ వద్దకు వచ్చినచో నిర్దాక్షిణ్యముగా వానిని తరిమివేయకుము. నీవు దాహము గల వారికి నీరిచ్చినచో, ఆకలిగొన్న వారికి అన్నము పెట్టినచో, దిగంబరులకు వస్త్రము లిచ్చినచో, నీ వసారా యితరులు కూర్చుండుటకు వినియోగించినచో భగవంతుడు మిక్కిలి ప్రీతి చెందును" అని బాబా చెప్పిరి. అందుకే "తన భక్తుని గృహములో అన్న వస్త్రములకు లోటు ఉండదని" బాబా అభయమిచ్చిరి. "నీ యొద్దకు ధనము కొఱకు ఎవరేని వచ్చినప్పుడు నీ కిచ్చుటకు ఇష్టము లేకున్న నీయకుము. కాని కఠినముగా జవాబీయకుము. భగవంతుడే సర్వాధికారి. ఇతరులెవ్వరు కాపాడువారు కారు. వారి యిచ్ఛానుసారమే మనము నడచెదము. వారే మన

కోర్కెలు తీర్చెదరు. ఎవరైతే జీవిత పరమావధిని పొందెదరో వారు అమరులై సుఖముగా నుండెదరు. తక్కిన వారందరు పేరునకు ఊపిరి సలుపు వరకు మాత్రమే బ్రతికెదరు" అని బాబా చెప్పిరి.

"యాచించు వారికి శక్తి కొలది సమర్పించుము. అధికముగా అడిగినచో వీలు కాదని సౌమ్యముగా చెప్పుము. వారిపై కోపించ వద్దు"ని బాబా నానా సాహెబు చాందోర్కర్‌కు చెప్పిరి. కొంత కాలమునకు కల్యాణి పట్టణములో నానా సాహెబ్ చాందోర్కర్ ఇంటికి ఒక బిచ్చగత్తె వచ్చినది. పెట్టినది చాలదని, ఇంకా కావాలని పట్టుపట్టి ఎంత చెప్పినను వెళ్ళకపోగా నానాసాహెబ్ చాందోర్కర్ తన నౌకరుచే ఆ బిచ్చగత్తెను మెడబెట్టి బైటకు నెట్టించెను. తరువాత షిరిడీ వచ్చినప్పుడు బాబా నానా సాహెబు చాందోర్కర్‌తో మాట్లాడక తాను చేసిన తప్పిదము "బిచ్చగత్తెను మెడబెట్టి బయటకు నెట్టుట" గుర్తుచేసి అతని ప్రవర్తన సరిచేసిరి. కొద్దిపాటి జ్ఞానము గల మనము యథాశక్తి యితరులకు పరోపకారము చేయుచు జీవించుదము.

## జాతకము కన్నా బాబా వాక్కే సత్యము

బాంద్రా నివాసి బాబా తెండూల్కర్ అనే విద్యార్థి వైద్య పరీక్షకు కూర్చుండుటకు కష్టపడి చదువుచుండెను. అతనికి గ్రహములు సరి లేవని, పరీక్షలో కృతార్థుడు కాలేడని జ్యోతిషులు చెప్పుచున్నట్లు అతని తల్లి సావిత్రి బాయి తెండూల్కర్ బాబాతో చెప్పినప్పుడు "నా యందు నమ్మకముంచి జాతకములు, వాని ఫలితములు, సాముద్రిక శాస్త్రజ్ఞుల పలుకులు ఒక ప్రక్కకు త్రోసి తన పాఠములను చదువుకొనుమని చెప్పుము. శాంత మనస్సుతో పరీక్షకు వెళ్ళమనుము. అతడు ఈ సంవత్సరము తప్పక ఉత్తీర్ణుడగును. నా యందే నమ్మకముంచుమనుము" అని బాబా చెప్పిరి. తెండూల్కర్ పరీక్షలో ప్యాసగుటకు మార్కులు వచ్చునట్లు వ్రాయలేదని మౌఖిక పరీక్షకు హాజరగుటకు వెళ్ళలేదు. పరీక్షాధికారి వ్రాత పరీక్షలో కృతార్థుడవయితి వనియు మౌఖిక పరీక్షకు మాత్రము రమ్మని కబురు పంపిరి. అతడు మౌఖిక పరీక్షలో కూడ కృతార్థుడైనాడు. బాబా యందు నమ్మకముంచుటే ఫలితమునకు ముఖ్యమని, జాతకములు ఏమియు చేయలేవని తెలియనగును.

షోలాపూర్ జిల్లా అక్కల్ కోట నివాసి అయిన సపత్నేకర్ న్యాయశాస్త్ర పరీక్షకు చదువుచుండెను. షేవడే అనే విద్యార్థియు అతనితో కలసి చదువు చుండెను. తోటి మిత్రులు ఒకరి చదువును గూర్చి ఒకరు పరీక్షించుకొనుచు షేవడే పరీక్షలో కృతార్థుడు కాలేడని చెప్పిరి. సాయిబాబా కృప తనకు ఉన్నదని, కృతార్థుడనగుదునని షేవడే చెప్పెను, కాని సపత్నేకరు తనతోటి విద్యార్థియైన షేవడేను మఱియు సాయిబాబాను వెక్కిరించెను. సపత్నేకరు కృతార్థుడయ్యెను. పరీక్షలో కృతార్థుడు కాడని వెక్కిరించబడిన షేవడే కూడ బాబా కృపతో కృతార్థుడైనాడు. ఇప్పుడు కూడ బాబాను నమ్మి సేవించు విద్యార్థులు వారి విద్యారంగములో అభివృద్ధిలోనికి వచ్చుచుండిరి. ఇట్లే ఎందఱికో జాతకములో పిల్లలు లేరని చెప్పిన వారికి బాబా ఆశీస్సులతో పిల్లలు కలుగుట జరిగినది. నేటికిని విశ్వాసమున్న వారికి సంతానము ప్రసాదించుచునే యున్నాడు. వారి వాక్కు వేద వాక్కు, తిరుగులేనిది.

## విమోచన పొందుటకు బాకీ తీర్చవలసినదే

## (కర్మను అనుభవించవలసినదే)

బాబా వద్దకు వచ్చిన యిద్దరు గోవా పెద్ద మనుష్యులలో ఒకరు రూ. 35/-లు దక్షిణ ఈయబోగా బాబా తీసికొనుటకు నిరాకరించినప్పుడు శ్యామా బాబాను దక్షిణ ఎందుకు తీసికొనుటకు నిరాకరించితిరి అని అడుగగా "శ్యామా! ఎందుకో ? నీకేమి తెలియును. నే నెవరియొద్ద ఏమియు తీసికొనను. మసీదు మాయి బాకీ కోరును. బాకీ యున్నవాడు చెల్లించి ఋణ విమోచన పొందవలెను. నాకు ఇల్లు గాని, ఆస్తిగాని, కుటుంబము గాని గలదా ? నాకేమియు నక్కఱ లేదు. నేను ఎప్పుడు స్వతంత్రుడను. ఋణము, శత్రుత్వము, హత్యా దోషము చెల్లించి తీరవలసినదే. దానిని తప్పించు మార్గము లేదు" అని చెప్పిరి.

సాయిని త్రికరణ శుద్ధిగా ఆశ్రయించిన భక్తులకు, వారి వారి యోగ్యతను బట్టి బాబా విముక్తి ప్రసాదించుట అనాడే కాక-ఈనాడు-ఏనాడు జరుగుచునే యుండును.

## జన్మ మెత్తిన వారందఱు సద్గతి పొందుదురా ?

జన్మ మెత్తిన వారందఱు సద్గతి పొందరు. 'దాము అన్నా'కు ఒక సందర్భములో బాబా యిట్లు చెప్పిరి. "మామిడి చెట్టు వైపు పూత పూయు చున్నప్పుడు చూడుము. పూవులన్నియు పండ్లయినచో నెంత మంచి పంట యగును కాని యట్లు జరుగునా ? పువ్వులుగానే చాలా వఱకు రాలిపోవును. కొన్ని పిందెలు గాలికి రాలిపోగా కొన్ని మాత్రమే మిగులును" అని చెప్పారు. అదే విధముగా మానవ జన్మమెత్తిన వారు కూడ వారి కర్మ పరిపక్వతను బట్టి ఏ లక్షమందిలో ఒక్కడు మాత్రమే ఫలితమును పొందుచున్నాడు. వేదాంతము అని మనము చెప్పుకుంటాము. అంటే, కర్మ చేయవలసినదే. సత్కర్మల నాచరించుటే వేదాంతము. ఆ సత్కర్మల ఫలితమును బట్టే జన్మ పరిపక్వత నిర్దేశించబడుట వలన సాయి నాథుడు మన కొఱకు ఆచరించి చూపిన సత్కర్మల నాచరించి జన్మరాహిత్యమును పొందుదము.

## సన్యాసికి నుండవలసిన లక్షణములు

విజయానంద్ అను మద్రాసు సన్యాసి షిరిడీ వచ్చి బాబా వద్ద ఉన్నాడు. తల్లికి జబ్బుగా ఉందని మద్రాసు నుండి ఉత్తరము రాగా తల్లి వద్దకు వెళ్ళుటకు బాబా అనుజ్ఞ కోరగా బాబా అతనితో ఇట్లనిరి. "నీ తల్లిని అంతగా ప్రేమించువాడవగుచో సన్యాస మెందుకు పుచ్చుకుంటివి? కాషాయ వస్త్రములు ధరించు వానికి దేనియందును, అభిమానము చూపుట తగదు. ధనము, ఐశ్వర్యము మొదలగునవి నిత్యము కాదు, శరీరము శిధిలమై తుదకు నశించును. ఇహలోక వస్తువుల యందు అభిమానము విడచి యెవరు హరి యొక్క పాదములను శరణు వేడెదరో వారు సకల కష్టముల నుండి తప్పించుకొని మోక్షమును పొందెదరు. ఎవరైతే భక్తి ప్రేమలతో భగవంతుని ధ్యానము చేయుచు మననము చేసెదరో వారికి దేవుడు సహాయము చేయును. కోరికలు లేనివాడవై రేపటి నుండి భాగవతమును పారాయణ చేయుము. భగవంతుతు సంతుష్టి చెంది నీ విచారమును తొలగించును. నీ భ్రమలు తొలగిపోవును. నీకు శాంతి కలుగును" అని చెప్పిరి. విజయానంద్ బాబా చెప్పినట్లు భాగవతమును రెండుసార్లు పారాయణ చేసెను. మూడవరోజు బడే బాబా తొడపై విజయానంద్

ప్రాణములు వదలెను. బాబా పై ఉపదేశము ద్వారా విజయానంద్‌కు సద్గతి కలిగించిరి. కావున మోహము (మమకారము)ను త్యజించుట అవసరము.

## సర్వమునకు కర్త భగవంతుడే

శ్యామా మఱదలు ప్లేగు వ్యాధితో బాధపడుచున్నప్పుడు బాబా కృపతో తగ్గగా ఆ సందర్భములో శ్యామాతో బాబా యిట్లనిరి. "కర్మ యొక్క మార్గము విచిత్రమైనది. నేను ఏమి చేయకున్నను నన్నే సర్వమునకు కారణ భూతునిగా నెంచెదరు. అది అదృష్టమును బట్టి వచ్చును. నేను సాక్షీ భూతుడను మాత్రమే. చేయువాడు, ప్రేరేపించువాడు దేవుడే. వారు మిక్కిలి దయార్ద్ర హృదయులు, నేను భగవంతుడను కాను, ప్రభువును కాను. నేను వారి నమ్మకమైన బంటును. వారి నెల్లప్పుడు జ్ఞాపకము చేయుచుందును. ఎవరైతే తన అహంకారమును ప్రక్కకు ద్రోసి భగవంతునికి నమస్కరించెదరో, ఎవరు వారిని పూర్తిగా నమ్మెదరో వారి బంధములూడి మోక్షమును పొందెదరు" అని చెప్పిరి. ఈ ప్రపంచకర్త భగవంతుడే కాని, ఈ కలియుగములో మనకు భగవంతుడు సాయి నాథుడే. కర్తయైన సాయి నాథుని ఆశ్రయించుటే మన కర్తవ్యము.

## సర్వమునకు సాయియే భగవంతుడు

శ్రీ వాసు దేవానంద సరస్వతి (టెంబే స్వామి) బాబాకు ఒక టెంకాయ యిమ్మని తనను దర్శించ వచ్చిన నాందేడు ప్లీడరగు పుండలీకరావునకు ఇచ్చిరి. అతడు ఆ కాయను గుర్తు లేక దారిలో పగులగొట్టి తినుట జరిగినది. ఆ కొబ్బరికాయ బాబాకు ఈయలేక పోవుటచే తన తప్పు మన్నించమని పుండలీకరావు బాబాను వేడెను. అప్పుడు బాబా వానితో నిట్లనిరి. "ఆ విషయమై నీవేమాత్రము చింతింపనవసరము లేదు. అది నా సంకల్పము ప్రకారము నీకీయబడినది. తుదకు దారిలో పగులగొట్టబడెను. దానికి నీవే కర్తవని అనుకొననేల? మంచిగాని, చెడ్డగాని చేయుటకు నీవు కర్తవని యనుకొనరాదు. గర్వాహంకార రహితుడవయి యుండుము. అప్పుడే నీ పరచింతన యభివృద్ధి పొందును" అని బాబా బోధించిరి.

ప్రతి పని మనమే చేయుచున్నామని, మనము చేయకపోతే జరగదని, కలి మాయవలన భావిస్తూ ఉంటాము. వాస్తవమును అర్థము చేసుకొనుటకు

ప్రయత్నించము. మనకు మించినదని తలచినప్పుడు మాత్రమే భగవంతుని తలుస్తాము. భగవంతుని ఆజ్ఞ లేనిదే ఆకైనా కదలదని చెప్పినట్లు మనము నిమిత్త మాత్రులమని, మనముచేయు పనికి కర్త భగవంతుడే యని తెలుసుకొని ప్రవర్తించుటే జ్ఞానము. భగవంతుడైన సాయి నాథుని సంకల్పానుసారముగ మనము ప్రవర్తించుచున్నామని గ్రహించవలెను.

## ధర్మము విత్తనము నాటుట వంటిది.

కాకా మహాజనిని బాబా రూ. 15/- లు దక్షిణ అడిగి పుచ్చుకొని అతనితో నిట్లనిరి. "నేను ఒక రూపాయి దక్షిణ ఎవరి వద్ద నుంచి గాని తీసికొనినచో దానికి పదిరెట్లు ఈయవలెను. నేమూరకనే యేమి తీసికొనను. యుక్తాయుక్తములు తెలియకుండగనే నేనెవరిని అడుగను. ఫకీరెవరిని చూపునో వారి వద్దనే తీసికొందును. దానము చేయు వాడిచ్చునది ప్రస్తుతము విత్తనము నాటుట వంటిది. అది ముందు ముందు గొప్ప పంటను అనుభవించుట కొఱకే. ధర్మము చేయుటకు ధనము ఉపయోగించవలెను. దానిని స్వంతము నకు వాడుకొనిన వ్యర్థమయి పోవును గత జన్మలలో నీవు దానము చేసి యుండిన గాని, నీ విప్పుడనుభవించలేవు. కనుక ధనము పొందవలెననినచో దానిని ప్రస్తుతము ఇతరులకు ఇచ్చుటయే సరియైన మార్గము. దక్షిణ యిచ్చు చున్నచో వైరాగ్యము పెరుగును. దాని వలన జ్ఞానము కలుగును. ఒక రూపాయి యిచ్చిన 10 రూపాయలు పొందవచ్చును"అని చక్కని ఆధ్యాత్మిక బోధ చేసిరి. "చేసుకొన్న వానికి చేసుకున్నంత" "పెట్టి పుట్టాడు" అను సామెతలు దీని వలననే కలిగినవి.

ఈ జన్మలో మనమనుభవించుచున్న సంపద, సుఖము ఈ జన్మ యొక్క సత్కర్మ కాదని గ్రహించవలయును. గత జన్మలో మనము నాటిన ధర్మమనే విత్తనమే ఈ జన్మలో పుష్పించి ఫలించుచున్నదని గుర్తించవలెను.

## మధ్యమున్న అడ్డుగోడను తీసివేయవలెను

కాకా మహాజని స్నేహితుడు బాబాకు దక్షిణ యీయనని షిరిడీ వచ్చు నప్పుడు కాకా మహాజనితో చెప్పినాడు. బాబా సముఖములో తన మనస్సును

మార్చుకొని బాబా కాకానే దక్షిణ అడుగుట. తనను అడుగకపోవుట కాకా మహాజనితో చెప్పుచుండగా బాబా అతని దక్షిణ రూ. 17/- లు స్వీకరించి అచట చేరిన వారికి సలహా రూపముగా ఇట్లు చెప్పిరి. "నీవు దానిని తీసివేయుము మధ్యనున్న అడ్డుగోడను తీసివేయుము. అప్పుడు మనమొకరినొకరము ముఖాముఖి చూచుకొనగలము. కలిసికొనగలము" అని చెప్పిరి.

బి. వి. దేవ దహనులో మమలతదారు. ఇతడు ఒకరోజు షిరిడీలో బాలకరాముడను వానిని బాబాను గురించి అడిగి తెలుసుకొనుటకు ప్రయత్నించి నప్పుడు సాయిబాబా బి. వి. దేవును పిలిచి "ప్రతిరోజు జ్ఞానేశ్వరిని చదువుము. ప్రతి నిత్యము కొంచెమైనను క్రమము తప్పక చదువుము. చదువుచున్నప్పుడు దగ్గఱ నున్న వారికి శ్రద్ధతో బోధపఱచి చెప్పుము. నేను నీకు జల్తారు నిచ్చుటకు కూర్చొని యున్నాను. ఇతరుల వద్దకు పోయి దొంగిలించెదవేల ? నీకు దొంగతనమునకు అలవాటుపడవలెనని యున్నదా ?" అని మందలించిరి. లాలా లక్ష్మీచందు 1910 అక్టోబరులో రూ. 15/- లు అప్పు తీసికొని శంకరరావు అను మిత్రునితో కలసి రైలులో కొందఱు భక్తులతో కలసి భజన చేయుచు షిరిడీ బయలుదేరినాడు. ఆ రైలులోనే ప్రయాణించుచున్న షిరిడీ నివాసులైన ముస్లిములను చూచి బాబాను గుఱించి వివరములు అడిగినాడు. షిరిడీ చేరగానే బాబా, లక్ష్మీచందును అచటి వారికి చూపుచు వీడెంత టక్కరి ? ఒకవంక భజన చేస్తూనే నన్ను గుఱించి ఇతరులను అడుగుతాడు. మనమే చూసి తెలుసుకోవాలి గాని ఒకరి నడిగేదేమిటి ?" అని అన్నారు. కనుక బాబాను గుఱించి ఎవరి అనుభవము వారిదే. గురు - శిష్యుల మధ్య సంధాన కర్తతో పనిలేదు. సదా శిష్యుని చూపు గురువు పైనుండుట-గురువు యొక్క దృష్టి శిష్యునిపై యుండుటే గురు శిష్య సంబంధము. అదే సద్గురు సాయి విధానము.

## "నేను" అనగా నెవరు ?

ఒక సందర్భములో బాబా యిట్లనిరి "నన్ను వెదకుటకు నీవు దూరము గాని, మఱెచ్చటకు గాని పోనక్కఱలేదు. నీ నామము, నీ యాకారము

విడచినచో నీలోనే గాక అన్ని జీవులలోను చైతన్యము లేదా యంతరాత్మగా నున్నది నేనే దీనిని నీవు గ్రహించి, నీలోనే గాక అన్నిటిలో నన్ను చూడుము. దీనిని నీవభ్యసించినచో వ్యాపకత్వము అనుభవించి తుదకు నాలో ఐక్యమగుదువు" అని చెప్పిరి. దీని వలన మనము గ్రహించవలసినదేమనగా మనలోనున్న ఆత్మ, అందఱిలోనున్న ఆత్మ ఒక్కటే. పరమాత్మ స్వరూపములే. నేననగా ఆత్మయే అందఱిలో నున్న "నేను - నేను" అను సద్వస్తువైన ఆత్మయే పరమాత్మ

## అమృత తుల్యమగు బాబా వాక్కులు

ఆయా సందర్భములలో బాబా పలికిన అమృత వాక్కులు కొన్ని యిచట చూపుచున్నాను.

ఎవరు నన్ను ఎక్కువగా ప్రేమించెదరో వారు ఎల్లప్పుడు నన్ను దర్శించెదరు. నేను లేని ఈ జగమంతయు వానికి శూన్యము. నా కథలు తప్ప మఱేమియు చెప్పడు. సదా నన్నే ధ్యానము చేయును. నా నామమునే యెల్లప్పుడు జపించుచుండును. ఎవరు సర్వస్య శరణాగతి చేసి నన్నే ధ్యానింతురో వారికి నేను ఋణస్థుడను. వారికి మోక్షమునిచ్చి వారి ఋణము తీర్చుకొనెదను. ఎవరు నన్నే చింతించుచు, నా గూర్చియే దీక్షతో నుండి. నాకర్పించనిదే యేమియు తినరో అట్టి వారిపై నేను ఆధారపడి యుందును. ఎవరైతే నా సన్నిధానమునకు వచ్చెదరో వారు, నదులు సముద్రములో కలిసిపోయినట్లు నాలో కలిసిపోవుదురు. కనుక నీవు గర్వము, అహంకారము లేశమైన లేకుండ, నీ హృదయములో నున్న నన్ను సర్వస్య శరణాగతి వేడవలెను. కనుక అహంకారమే మానవుని పతనమునకు కారణము.

"ఈ పాదములు ముదుసలివి. పవిత్రమైనవి. ఇక నీ కష్టములు తీరిపోయినవి. నా యందే నమ్మకముంచుము. నీ మనోభీష్టము నెఱవేరును" అని బాబా పాదములు ఆశ్రయించిన సపత్నేకర్‌ను అశీర్వదించుచు బాబా చెప్పిరి. అంటే బాబా పాదములు ఆశ్రయించు ప్రతి వారి మనోభీష్టములు

తీరుట నిస్సందేహము. సపత్నేకర్ బాబాకు మాటి మాటికి నమస్కరించు చుండగా "ప్రేమ, వినయములతో నొక్కసారి నమస్కరించిన చాలునని" బాబా చెప్పిరి. ప్రేమ లేని వేయి నమస్కారముల వలన ప్రయోజనము లేదు.

జగద్రక్షకుడైన సాయి పాదముల నాశ్రయించి నిష్కామముతో సేవించుచు వారాచరించిన సత్కర్మలను త్రికరణ శుద్ధిగా నాచరించి, వారి బోధల ననుసరించి మన జీవితముల తీర్చిదిద్దుకొని ఇహ - పర సుఖములు పొందుదుము గాక !

ఓం శ్రీ సాయి నాథాయ నమః



సందేహము లడపవె ! నీ
యందున నేకాంత భక్తి నందింపవె ! ని
న్నెందేమడిగెదవె ! యఘ
సందోహ మడంపగదవె ! సాయీ నాథా !

# సాయిబాబా చరిత్రము

## తృతీయాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# సాయిబాబా సకల దేవతా స్వరూపుడు

# సమర్థ సద్గురువు

## సాయి సకల దేవతా స్వరూపుడు

శ్రీ షిరిడీ సాయిబాబా సకల దేవతా, సకల సాధు స్వరూపుడు. సకల జీవ రాసులకు మూలాధారమైన చైతన్య శక్తి సాయియే. ఏ దేవతా మూర్తిని పూజించినను తనను పూజించినట్లేనని శ్రీ సాయి ఎందఱికో ప్రత్యక్ష నిదర్శనము లిచ్చియున్నారు. అట్టి నిదర్శనములు ఓర్పు-నిష్ఠలతో సేవించు భక్తులకు ప్రసాదించుచున్నారు.

"జయామనీం జైసా భావ - తయా జైసా అనుభావ" మధ్యాహ్న హారతిలో మనము పాడుట యథార్థము. ఎవరి భావము ఎలా ఉంటే వారికి అలా అనుభవమిస్తారు సాయి. అయితే సాయినాథుడు ఏ ఒక్క దేవతా మూర్తికి ప్రతినిధి కారు. అందఱి దేవతా స్వరూపము తానే. ఏ ఏ దేవతలు ఏ ఏ కోర్కెలు తీర్చుచున్నారో ఆయా దేవతలందఱు ఇచ్చు అన్ని కోర్కెలు తానొక్కరే తీర్చు పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపము సాయి. అన్ని మతముల వారి యొక్క యిష్టదైవ స్వరూపములు తానై యున్నాడనిన, తన కంటె వేఱు ఏమి లేదని తెలుపుటయే. తన ఆశ్రితుల, భక్తుల కోరికల ననుసరించి బాబాను ఏ రీతిగా భావించిన, అర్చించిన, ప్రార్థించిన వారల కాయా రీతులలో దర్శన స్పర్శనల నిచ్చి కామితార్థములను తీర్చుచున్నారు. సాయి ఎట్లు దర్శన మిచ్చినది కొన్ని సంఘటనలు తెలుసుకొందము.

## వివిధ దేవతా స్వరూపములతో దర్శనమిచ్చుట

1900 సంవత్సరములో నానా సాహెబు చాందోర్కర్ బంధువు శ్రీ బాలా సాహెబుకు తన దైవమైన దత్తాత్రేయునిగా బాబా దర్శనమిచ్చారు. 1911 వ సంవత్సరములో దత్త జయంతి రోజు సాయంత్రము గం. 5-00 లకు సాయిని దర్శింపవచ్చిన బల్వంత్ భోజోకర్‌కు మూడు తలల బాల దత్త మూర్తిగా దర్శనమిచ్చి ఆనందపఱచారు. 1913 లో రఘువీర్ పురందరేకు, వారి తల్లికి, సాయిని దర్శించినపుడు వారి దైవమైన రుక్మా సమేత విఠలుడుగా దర్శనమిచ్చి ఒక్క దేవతా మూర్తియే కాదు. ఎందఱిగా నైనా ఒకేసారి దర్శన మివ్వగలనని నిరూపించుచు, ఆ భక్తులను తన్మయత్వము పొందించారు సాయి. గౌలి బువా అనే 95 ఏండ్ల భక్తునికి సాయి పండరీ నాథుని రూపముగా దర్శనమిచ్చారు. చిదంబరరావు గాడ్గిల్, బాంద్రా నివాసి యైన ఒక స్త్రీ, వీరిద్దఱు గణపతిని పూజించువారు. వారి పూజా విధానమును గుర్తింపు చేసి వారు పూజించు గణపతికి తనకు భేదము లేదని నిరూపించారు.

శ్రీ బి. వి. దేవు సోదరునకు గణపతి రూపమున దర్శనమిచ్చారు. అలాగే హనుమద్భక్తుడైన నిమోన్కర్ కుమారుడు సోమనాథునికి మారుతి రూపముగా దర్శనమిచ్చి హనుమంతునికి తనకు భేదము లేదని నిరూపించారు. ఒక మమలతదారు స్నేహితునకు, మఱియు మద్రాసు భజన సమాజపు యజమాని భార్యకు వారు బాబాను దర్శించినప్పుడు వారి దైవమైన శ్రీరామ చంద్రునిగా దర్శనమిచ్చి వారిలోని భేద భావమును తొలగించారు.

సపత్నేకర్ చావడి ఉత్సవము జూచునప్పుడు బాబా పాండురంగనివలె ప్రకాశించుచున్నట్లు వానికి కనుపించారు. అటులనే బాలారామ్ ధురంధర్ ఒక గురువారము చావడి హారతి సమయమందు బాబా ముఖమునందు పాండురంగని తేజస్సును, మఱునటి యుదయము కాకడ హారతి సమయములో పాండురంగని ప్రకాశమును జూచెను.

రాధాకృష్ణమాయి సాయినాథుని ప్రథమ దర్శనముననే తన యిష్ట దైవమైన కృష్ణ స్వరూపముగా సాయిని దర్శించి వారి సేవ చేయుటకు అచటనే

యున్నది. బూటి మురళీధరుని విగ్రహము ప్రతిష్ఠించుటకు నిర్మించిన మందిరములో తానే యుందునని బాబా స్వయముగా చెప్పుట, మురళీధరునకు తనకు భేదము లేదని చెప్పుటయే కాక, తన భౌతిక దేహమును అందులో సమాధి చేయించుకొన్నారు.

భక్తులలో మనస్సును స్థిరపఱచి ఆధ్యాత్మిక చింతన కలిగించుటకు సన్మార్గులను చేయుటకు, వారి మనోభీష్టము ప్రకారము ఎవరు ఏ విధముగా తలచిన ఆ విధముగా బాబా నిదర్శనములు ప్రసాదించిరి. అందఱికి ఒకే విధముగ అనగా భగవత్స్వరూపములుగా నిదర్శనమిచ్చుట కాదు. ఒకరికి వ్యాధి తగ్గించుట, ఒకరిని ఆపదలో రక్షించుట. అట్లే ఎన్నో రకముల ఆ యా భక్తుల యోగ్యతను బట్టి బాబా అనుగ్రహము ప్రసాదించుట జరిగినది. మన మేలు కొఱకు, మన కోర్కెలు తీర్చుకొనుటకు భగవంతుని ఆశ్రయించు చుందుము. వారు ఆ కోర్కెల వఱకే తీర్చుచుందురు. కాని సాయినాథుని ఓర్పు - విశ్వాసముతో సేవించు భక్తులు వారు కోరిన కోర్కెలను తీర్చుటే కాక భక్తుడు కోరకపోయినను ఆ భక్తుని క్షేమమునకు అవసరమగు మేలు సాయి చేయుచునే యుండును. కావున భక్తుడు విశ్వాసముతో త్రికరణ శుద్ధిగా సాయిని నమ్మి తన సర్వస్వము వారికి అర్పణ చేసుకొనవలెను.

## చిత్రపట రూపమున దర్శనమిచ్చుట

సాయిని శరీరములో దర్శించునప్పుడే కాదు. వారి పటము నుండి కూడ సాయి భక్తులు వారి యిష్ట దైవములను దర్శించుట జరుగుచున్నది. సదాశివ జోషికి సాఠెవాడలో శ్రీ సాయి పటములో శ్రీ నృసింహ స్వామిగా దర్శనమిచ్చి తన పటములో కూడ భక్తుల కోరికల ప్రకారము దర్శన మీయగలనని నిరూపించినారు. ఇప్పుడును అట్టి నిదర్శనము లిచ్చుచున్నారు. అందుకే శ్రీ సాయి నాథుని శ్రీరామ, శ్రీకృష్ణ, శివ, మారుతి, నాగ, దత్త స్వరూపములుగా భక్తులు అప్పుడు - ఇప్పుడు పూజించుచున్నారు. మహమ్మదీయులు వారి యిష్ట దైవముగా సాయినాథుని కొలుచుచున్నారు. బాబా భౌతిక దేహముతో ఉండగనే స్వయముగా పూజలందుకొనిరి. భక్తుల గృహములలో బాబా

పటమునకు ఆనాడును పూజలు జరిపిరి. నేటికిని సాయి మందిరములలో విగ్రహములకు, భక్తుల గృహములలో సాయి పటములకు పూజలు జరుపుకొనుట జరుగుచున్నది.

శ్యామా అను భక్తుడు కాశీ - గయ యాత్రలకు వెళ్ళునప్పుడు నీ కంటె ముందు నేను గయలో నుందునని బాబా చెప్పినట్లు శ్యామా గయలో పండా యింటికి వెళ్ళగనే అచట సాయి చిత్రపటము దర్శనమిచ్చినది. అటులనే హేమాడ్ పంతుకు కలలో కనుపించి తన యింటికి విందుకు వస్తానని బాబా చెప్పి భోజన సమయమునకు తన పటరూపములో వచ్చినారు. కొందఱు భక్తులు బాబాను దర్శించుట అదే మొదటిసారి యైనను ఇదివఱకే వారిని ఎఱుగుదునని బాబా చెప్పుట జరిగినది. అనగా బాబా వద్దకు వారు రాక పూర్వము బాబా పటమునకు నమస్కరించి యుండుటయే.

1917 లో బాల బువాసుతార్ బాబాను మొదటిసారిగా దర్శించగనే యితనిని నాలుగు సంవత్సరముల క్రిందటనే ఎఱుగుదునన్నారు బాబా. అనగా నాలుగు సంవత్సరములకు పూర్వమే బాబా పటమును బాల బువాసుతార్ చూచి యుండిరి. బాబా యిచ్చిన యీ నిదర్శనముల బట్టి యైనను తనకు, తన పటమునకు భేదము లేదని బాబా నిరూపించుటను మనము గుర్తించవలెను. అట్టి విశ్వాసముతో ఇప్పుడు మనము పూజించు - అర్చించు - సేవించు సాయి చిత్ర పటములలో సాయిని ప్రత్యక్షముగా దర్శించి తరింపవలెను.

## సాయినిదర్శించుమని దేవతాస్వరూపములు ఆదేశించుట

వణి అనే చోట గల సప్త శృంగిదేవి ఆలయ పూజారి కాకాజి వైద్యను తన మనశ్శాంతి కొఱకు సాయిని దర్శించుమని సప్త శృంగిదేవి ఆదేశించినది. కాకాజి వైద్య సాయిని దర్శించి మనశ్శాంతిని పొందినాడు. మహావిష్ణు భక్తుడైన రేగేకు మహావిష్ణువు ప్రత్యక్షమై సాయిబాబాను ఆశ్రయించుమని ఆదేశించుట జరిగినది. ఇది నమ్మవచ్చునా లేదా అను సంశయముతో మనము జీవితమును వ్యర్థపఱచుకొనుచున్నాము. ఇప్పుడు కూడ ఇట్టి ప్రత్యక్ష నిదర్శనములు

కలవు. ఎంతో కాలము నుండి కాళికాదేవిని ఉపాసించుచున్న శ్రీ కాళీ భగవాన్ అను భక్తుని ఆ మాత "శ్రీ షిరిడీ సాయిని ఆశ్రయించుము" అను ఆదేశము ప్రకారము ఆ భక్తుడు ఇప్పుడు 'సాయి సేవ చేయుచున్నారు. ఎవరైనను వారిని గుంటూరులోని వారి ఆశ్రమము వద్ద దర్శించి అనుమానమున్నచో నివృత్తి చేసుకొనవచ్చును. ఇట్టి ప్రత్యక్ష నిదర్శనములు కోకొల్లలు.

## సశరీరముగా దర్శనమిచ్చుట

బాలారామ్ మాన్‌కర్ అను వాని ఆధ్యాత్మిక ప్రగతికి బాబా అతనికి రూ. 12/-లు ఇచ్చి మచ్ఛింద్రఘడ్ అను ప్రదేశమునకు పంపిరి. మచ్ఛింద్రఘడ్‌లో ఉన్న బాలారామ్ మాన్‌కర్‌కు ఒకరోజున శ్రీ సాయి షిరిడీలోనే ఉండి, మచ్ఛింద్రఘడ్‌లో తన స్వప్నరూపంతో ప్రత్యక్ష నిదర్శనమిచ్చి, తాను షిరిడీలో మాత్రమే ఉన్నానను మూఢ విశ్వాసము లేకుండ, సర్వ వ్యాపినని, అన్ని చోట్ల నున్నానని నిరూపించినారు."నీవు పంచేంద్రియములతో కూడున్న మూరల మనిషిగా నన్ను భావించితివి. నేనెల్లప్పుడు షిరిడీలోనే యుండెదనను కొంటివి. ఈ నా రూపమును షిరిడీలోని నారూపముతో పోల్చుకొని నిర్ధారించుము" అని బాలారామ్ మాన్‌కర్‌తో బాబా అనిరి. మఱి వారికి హద్దులు ఏవి ?

మేఘునకు తన గదిలో నిద్రించునప్పుడు బాబా దర్శనమిచ్చి త్రిశూలమును వ్రాయుమని ఆదేశించారు. బాబాను స్వయముగా మేఘుడు కలిసినప్పుడు "మీరు నన్ను లేపినట్లు భావించితిని తలుపులన్ని వేసి యుండుటచే అది దృశ్య (స్వప్న) మనుకొంటిని" అని బాబాతో అనెను. అప్పుడు బాబా మేఘునితో ఇట్లనిరి. "ప్రవేశించుటకు నాకు వాకిలి అవసరము లేదు. నాకు రూపము లేదు నేనన్నిచోట్ల నివసించుచున్నాను. ఎవరైతే నన్నే నమ్మి, నా ధ్యానము నందే మునిగి యుందురో వారిపనులన్నియు సూత్రధారినై నేనే నడిపించెదను" అని చెప్పిరి.

ఒకరోజు ఆత్మారాముని భార్య షిరిడీలో ఉన్నప్పుడు బాబా ఆమెతో ఇట్లనిరి. "తల్లీ ! బాంద్రాలో మీ యింటికి ఏమేని తినే ఉద్దేశముతో పోయి

నాను. తలుపులు తాళము వేసియున్నను ఎటులనో లోపలకు ప్రవేశించితిని. కాని తినుటకు ఏమియు లేక తిరిగి వచ్చితిని" అని చెప్పుచు ఆత్మారాముడు తన పూజలో ప్రసాదము నైవేద్యము పెట్టలేదని గుర్తు చేసిరి. బాబా షిరిడీ లోనే ఉండి ఎంత దూరములోని సంఘటనము నైనను చెప్పుటే కాదు. ఏ ప్రదేశములోనికైనను తాను ప్రవేశించగలనని నిరూపించారు ఒకరోజు మార్తాండు అను భక్తుడు ఖండోబా ఆలయములో కూర్చొని ఉండగా బాబా అచట మార్తాండుకు ప్రత్యక్షమై వెంటనే ఖండోబా విగ్రహము వద్దకు వెళ్ళి అందులో లీనమైపోయిరి. మార్తాండు ఆశ్చర్యముతో విగ్రహము వెనుక చూచాడు. అక్కడ ఎవరు లేరు. తిరిగి విగ్రహము నుండి బాబా వెలువడి చిఱునవ్వుతో మార్తాండ్‌ను చూస్తూ బయటకు వెళ్ళిపోయినారు. బాబా సశరీరులుగా దర్శనములు ఇప్పుడును ఇచ్చుచున్నారు. ఈ గ్రంథములోని 6వ అధ్యాయములో అట్టి నిదర్శనములు చూడవచ్చు.

## ఇతర సాధు రూపముల దర్శనము

బి. వి. దేవు తన తల్లి నోముకు సాయిని ఆహ్వానించుచు బాపు సాహెబు జోగుకు ఉత్తరము వ్రాసినపుడు, బాబా బాపు సాహెబు జోగుతో "నీవు, నేను, ఇంకొకరు వస్తామని బి. వి. దేవుకు ఉత్తరము వ్రాయు"మని చెప్పిరి. సాయి షిరిడీలోనే యుండి తాను చెప్పినట్లుగా బెంగాలి సాధువుగా మఱి యిద్దఱితో కలసి బి. వి. దేవుగారి యింటికి ఉద్యాపనకు వెళ్ళి విందారగించి సకల సాధు స్వరూపుడు తానేనని నిరూపించారు. అట్లే గోవా భక్తుడొకడు తాను పోగొట్టు కొన్న ధనము పొందుటకు, ఒక ఫకీరుగా సాయి వానికి దర్శనమిచ్చి పోయిన ధనమును పొందునట్లు మార్గము తెలిపియున్నారు.

బాయి కృష్ణాజీ అక్కల్ కోటకర్ మహారాజుగారి భక్తుడు. 1912 లో బాబాగారి పాదుకలు స్థాపించినపుడు అక్కల్ కోట పోవుటకు బాబా అనుమతి కోరగా "అక్కల్ కోటలో నేమున్నది? అక్కడకేల పోయెదవు? అక్కడుండే మహారాజు ప్రస్తుతమిక్కడే యున్నారు. వారు నేనే" అని బాబా చెప్పుటచే అక్కల్ కోట వెళ్ళుట బాయి కృష్ణాజీ మానుకొనెను. అంతకు ముందే అక్కల్

కోట మహారాజు బాయి కృష్ణాజీ కలలో కనుపించి, ప్రస్తుతము షిరిడీ నా నివాస స్థలము. అచ్చటికి పోయి నీ పూజ యొనరింపుము" అని చెప్పిరి. శ్రోత్రియుడైన మూలే శాస్త్రి అయిష్టముగానే సాయిని దర్శించినపుడు మూలే శాస్త్రి గురువైన ఘోలప్ స్వామిగా దర్శనమిచ్చి అతని గురువు గారికి, తనకు భేదము లేదని నిరూపించి మూలేశాస్త్రిని సంతృప్తి పఱచి యతని సంశయమును నివృత్తి చేసిరి. సాయికి నమస్కరించనని చెప్పిన పండిట్ అను నతడు సాయిని తన గురువైన ధోపేశ్వర నివాసి యగు రఘునాథ మహారాజుగా దర్శించి బాబాకు నమస్కరించి, గంధము పూసి పూజ చేసిరి.

ఇట్టి నిదర్శనము లెన్నింటినో సాయి మనకు ప్రసాదించారు, భక్త మహాల్సాపతి బాబాను నిత్యము గంధాక్షతలతో, పూలతో పూజించేవారు, ఒక్క మహాల్సాపతియే బాబా మెడకు గంధము పూసి పూజించేవారు. ఇంక ఎవరును సాహసించేవారు కాదు. ఎవరి ఆచార ప్రకారము వారు పూజించినను బాబా కాదనువారు కాదు. ఇప్పుడు కూడ భక్తులు వారి వారి ఆచారము ప్రకారము పూజించుట జరుగుచున్నది. అన్నియు తానై యున్న స్వామిని సద్గురుని సాయిగానే దర్శించి షోడశోపచారపూజ ద్వారా ఏకాగ్రత పొంది, మానసిక పూజసల్పి, మనస్సున నిల్పుకొని నిరంతర సాధనతో ఆ పరబ్రహ్మలో ఐక్య మగుటకు ప్రయత్నించుదము.

## సమర్థ సద్గురువు శ్రీ సాయి

ఆత్మ జ్ఞానము పొందుటకు సద్గురు ఆశ్రయము అవసరమని అన్ని మతముల విశ్వాసము. శ్రోత్రియుడు, బ్రహ్మ నిష్ఠ గలిగి తన శిష్యునికి బ్రహ్మమును చూపి, సద్గతి కలిగించ గలవాడే సద్గురువు. ఈ కలియుగములో అట్టి సద్గురు ఆశ్రయము దొరకుట బహు దుర్లభము. సచ్ఛిష్యుడు సద్గురువు కొఱకు పరితపించి ఎట్లు వెదకునో సద్గురువు కూడ సచ్ఛిష్యుని కొఱకు అట్లే పరితపించును. సాయి తత్త్వములో సాయినాథుని ఆశ్రయించిన భక్తులు గురువు కొఱకు పరితపించవలసిన పని లేదు. సాయినాథుడు మన విశ్వాసమును బట్టి గత జన్మల మన సంస్కారమును బట్టి యిప్పుడు కూడ

సాయియే సద్గురు ఆశ్రయమిచ్చుచున్నారు. ఇతర గురువుల ఆశ్రయము పొందుటకైనను వారే దారి చూపుచున్నారు. కామధేనువు కోరినది మాత్రమే యిచ్చును. కాని సద్గురువు కోరకపోయినను అచింత్యము, అనుపలభ్యము అయిన ఆత్మ సాక్షాత్కారమును ప్రసాదించును.

"ప్రపంచములో 56 మంది సిద్ధపురుషులుంటారనీ, అందులో 5 గురు సద్గురువులు అగ్రస్థానములో నుంటారనీ, వీరిలో కూడ సాయి, సమ్రాట్ వంటి వారని" మెహర్ బాబా అన్నారు. మానవ జన్మ సాఫల్యమునకు ఆత్మ జ్ఞానము పొందుటయే శరణ్యము.

## బ్రహ్మ జ్ఞానమునకు అర్హత

ఒక ధనికుడు బాబా వద్దకు వచ్చి, బ్రహ్మ జ్ఞానము ప్రసాదించుమని కోరినప్పుడు వారికి ఈ క్రింది విధముగా బాబా చెప్పారు. దానిని క్లుప్తముగా తెలుసుకొందము. "బ్రహ్మమును చూచుటకు 5 వస్తువులు సమర్పించవలెను. 1 పంచ ప్రాణములు 2 పంచేంద్రియములు 3 మనస్సు 4 బుద్ధి 5 అహంకారము. ఎల్లప్పుడు సత్యము పలుకుచు, తపస్సు చేయుచు, లోన జూచుచు, బ్రహ్మచర్యమును ఆచరించిన గాని ఆత్మ సాక్షాత్కారము లభింపదు. అహంకారము పోనిదే - లోభము నశించనిదే - మనస్సు కోరికలు విడువనిదే ఆత్మ సాక్షాత్కారమునకు అవకాశము లేదు. శరీరాభిమానమును విడచి ఫలాపేక్ష లేకుండ సత్కర్మలు నిర్వహించవలెను. ఆత్మ సాక్షాత్కారమునకు సద్గురు ఆశ్రయము అవసరము. నీవు (ధనికుడు) బ్రహ్మపు నోట్ల కట్టలను చుట్టి పెట్టుము. నీ పేరాశను, లోభమును పూర్తిగా వదలనంత వఱకు నీవు నిజమైన బ్రహ్మమును జూడలేవు. ఎవరి మనస్సు ధనము నందు, సంతానము నందు లగ్నమై యున్నదో వాడా యభిమానమును పోగొట్టుకొననంత వఱకు బ్రహ్మము నెట్లు పొందగలడు ?" అని బాబా ఆ ధనికునకు చెప్పిరి. ఈ విధానమును మనము ఆచరణలో పెట్టుకొన్నప్పుడే సాయి విధానమునకు మనము అర్హులమగుదుము.

## సచ్ఛిష్యుని లక్షణములు

బాబా ఒక మేకను మసీదులో నఱికి బలి వేయుమనగా బడే బాబా నిరాకరించెను. శ్యామా కాలయాపన చేసెను. కాకా దీక్షితు మాత్రము ఆ మేకను చంపుటకు సిద్ధపడెను. కాని బాబా "బ్రాహ్మణుడవై మేకను చంపెదవా?" అని అనగానే దీక్షితు"మీ అమృతము వంటి పలుకులే మాకు చట్టము. మిమ్మే యెల్లప్పుడు జ్ఞాపకముంచుకొని మీ రూపమే ధ్యానింతుము. రాత్రింబవళ్ళు మీ ఆజ్ఞనే పాలింతుము. అది ఉచితమా ? కాదా ? యని తర్కించము. గుర్వాజ్ఞ అక్షరాల పాటించుటే మా విధి. మా ధర్మము" అని అనెను. కాకా సాహెబు దీక్షితు గుర్వాజ్ఞ పాటించుటతో బాబా మనకు గురువు నందుండవలసిన విశ్వాసము చూపినారు. అట్టి విశ్వాసము గలవాడే నిజమైన శిష్యుడు. సద్గతి పొందుటకు అర్హుడు.

ఒకనాడు నానాసాహెబు చాందోర్కర్ బాబా పాదములు వత్తుచు భగవద్గీతలోని

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ।

అను శ్లోకము వల్లించుచుండగా బాబా దాని అర్థము నానాను అడిగెను. అతడు సరిగా చెప్పలేకపోయెను. బాబాకు సంస్కృతము తెలియదనే నానా అవివేకమును తొలగించి బాబా పై శ్లోకమునకు అర్థముగా చెప్పిన దాని సారాంశమిది. "సద్గురువునకు కేవలము సాష్టాంగ నమస్కారము చేసినచో సరిపోదనియు, సర్వస్య శరణాగతి చేయవలెననియు, ఊరక ప్రశ్నించుట చాలదని, మోక్షము పొందుట కొఱకు, ఆధ్యాత్మికాభివృద్ధికి మాత్రమే ప్రశ్నించవలెననియు, ఆ గురువుగారి కొఱకే తన శరీరమున్నదని భావించి వారికి సేవ చేసినప్పుడే సద్గురువు జ్ఞానము బోధించునని" చెప్పిరి.

## గురూపదేశము – బాబా విధానము

రాధాబాయి అనే ముసలమ్మ బాబా నుండి మంత్రోపదేశము పొందవలెనని ఉపవాసము చేయునప్పుడు, ఆమె యుపవాసము మాన్పించుటకు ఆమెతో

బాబా యిట్లనెను. "నాకొక గురువుండెను. నేను వారికి చాలా కాలము శుశ్రూష చేసితిని. కాని వారు నా చెవిలో ఏ మంత్రము నూదలేదు. వారు నా నుండి రెండు పైసలు దక్షిణ నడిగిరి. వెంటనే యిచ్చితిని. వారు కోరిన ఆ రెండు కాసులు 1. ధృఢమైన విశ్వాసము (నిష్ఠ) 2. ఓపిక లేక సహనము (సబూరి), రాత్రింబవళ్ళు నిద్రాహారములు లేక నేను వారి వైపు దృష్టిని నిలిపితిని. వారి ధ్యానము, సేవ తప్ప నాకింకొకటి లేదు. వారు తమ దృష్టిచే నన్ను కాపాడు చుండెడివారు. కావున మంత్రము కాని, యుపదేశము కాని యెవరి యొద్ద నుండి పొందుటకు ప్రయత్నింపకుము. నీ యాలోచనలు, చేష్టలు నా కొఱకే వినియోగించుము. నావైపే సంపూర్ణ హృదయముతో చూడుము. నేను నీ వైపు అటులనే చూచెదను. గురువు నందు నమ్మకము, విశ్వాసము ఉంచి సర్వమునకు కర్తయని నమ్మి గురువే హరి హర బ్రహ్మల యవతారమని ఎవరు తలంచెదరో వారు ధన్యులు" అని చెప్పిరి.

## హేమడ్ పంతు పొందిన గురు బోధ

మన కర్మలను మనమే చేయుటలో గురువు యొక్క ఆవశ్యకత ఏమి? అని తలచిన హేమాడ్ పంతుకు ఒకానొక సందర్భములో బాబా "మార్గ దర్శకుడు తిన్నగ గమ్యస్థానము చేర్చగలడనియు, జీవిత పరమార్థము గురు బోధ వల్లనే లభించుననియు హేమాడ్ పంతుకు గుర్తింపు చేసిరి.

తన జీవిత చరిత్ర వ్రాయుటకు ముందుగా తన అహంకారమును తన పాదములపై పెట్టవలెనని బాబా హేమాడ్ పంతుకు తెలియజెప్పి, తనకు, తన పటమునకు భేదము లేదని అతని యింట జరుగుచున్న విందుకు పటరూపమున వచ్చి తన సర్వ వ్యాపకత్వమును గుర్తింపు జేసిరి. మఱియు శనగల కథలో తాను భుజించు పదార్థము నేదైనను ముందుగా గురువునకు సమర్పింపక శిష్యుడు ఏమియు తినరాదనియు తెలియ జెప్పిరి.

గురూపదేశము పొందుటకు కోరి వచ్చిన రాధాబాయి అను ముసలమ్మకు, సాయి, తాను చేసిన జ్ఞాన బోధను శ్యామా చేత హేమాడ్ పంతుకు తెలియ చెప్పించి, నారాయణుడు - నరునకు బోధించిన విధమును సూచించినారు.

హేమాడ్ పంతు మఱియు శ్యామా ఉభయులు బాబా వద్దకు రాగా, బాబా హేమాడ్ పంతుతో సంభాషించిన విధము ఆనందము కలిగించినది.

బాబా : మీరు ఏమి మాట్లాడిరో చెప్పుము ?

హేమాడ్ పంతు : మీరు బోధించిన ముసలమ్మ కథ మిక్కిలి ఆశ్చర్యమును కలుగ జేసినది. ఆ కథలో మీ లీలలను తెలుసుకొంటిని, మీ ఆశీర్వాదము పొందితిని.

బాబా : ఆ కథ చాలా అద్భుతమైనది.మఱినీవెట్లు ఆనందించితివో వివరముగా చెప్పుము.

హేమాడ్ పంతు : అది నా మనస్సునందు శాశ్వత ప్రభావమును కలిగించినది.

బాబా : ఆ కథ నీకు నచ్చినదా ? దాని ప్రాముఖ్యమును గుర్తించితివా ?

హేమాడ్ పంతు : అవును బాబా ! నా మనశ్చాంచల్యము నిష్క్రమించినది. నాకు నిజమైన శాంతి, విశ్రాంతి కలిగినది. సత్య మార్గమును కనుగొన గలిగితిని.

ఈ సంభాషణము ద్వారా మనము కూడ రాధాబాయి ముసలమ్మ కథను అర్థము చేసికొని హేమాడ్ పంతు పొందిన జ్ఞానమును పొందుదము గాక !

పుస్తక జ్ఞానమెందుకు పనికిరానిది. మనకు విధింపబడిన కర్మను మనము పూర్తిచేసి తనువును - మనమును - పంచ ప్రాణములను గురువు పాదములపై పెట్టి శరణు వేడవలెను. గురువే దైవము. సర్వత్ర వ్యాపించిన వాడు. ఇందుకు ధృడమైన, యంతులేని నమ్మక మవసరమని" ఒక సందర్భములో బాబా చెప్పిరి. ఈ విధముగా మనము సాయిని సద్గురువుగా భావించి పై విధానముగా త్రికరణశుద్ధిగా నమ్మి ఓర్పుతో సాయిని సేవించుదము. గురువు ఎట్టి వాడైనను ఒకసారి ఆశ్రయము పొందిన తరువాత ఆ గురువును విడువ రాదని, వారిని మనఃపూర్వకముగా సేవించవలెనని" మఱియొక సందర్భములో బాబా చెప్పినారు.

బాబా అనేక మందిని తన నామమును జ్ఞప్తి యందుంచుకొనుమని, తన లీలలు శ్రవణ - మననములు చేయుమని, కొందఱిని తనను శరణు వేడుమని చెప్పెడివారు. కొందఱిని తన పాద పూజ చేయుమనియు, కొందఱిని తన సముఖములో కూర్చుండుమనియు, మఱి కొందఱిని దూర ప్రదేశములకు పంపుటయు, ఖండోబా మందిరములో ఉంచుటయు, కొందఱిని ఆధ్యాత్మిక గ్రంథములు చదువుమనుటయు - పారాయణ చేయుమనుటయు చెప్పెడివారు. ఇట్లు వారు స్వయముగానో, కలలలోనో చెప్పియుండిరి. ఇప్పుడు కూడ తన భక్తుల స్వప్నములలో ఇట్టి ఆదేశములిచ్చుట జరుగుచున్నది. ఇతర సాధు సత్పురుషుల ద్వారా, వారి అంకిత భక్తుల ద్వారా కూడ చెప్పించుట జరుగు చున్నది. ఇట్లు చెప్పుట వారి - వారి కర్మ పరిపక్వతను బట్టి యుండును. బాబా విధానము ఈ పద్ధతి అని చెప్పుటకు వీలు లేని ప్రత్యేక విశిష్టమైన పద్ధతి, దాసగణు ఈశావాస్యోపనిషత్తును మరాఠీభాషలోనికి అనువదించుటలో తనకు వచ్చిన సందేహమును తీర్చుకొనుటకు బాబా వద్దకు వచ్చినప్పుడు బాబా, దాసగణుని, విల్లీ పార్లే అను చోటకు పంపి కాకా సాహెబు దీక్షితు పని పిల్ల యొక్క హావ భావ ప్రకటన చూచుట ద్వారా అతడు వ్రాయుచున్న ఈశావాస్యోపనిషత్తులోని వాని సమస్యను పరిష్కరింపచేసిరి. ఇంకొక గురు శిష్యుడైన పంతుతో బాబా యిట్లనిరి. "ఏమైనను కానిండు పట్టు విడువరాదు. నీ గురుని యందే యాశ్రయము నిలుపుము. ఎల్లప్పుడు నిలకడగా నుండుము. ఎప్పుడు వారి ధ్యానము నందే మునిగి యుండుము" అని చెప్పుట, ఒకసారి ఒక గురువును ఆశ్రయించిన ఎట్టి పరిస్థితులలోను ఆ గురువును వదలరాదని చెప్పుటయే.

## గురువు యొక్క ఆవశ్యకత

కాకా సాహెబు దీక్షితు షిరిడీ నుండి వెళ్ళవచ్చునా? అని బాబాను కోరి నపుడు "ఎక్కడికి" అని ఎవరో అడిగిరి. "పైకి" అని బాబా చెప్పి అక్కడికి వెళ్ళుటకు అనేక మార్గములున్నవనియు, మార్గము ప్రమాదకరమైన దనియు, మార్గమధ్యమున అడవిలో పులులు తోడేళ్ళు ఉన్నవనియు కావున మార్గదర్శ కుని వెంట తీసికొని వెళ్ళిన అతడు గోతుల నుండి, పులులు - తోడేళ్ళ నుండి

తప్పించి గమ్యము చేర్చగలడనియు, మానవుడు సద్గతి పొందుటకు మార్గ దర్శకుడైన సద్గురువును ఆశ్రయించాలని చెప్పిరి.

## గురువునకు సమర్పించనిదే ఏమియు తినరాదు

సాయిబాబా జీవిత చరిత్రలో శనగల కథలో హేమాడ్ పంతు "నా దగ్గఱ ఉన్న వారికి పెట్టకుండా నేనెప్పుడేమియు తిని యెఱుగను" అని చెప్పగా బాబా యిట్లనిరి. "అవును, అది నిజమే దగ్గఱ నున్న వారికిచ్చెదవు, కాని నీవు తినుటకు ముందు నన్ను స్మరింతువా ? నేనెల్లప్పుడు నీ చెంత లేనా? నీవేదైనను తినుటకు ముందు నాకర్పించుచున్నావా ?" అని ప్రశ్నించెను. త్రికరణ శుద్ధిగా ఆత్మార్పణతో సద్గురువును ఆశ్రయించు మనము, మన గురువును స్మరించనిదే యే వస్తువును పంచేంద్రియములతోనే కాక మనస్సు - బుద్ధితో కూడ అనుభవించరాదు - సదా మన సద్గురు సాయినాథుని గుర్తు యందుంచుకొని, సర్వము వారి కర్పించిన పిమ్మటనే అనగా భుక్త శేషమునే భుజింపవలెను.

మనము గురువునకు ఏదైనను సమర్పించినప్పుడిక, అది మనది కాదు ఆ గురువు దాని నేమి చేసినను, మన మనోభావములందు దానిని గుఱించి ఎట్టి ఆలోచన ఉండరాదు. హరి సీతారామ్ దీక్షిత్ (కాకా) ఒకప్పుడు ఒక ట్రంకు పెట్టె నిండా డబ్బు తెచ్చి బాబా ముందుంచి "బాబా! యిదంతా మీదే" అని అన్నారు. బాబా ఆ డబ్బాంతా రెండు చేతులతో దీక్షిత్ ఎదుటే అందఱికి పంచినను దీక్షిత్ ఏ భావమును ప్రకటించక "అది తన గురువుదే. అది వారి యిష్టము" అనే నిశ్చల బుద్ధితో సచ్ఛిష్యునిగా నిలిచారు.

## కర్మను అనుభవించవలసినదే - కాని సద్గురు ఆశ్రయము దానిని సుకరము చేయును

డాక్టరు పిళ్ళే నారికురుపు వ్యాధితో బాధపడుచు, ఆ బాధను భరించలేక తాను చేసిన పాపమును పది జన్మలలో అనుభవించునట్లు చేయుమని కాకా సాహెబు దీక్షితు ద్వారా బాబాను కోరినప్పుడు పిళ్ళేను బాబా వద్దకు తీసికొని

రాగా "ఇచట నెమ్మదిగా పరుండి విశ్రాంతి తీసికొమ్ము. అసలైన విరుగుడే మనగా గత జన్మ పాపములనుభవించి విమోచనము పొందవలెను. మన కష్ట సుఖములకు మన కర్మయే కారణము. వచ్చినదాని నోర్చుకొనుము. అల్లాయే ఆర్చి తీర్చువాడు. వాని నెల్లప్పుడు ధ్యానించుము. అతడే నీ క్షేమము చూచును. వారి పాదములకు నీ శరీరమును - మనస్సును - ధనమును - వాక్కును సమర్పింపుము. అనగా సర్వస్య శరణాగతి వేడుము. అటుపై వారేమి చేసెదరో చూడుము" అని బాబా పిళ్ళేకు బోధించిరి. పిళ్ళే యొక్క కర్మను 10 జన్మలలో కాక 10 రోజులలో తొలగించగలనని బాబా చెప్పినారు. దీని అర్థమును మనము గ్రహించి కర్మరాహిత్యమునకు అర్హత పొందవలెను. (బాబా దేహ త్యాగము చేసిన తరువాత మాతాజీ కృష్ణప్రియకు ఇచ్చిన నిదర్శన 6వ అధ్యాయములో చూడవచ్చు.)

ఇప్పుడైనను మనము సత్కర్మలనాచరించుట అవసరము. గత జన్మల ననుసరించి యీ జన్మలో అనుభవించుట జరుగుచున్నది. తెలిసి కూడ ఇప్పుడు సత్కర్మలనాచరించక, దుష్కర్మలనాచరించి మఱు జన్మకు కూడ కష్టములు కొనితెచ్చుకొననేల? మనకు విరోధి యున్నచో ఈ జన్మలోనే అతని వలన మనకు బాధ కలుగును. కాని దుష్కర్మ అనే విరోధి యీ జన్మకే కాదు మఱు జన్మలలో కూడ (బాధా రూపమైన) పాపము అనుభవించు వఱకు వేధించుచునే యుండును. కనీసము ఈ జన్మలోనైనా సత్కర్మలనాచరించి మనలను మనమే రక్షించుకొని మఱు జన్మలోనైనా సుఖ - శాంతులతో జీవించుదము. తెలిసి - తెలిసి నరకమును కొనితెచ్చుకొననేల ?

## బాబా తాను స్వయముగా జరుపుకొనుమన్న ఉత్సవమే "గురు పూర్ణిమ"

1908వ సంవత్సరము గురు పూర్ణిమ రోజున (ఆషాఢ పూర్ణిమయే గురు పూర్ణిమ) "పండరీ వాస్తవ్యుడు కృష్ణజీ నూల్కర్‌ను ధుని వద్ద నున్న స్తంభాన్ని పూజించుకొమ్మని చెప్పు" అని శ్యామాతో బాబా చెప్పారు. బాబా చెప్పినట్లు స్తంభానికి కాక ఆ గురు పూర్ణిమ రోజున బాబాకే క్రొత్త వస్త్రములిచ్చి శ్యామా

తాత్యా, దాదా కేల్కర్ మొదలగువారు బాబాను పూజించుకొనిరి. ఆ రోజు నుండి గురు పూర్ణిమ ఉత్సవము జరుపుకొనుట జరుగుచున్నది. బాబా నోటితో చేసికొనుమని చెప్పిన ఉత్సవమిది యొక్కటే

## ధ్యానావసరము

ధ్యానావసరమును గుఱించి బాబా ఏమి చెప్పిరో తెలిసికొందము "ఆత్మ సాక్షాత్కారమునకు ధ్యానమవసరమని, దాని నలవఱచుకొన్నచో వృత్తు లన్నియు శాంతించునని. కోరికలు విడచి సమస్త జీవరాసుల యందు గల భగవంతుని ధ్యానింపుమని, సదా నా నిరాకారమును ధ్యానించిన అదియే జ్ఞాన స్వరూపము, చైతన్యము, ఆనందము. మీరది చేయలేనిచో మీకు రాత్రిం బవళ్ళు చూచుచున్న యాకారమును ధ్యానింపుడు. మీ రిట్లు చేయగా మీ వృత్తులు కేంద్రీకృతమగును. ధ్యాత-ధ్యానము-ధ్యేయము అను మూడింటికి గల భేదము పోయి, ధ్యానించువాడు చైతన్యములో ఐక్యమై బ్రహ్మముతో నభిన్నుడగును. భగవంతుడు నీ ముందు ప్రత్యక్ష మగునని" చెప్పిరి.

ధ్యానము చేయాలంటే ధ్యాస కావాలి. కోతిలాగ పరుగెత్తు మనస్సును నిలపాలి. మనస్సును, శరీరాన్ని, ఇంద్రియాలను కళ్ళెము వేసి నిలపాలి. ఏకాగ్రత కలుగుటకు చిత్త శుద్ధి అవసరము. సాకార రూపములో ప్రారంభించి, నిరాకార రూపములోనికి ధ్యానమును తీసికొని వెళ్ళవలెను. సాయి నాథుడు తన చూపును తన గురువుపై నిలిపినట్లు మన చూపును మన గురువైన సాయినాథుని సాకార రూపముపై నిలిపి (విగ్రహము లేక పటము) శుద్ధ చైతన్యమును, పరబ్రహ్మమును పొందాలి. సాయినాథుడు కాలుపై కాలు వేసికొని కూర్చున్న విధానములో ఎడమ కాలుపై కుడి కాలు వేసి కుడి పాదము బొటన వ్రేలి రెండు ప్రక్కల తన చేతి వ్రేళ్ళు వచ్చునట్లు తన చేతిని వేసి వారి విశ్వరూపమును ఆ కాలి బొటన వ్రేలి యందు చూపుచున్నారు. మన దృష్టిని ఆ బొటన వ్రేలి యందుంచి ధ్యాన నిమగ్నులమైనచో మన వృత్తు లన్నియు కేంద్రీకృతము కాగలవు. మన జన్మలు తరించుటకు ఈ ధ్యాన యోగము తప్పని సరి. కనుక మనము ఆచరించు సత్కర్మలకు తోడు ఈ ధ్యానయోగమును ఆచరించుటకు కృషి చేయవలెను.

ఈ ధ్యానము కుటుంబ సమస్యలు తీరిన తరువాత - పెద్ద వయస్సు వచ్చిన తరువాత చేయవలెనని భావించుట దీప శిఖ చుట్టు శలభము పరిభ్రమించి నశించునట్లు కాగలదు. వృద్ధాప్యములో రోగములతో - ఆదరించు వారు లేక మనో వ్యాకులతతో నశించుటయే జరుగును కాని, ఫలితముండదు. ధ్యానము చేయుటకు వయస్సుతో పనిలేదు. చిన్న వయస్సు నుండియే ధ్యానమును ప్రారంభించవచ్చును. సాధన వలన పవిత్రత పొందవచ్చును. కనుక సాయీ బంధువులెల్లరు ధ్యానమునకు ప్రాధాన్యత యీయవలెను.

## బాబాచే సద్గతి పొందిన భక్తులు

భక్త మహాల్సాపతి సాయినాథుని పరిపూర్తిగా ఆశ్రయించి సద్గతి పొందారు. మాధవరావు దేశ పాండే (శ్యామా) నిద్రపోవునపుడు అతనియొక్క ప్రతి ఉచ్ఛ్వాస - నిశ్వాసములలో స్పష్టముగా "సాయినాథ్ మహారాజ్ - సాయినాథ్ బాబా" అను శబ్దము వినిపిస్తుంది అని దాదా సాహెబు ఖాపర్డే ది. 8-12-1911 లో తన డైరీలో వ్రాసుకొన్నారు. తాత్యా కోతే పటేలు కోసం తన దేహమునే త్యజించినారు బాబా. నానాసాహెబు చాందోర్కర్‌కు విశ్వరూపమును చూపినారు. బయాజీ బాయి కూడ బాబా అనుగ్రహమునకు పాత్రురాలైనది.

అటులనే మేఘశ్యామునకు బాబా సద్గతి ప్రసాదించిరి. మేఘ శ్యాముడు మరణించగా బాబా కూడ అతని శవముతో వెంబడించి పూలతో ఆ శవమును కప్పి దహన సంస్కారములైన తరువాత సాధారణ మానవుని వలె. సమీప బంధువు వలె దుఃఖించి మసీదుకు తిరిగి వచ్చిరి. తాత్యాసాహెబు నూల్కర్‌కు చివరి దశలో బాబా పాద తీర్థము ఈయబడినది. తాత్యా మరణించుట విని బాబా యిట్లనిరి. "అయ్యో ! తాత్యా మన కంటే ముందుగనే వెళ్ళిపోయెను. అతనికి పునర్జన్మ లేదు" అనిరి. మద్రాసు దేశపు సన్యాసి విజయానంద్, బాలారామ్ మాన్‌కర్‌లకు తమ ఆశీస్సులతో సద్గతి కలిగించినారు. మానవులకే కాదు. క్రూర జంతువైన ఒక పులికి కూడ దాని అంత్య దశయందు వారి వద్దకు తీసికొని రాగా వారి చూపుతోనే దానికి సద్గతి కలిగించిరి.

హేమాడ్ పంతు సాయినాథుని సద్గురువుగా చేసుకొని సాయిబాబా జీవిత చరిత్ర రచన ప్రారంభించిరి. పెషావర్ నుండి వచ్చిన అబ్దుల్ జాన్, బాబా

తన వైపు చూడగానే "ఈయనే నా గురువు" అని అనుకొన్నాడు. నానా వల్లి, (అసలు పేరు శంకర్ నారాయణ్ వైద్య, నానా వల్లి అనే మహాత్ముని సమాధి సేవించుట వలన అతనికి ఆ పేరు వచ్చినది) బాబా రెండవసారి షిరిడీ వచ్చుటకు ముందుగా షిరిడీ వచ్చాడు. బాబాను చూస్తూనే బాబా యొక్క నిజస్థితిని గుర్తించాడు. కాని బాబా అతనిని నోరెత్తవద్దని మందలించారు. ఒకసారి బాబాను తన గద్దెపై నుండి లేపి తాను ఆ గద్దెపై కూర్చుండి మఱుక్షణమే లేచి బాబాకు నమస్కరించి వెళ్ళాడు. ఆ సంబంధము వారిద్దఱికే తెలియాలి. అట్టి నానా వల్లి బాబా నిర్యాణమైన 13వ రోజున దేహత్యాగము చేశాడు.

ఈ విధముగా ఎందఱో బాబా జీవిత చరిత్రలో మనకు కనిపించుదురు. ఇప్పుడు కూడ ఆ విధముగా సద్గతి పొందుచున్నవారిని మనము చూచు చున్నాము. "ఈ భౌతిక దేహానంతరము నేను అప్రమత్తుడనే" అని బాబా అభయ ప్రదానమిచ్చినట్లుగా సాయి గురువుగా మనకాశ్రయమిస్తూయున్నారు. ఇది స్వానుభవములోని విషయము. తన మాట - చేత - చూపుతోనే కాదు, నిరాకారరూపముతో కూడ ఆత్మజ్ఞానమును ప్రసాదించుచున్నారు సాయి. వారి వైఖరి, సంభాషణలు మనము తెలుసుకున్నంత మాత్రముననే అవి గుప్తముగా మనకు సలహా నిచ్చుచున్నవి.

కనుక నిస్సంకోచముగా సద్గురు సాయినాథుని ఆశ్రయించి జన్మ సాఫల్యము పొందుదము.

ఓం శ్రీ సాయి నాథాయ నమః



చేయఁదగని పనులు చేసితి నెన్నియో;
చేయఁదగిన వానిఁ జేయనైతిఁ;
గృపణుఁడైన నాకు నిఁకవేఱు గతిలేదు;
కరుణ బఱపి ప్రోవఁ గదవె; సాయి !

# సాయిబాబా చరిత్రము

## చతుర్థాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త



## బాబా లీలలు - మహిమలు

సాయి నాథుని లీలలు వర్ణింప నెవరి తరము? వారి ప్రతి మాటలోను ఒక లీల ప్రకటితమౌతుంది. మంత్రములతో కూడిన లీలలు కావు సాయిని. మంత్ర తంత్రములన్న వారంగీకరించరు. కుశారావు అనే ఉపాధ్యాయుడు బాబా వద్దకు వచ్చినప్పుడు సాయి, అతనిని ద్వారకామాయిలోనికి రానీయలేదు అతడు క్షుద్ర విద్యలు నేర్చినవాడు. అతని చేతికి ఇనుప - రాగి కడియము లున్నవి. ఆ తంత్ర విద్యను - చేతి కడియములను త్యజించిన తరువాతనే బాబా అతనిని తన వద్దకు రానిచ్చిరి. వారి లీలలు సృష్టి - స్థితి-లయాలకు సంబంధించి పంచ భూతములను శాసించునవి. అట్టి లీలలు భగవంతునికి మాత్రమే ప్రదర్శించు శక్తి యుండునని స్పష్టమగుచున్నది. సాయినాథుడు సంపూర్ణ భగవదవతారము. మానవ రూపమున నున్న సర్వ సర్వంసహా చక్రవర్తి.

బాబా దగ్గరకు ఉద్యోగ మిప్పించుమని, సొమ్ము సహాయము చేయుమని, సంతానము ప్రసాదించుమని, రోగములు నివారణ చేయుమని వచ్చేవారిని భక్తుడొకడు మందలించుచుండగా అతనితో బాబా "అలా చేయవద్దు నా వాళ్ళు మొదట నన్ను చేరేది అందుకే. వారి మనస్సులలోని కోరికలు తీర్చుకొని జీవితములో స్థిరపడతారు. ఆపైన నన్ననుసరించి జీవిత గమ్యము వైపు పురోగమిస్తారు" అని చెప్పారు. మఱి సాయి లీలలు కొన్ని యిప్పుడు తెలుసుకొందము.

## భూమి నుండి నీరు – నిప్పు తెప్పించుట

చాంద్ పాటిలు అను మహమ్మదీయుడు ఔరంగాబాద్ జిల్లా ధూప్ గ్రామమునకు మునసబు. ఇతడు ధనవంతుడు. 1858లో చాంద్ పాటిలుకు ధూప్ గ్రామము (ధూప్ ఖేదా) దగ్గర మామిడి చెట్టు క్రింద ఒక ఔలియాగా బాబా కనుపించారు. అప్పుడే మొదటిసారిగా వారు లీలలు ప్రకటించారు. చాంద్‌పాటీలు తన తప్పిపోయిన గుఱ్ఱమును, రెండుమాసముల నుండి వెతకి-వేసారిన సమయములో బాబా చాంద్ పాటీలును చూచి, ఎంత దూరములో నైనను, ఏమి జరిగినను, తనకు తెలియగలదని నిరూపించుచు కాలువ వద్ద ఉన్న చాంద్ పాటీలు గుఱ్ఱము జాడ ఆ చెట్టు క్రింద కూర్చొనియే చెప్పి యున్నారు. బాబా చెప్పిన జాడనే వెళ్ళి అంతకు ముందు గుఱ్ఱము కొఱకు ఆ ప్రాంతమంతయు వెదికినను కనుపించని గుఱ్ఱము కనుపించుటతో చాంద్ పాటీలు ఆశ్చర్యపడి గుఱ్ఱముతో సాయి వద్దకు వచ్చినాడు. చాంద్ పాటీలు చూచుచుండగనే ఆ ఫకీరు (అప్పటికి సాయిబాబా అనే పేరు లేదు) ఇనుప చువ్వను(పటకా) భూమిలో గ్రుచ్చగా నిప్పు, నేలపై మోదగా నీరు వచ్చెను. చప్పిని (చిలుము పీల్చు గుడ్డను) ఆ నీటితో తడిపి, నిప్పుతో చిలుము వెలిగించి, తాను ముందుగా పీల్చి చాంద్ పాటీలుకు అందించెను. ఎంతో దూరములో నున్న గుఱ్ఱపు జాడ తెలుపుట. పటకాతో నేలపై కొట్టి నిప్పు - నీరు తెప్పించి పంచ భూతములను శాసించుట సామాన్యులకు సాధ్యమా ? అప్పుడే వారు గొప్ప 'ఔలియాగా గుర్తించబడిరి.

## నీటితో దీపములు వెలిగించుట

సాయిబాబాకు దీపములన్న చాలా ఇష్టము. మసీదులో దీపములు వెలిగిస్తూ యుండేవారు. ఊరిలో నున్న షాహుకార్లను నూనె అడిగి తెచ్చి మసీదునందు రాత్రులలో దీపములు పెట్టేవారు బాబా. గుడ్డ పీలికలతో స్వయముగా వత్తులు తయారుచేసి దీపాలు వెలిగించేవారు. కొంత కాలము తరువాత వ్యాపారస్థులందఱునూనె బాబాకు ఈయకూడదని నిర్ణయించి,నూనె లేదని చెప్పినారు. అప్పుడు బాబా వట్టి వత్తులను ప్రమిదలలో పెట్టి రెండు - మూడు నూనె చుక్కలున్న తంబిరేకుల డొక్కులో నీళ్ళు పోసి దానిని బాబా

త్రాగి, దానినే తిరిగి డొక్కులోనికి నుమ్మి, ఆ నీటిని ప్రమిదలలో నింపి దీపములు వెలిగించిరి. అవి తెల్లవారు వఱకు వెలిగినవి. ఇదంతయు గమనించుచున్న షాహుకార్లు పశ్చాత్తాపపడి తమ తప్పును మన్నించుమని బాబాను వేడుకొని నూనెను ఇచ్చుటను ప్రారంభించిరి. ఇదే భక్తులకు బాబా చూపిన మొదటి లీల.

## గంగా – యమునలను కాలి బొటన వ్రేళ్ళ నుండి ప్రవహింపజేయుట

దాసగణు ప్రయాగలో అనగా గంగా-యమునలు కలియుచోట స్నానము చేయవలెనని తలచెను. బాబా వద్దకు వచ్చి ప్రయాగ వెళ్ళుటకు అనుమతి కోరగా "అంత దూరము పోవలసిన అవసరము లేదు. మన ప్రయాగ యిచటనే కలదు. నా మాటలు విశ్వసింపుము" అని బాబా చెప్పిరి. దాసగణు బాబా పాదములపై శిరస్సు ఉంచి నమస్కారము చేయగా, బాబా రెండు పాదముల బొటన వ్రేళ్ళ నుండి గంగా యమునా జలములను కాలువలుగా ప్రవహింపజేసిరి. ఇది చూచి దాసగణు ఆశ్చర్యపడెను. భక్తి ప్రేమలతో మైమఱచి కంట తడి పెట్టెను. అంతరిక ప్రేమతో బాబాను - వారి లీలలను గేయ రూపమున రచించి పాడెను. అప్పుడే కాదు; ఇప్పుడు కూడ తన అంకిత భక్తులకు అట్టి అనుభూతులు ప్రసాదిస్తూనే ఉన్నారు. మాతృశ్రీ పూలమ్మగారు (చుండూరు కామేశ్వరమ్మ) తీర్థయాత్రలకు వెళ్ళలేక పోయినానే అని బాధపడు చున్నప్పుడు సాయి తన పటములోని కాలి బొటన వ్రేళ్ళ నుండి నీటిని ప్రవహింపజేసి ఆ జలముతో స్నానము చేయించారు. గుంటూరు జిల్లాలోని పొన్నూరులో ఈ అద్భుత లీలను దర్శించిన ప్రత్యక్ష భక్తుల నడిగి ఎవరైనా వారి సందేహమును నివృత్తి చేసుకొనవచ్చును. సాక్షాత్ భగవద్రూపుడైన సద్గురు పాదాలలో సర్వ పుణ్య తీర్థాలుండును. అట్టి సద్గురువే శ్రీ సాయిబాబా.

## విచిత్రశయ్య – నాలుగు మూరల పొడవు – జానెడు వెడల్పు గల కఱ్ఱ బల్లపై పరుండుట

నానా సాహెబు డేంగలే బాబా నిద్రించుటకు నాలుగు మూరల పొడవు, జానెడు మాత్రమే వెడల్పు గల కఱ్ఱ బల్లను తెచ్చెను. దానిని పాత చినిగిన

గుడ్డ పీలికలతో మసీదు వెన్నుపట్టెకు ఉయ్యాల వలె వ్రేలాడునటుల కట్టి బాబా దానిపై పరుండుట మొదలు పెట్టిరి. గుడ్డ పీలికలు పలుచనివి బలము లేనట్టివి బల్ల నెట్లు మోయగలిగెను ? ఈ బల్ల యొక్క నాలుగు మూలలందు నాలుగు దీపపు ప్రమిదలుంచి రాత్రుల యందు దీపములు వెలిగించుచుండిరి. బాబా అంత యెత్తున నున్న ఆ బల్లపైకి ఏ విధముగా ఎక్కునది, దిగునది ఎవ్వరికిని బాబా తెలియనీయలేదు. అజానుబాహుడైన బాబా ఆ బల్లను కూడ మోయలేని ఆ చింకి గుడ్డలు కట్టిన బల్లపై ఆ కొద్ది జాగాలో ఎలా పరుండిరో? ఆ బల్ల ఎట్లా మోయగలిగినదో? ఎవరికి అంతుపట్టలేదు. జనులు గుంపులు గుంపులుగా ఆ బల్లను చూచుటకు వచ్చుచుండుటచే ఆ బల్లను బాబా విఱచి పారవైచెను. మఱి ఆ బల్లపై బాబా ఎట్లు పరుండిరి ? అది ఎవరికి సాధ్యము ?

## పంచభూతములను బాబా శాసించుట

ఒకనాడు సాయంకాలము షిరిడీలో గొప్ప తుఫాను సంభవించి తీవ్రమైన గాలి, మెఱుపులతో కుంభ వృష్టి కురిసినది. ప్రజలు భయభ్రాంతులై తల దాచుకొనుటకు మసీదుకు వచ్చి తుఫాను ఆపివేయుమని బాబాను ప్రార్థించిరి. బాబా మసీదు బయటకు వచ్చి అంచున నిలబడి బిగ్గరగా గర్జించుచు "ఆగు - ఆగు - నీ కోపము తగ్గించు, నెమ్మదించు" అని అనిరి. కొన్ని నిముషములలో వర్షము తగ్గి గాలి వీచుట మానెను. తుఫాను ఆగిపోయెను. ప్రజలు వారి వారి గృహములకు వెళ్ళిరి. అప్పుడే కాదు - ఇప్పుడు కూడ సాయి కార్య క్రమములు, సంతర్పణలు మొదలగునవి జరుగునపుడు వర్షములు వచ్చినచో సాయిని ప్రార్థించిన వెంటనే ఆగిపోవుచున్న ప్రత్యక్ష నిదర్శనములను చూచుచున్నాము,

ఇంకొకసారి మసీదులోని 'ధునిలో' మంటలు లేచి వెన్నుపట్టెల పఱకు పోవుచుండెను. మసీదులో నున్న వారికి ఏమి చేయుటకు తోచలేదు. బాబా దీనిని గ్రహించి తన సటకాను దగ్గఱ నున్న స్తంభముపై కొట్టుచు "దిగు, దిగు, శాంతించుము" అని అనిరి. ఒక్కొక్క దెబ్బకు మంటలు తగ్గుచు కొన్ని నిముషములలోనే "ధుని" మామూలుగా నుండెను.

ఒకరోజు బాబా తన ప్రక్కనున్న నీటి కుండను సటకాతో తట్టుచున్నారు. దానికి కారణమేమని అడుగగా "నాగపూర్‌లోని తాజుద్దీన్ బాబా కుటీరము దగ్ధమగుచుండగా ఆర్పుచున్నాను" అని అన్నారు. తరువాత అది వాస్తవమని తెలిసినది.

## బల్లుల యొక్క భాష బాబాకు తెలియుట - రెండు బల్లులు కలియుట

బాబాకు తెలియని భాష లేదు మానవ భాషయే కాదు. పశు పక్ష్యాదులతో సహా సర్వ జీవ కోటి మాట్లాడు భాషలు బాబాకు తెలియును. ఒక భక్తుడు బాబా ముందు కూర్చొని యుండెను. ఒక బల్లి టిక్కు టిక్కు మని పలికెను. ఆ భక్తుడు "బల్లి పలికిన దానికి అర్థమేమని" బాబాను అడిగెను. చెల్లెలు ఔరంగాబాదు నుండి తనను చూచుటకు వచ్చునని యాబల్లి యానందించుచున్నదని బాబా పలుకగా, ఆ భక్తుడు నిర్ఘాంతపోయెను. అప్పుడే ఔరంగాబాధు నుండి యెవరో గుఱ్ఱముపై సాయిబాబా దర్శనమునకై షిరిడీ వచ్చిరి. గుఱ్ఱమునకు ఉలవలు తీసికొని వచ్చుటకు తన భుజముపైనున్న సంచిని తీసి దానిలో నున్న ధూళిని విదిలించెను. అందులో నుండి యొక బల్లి క్రిందపడి అందఱు చూచుచుండగనే గోడ నెక్కెను. వెంటనే ఆ బల్లి అచటనే యున్న తన అక్క యైన బల్లి వద్దకు పోయినది. అక్క చెల్లెండ్రు కలుసుకొని ఒకరి నొకరు కౌగిలించుకొని, ముద్దిడుకొని, గుండ్రముగా తిరుగుచు నధిక ప్రేమతో ఆడినవి. గుఱ్ఱపు రౌతు ఔరంగాబాదు నుండి వచ్చుట, రెండు బల్లులు కలియుట, బాబా ముందుగనే చెప్ప గలుగుట వారి సర్వజ్ఞతను మఱియు సర్వ భాషా జ్ఞానమును తెలుపుచున్నది.

## బాబా వాక్కు జవదాటరానిది

మేఘశ్యాముడు ఒక మకర సంక్రాంతినాడు బాబాకు చందనము పూసి గంగాజలముతో అభిషేకము చేయవలెనని తలచెను. దానికి బాబా సమ్మతించి అతనితో ఇట్లనెను. "ఓ మేఘా ! శరీరమునకు శిరస్సు ముఖ్యము. కనుక తలపైననే నీరు పోయుము. అని చెప్పి తల ముందుకు సాచి కూర్చుండెను.

గోమతి తీర్థము నుండి కుండతో తెచ్చిన నీటిని భక్తి పారవశ్యముతో "హర గంగే । హర గంగే" యనుచు తలపైన, శరీరము పైన ఒకేసారి యంతట పోసెను. కాని బాబాను చూచి ఆశ్చర్యపడెను. బాబా కోరిక మేరకు తల మాత్రమే తడిసి శరీరము పొడిగా నున్నది.

## కొలిమిలో పడిన బిడ్డను రక్షించుట

1886 నుండి బాబా లీలలు ఎక్కువగా జరిగినవి. 1910లో దీపావళి నాడు బాబా ద్వారకామాయి ధుని ముందు కూర్చుండి ధునిలో కట్టెలు వేయుచుండెను. ధుని బాగా మండుచుండెను. కొంత సేపైన తరువాత కట్టెలు వేయుట మాని బాబా తన చేతిని మండుచున్న ధునిలో పెట్టిరి. వెంటనే చేయి కాలిపోయెను. మాధవుడను నౌకరు, మాధవరావు దేశ పాండె దీనిని చూచి బాబాను వెనుకకు లాగి "బాబా! ఇట్లేల చేసితిరి" అని అనిరి దూర దేశమున ఒక కమ్మరి భార్య కొలిమి తిత్తులను ఊదుచుండెను. ఇంతలో ఆమె భర్త పిలిచెను. తన యొడిలో బిడ్డ యున్న సంగతి మఱచి ఆమె తొందరగా లేచి పరుగిడజొచ్చెను. ఆ బిడ్డ మండుచున్న కొలిమిలో పడెను. అందుచేత వెంటనే నా చేతిని ధునిలోనికి దూర్చి బిడ్డను రక్షించితిని నా చెయ్యి కాలుట నా కంత బాధాకరము కాదు. కాని బిడ్డ రక్షింపబడెనను విషయము నాకానందము కలుగజేయుచున్నదని" బాబానుడివిరి. ఆ విధముగా ధునిలో చేయి పెట్టుట, తన భక్తుడైన ఆ చంటి బిడ్డ యొక్క కర్మ సంక్షయము చేయుటకు సాయి నాథుడు 'ధుని'లో చేయి పెట్టి తాను ఆ కర్మ ననుభవించుసట్లు చూపుటయేగా!

ఒకసారి శ్రీమతి ప్రధాన్ అను భక్తురాలు తన చంటి బిడ్డను ఇంట్లోనే విడచి సాయి దగ్గఱకు వచ్చి బాబాకు పాద పూజ చేయుచుండగా మధ్యలోనే సాయి ఆ భక్తురాలితో "నీవు ఇంటికి వెళ్ళిరా" అని అన్నారు. ఆమె ఇంటికి వెళ్ళుసరికి ఆ పసిబిడ్డ గుక్కపెట్టి ఏడ్చుచున్నది. ఆ బిడ్డకు పాలు పట్టి మఱల సాయి వద్దకు వచ్చి పాద పూజ పూర్తిచేసినది. బాబా తన బిడ్డలను రక్షించు విధానమిట్టిది.

ఒకరోజు నీమ్‌గాంలో త్రయంబకం డేంగలే పొలం పని చేస్తున్నాడు. ఒక కూలి మనిషి తన బిడ్డను ఒక చెట్టు క్రింద నిద్రపుచ్చి అతని పొలములో

పని చేస్తున్నది. అకస్మాత్తుగా వచ్చిన వర్షమునకు డేంగలేతో సహా (బిడ్డను చెట్టు క్రింద నిద్రపుచ్చిన) ఆ కూలి మనిషి యా తొందరలో తన బిడ్డను మఱచి యితర కూలీలతో పాటు ప్రక్కన నున్న పాకలో తలదాచుకున్నది. పసి బిడ్డను చెట్టు క్రింద నిద్రపుచ్చిన కూలి మనిషికి తన బిడ్డ గుర్తుకు రాగానే చెట్టు వద్దకు పరుగిడినది. ఆమె చెట్టు వద్దకు వెళ్ళుసరికి బిడ్డ పక్కన బాబా కాపలా కాయుచున్నారు. బిడ్డ సంగతి మఱచినందుకు ఆమెను బాబా మందలించారు. ఆమె బిడ్డను ఎత్తుకొనేలోగానే బాబా అదృశ్యమైనారు.

పై సంఘటనల వలన బాబాకు ఎచట ఏమి జరుగుచున్నది తెలియునని, తల్లి తన బిడ్డను మఱచినను, సాయి తన బిడ్డలను ఎప్పుడు మఱువరని, తన నాశ్రయించిన భక్తుల మంచి చెడులు, బాగోగులకు బాబాయే భారము వహిస్తారని ఋజువగుచున్నది. "నీవే తప్ప యితః పరంబెఱుగ" అని సాయినాథుని సర్వస్య శరణాగతి పొందుటే మన పని. అప్పుడే కాదు. ఇప్పుడు కూడ లక్షల, కోట్ల సంఖ్యలో ఉన్న తన భక్తులను ప్రతి నిత్యము ఎన్నో ఆపదల నుండి, ప్రమాదముల నుండి సాయి రక్షించుట ప్రత్యక్ష నిదర్శనము. మనము అట్టి అనుభూతిని ఏదో ఒక సందర్భములో పొందుట జరుగుచునే యున్నది.

## సుఖ ప్రసవము జరిపించుట

నానా సాహెబు చాందోర్కర్ 1906లో జామ్నేరులో మమలతదారుగా ఉన్నప్పుడు అతని కుమార్తె "మైనతాయి" గర్భిణి. రెండు మూడు దినముల నుండి ప్రసవ వేదన పడుచున్నది. ఎన్ని ఔషధములు వాడినను ప్రయోజనము లేకపోగా అప్పుడు బాబాను ప్రార్థించిరి. బాబా సర్వజ్ఞుడు కనుక "రాంగిర్ బువా" చేత 'విభూతి', 'ఆరతి సాయిబాబా' అనెడి హారతి పాట శ్యామాచే వ్రాయించి యిచ్చి పంపిరి. (ఈ రాంగిర్ బువాను బాబా "బాపుగిర్ బువా" అను వారు) రాంగిర్ బువా, జలగాం వఱకు రైలులో పోయెను. అచట నుంచి జామ్నేరు పోవుటకు అతని దగ్గర డబ్బులు లేవు. అతను రైలు దిగి బయట నిలబడి యుండగా "బాపుగిర్‌బువా ఎవరని" కేక వినిపించెను. రాంగిర్‌బువా అటు వెళ్ళి నేనేననెను. నానా సాహెబు చాందోర్కర్ పంపించిరని ఆ కేక వేసిన బంట్రోతు చెప్పి, తన టాంగాలో రాంగిర్‌బువాను

జామ్నేరు చేర్చిరి. రాంగిర్ బువా, బాబా తనతో పంపిన ఊది, ఆరతి పాట నానా సాహెబుగారికి యిచ్చిరి. ఆ ఊది తీర్థము మైనతాయికి ఈయగనే ఆమెకు సుఖ ప్రసవమైనది. నానా సాహెబుతో బండి పంపిన విషయము చెప్పగా తాను బండి పంపలేదని చెప్పి యిద్దఱు బయటకు వచ్చి చూడగా బండి గాని, బంట్రోతుగాని లేరు రాంగిర్ బువాను జలగాం స్టేషను నుండి జామ్నేరు వఱకు ఎవరు తీసికొని వచ్చినట్లు ? సాయి లీల ఏమని చెప్పగలము ? శ్రీ సాయినాథుడు తానే బంట్రోతుగా, బండిగా, బండిని లాగు గుఱ్ఱముగా ఈ మూడును తానైన సాయి లీల చెప్పనెవరి తరము ? పేరుకు ఊదియే కాని బాబా వాక్కే రక్ష. ఇప్పుడు కూడ సాయి భక్తులు సుఖ ప్రసవమునకు ఊది వాడుట జరుగుచున్నది కదా !

అన్నియు మనమే చేసుకోగలమను దేహాభిమానముతో మన ప్రయత్నము లన్నియు చేసి, అప్పటికి సాధ్యము కాకపోతే భగవంతుని తలుస్తాము. నానా సాహెబు చాందోర్కర్ తన చేసిన ప్రయత్నములన్నియు ఉపయోగపడక వైద్యులు కూడ సుఖ ప్రసవము అగుట కష్టమని చెప్పినప్పుడు మాత్రమే నానాకు బాబా గుర్తుకు వచ్చారు. ఊదితో ఆపత్తు నుండి రక్షణ పొందగలమనే విశ్వాసము కలుగగనే ఊది కొఱకు తన యింటిలో వెదుకగా ఆ ఊది అయి పోవుట గమనించిరి నానా. అట్టి విశ్వాసము నానాకు రాగానే షిరిడీలో మైనతాయి రక్షణకు ప్రారంభించి తనంతట తానే ఊదిని పంపారు సాయి. సాయి యందు మన విశ్వాసమే మనలను రక్షించుట యథార్థము.

## బాబా వాక్కు నిరాకరించిన - ఆమోదించిన ఫలితము

తాత్యా కోతే పాటీలును కోపరగాం సంతకు వెళ్ళవద్దని బాబా చెప్పిరి. తాత్యా దీనిని లెక్కచేయక టాంగాలో వెళ్ళుచుండగా సావుల్ బావి దాటిన వెంటనే గుఱ్ఱము కాలు బెణికి కూలబడినది. అటులనే యింకొకప్పుడు కొల్హారు గ్రామము పోవునప్పుడు కూడ బాబా యాజ్ఞను వ్యతిరేకించి టాంగాలో పోయి ప్రమాదము పొందెను. ఐరోపా దేశపు పెద్ద మనిషి ఒకరు బొంబాయి నుండి షిరిడీ వచ్చిరి. మఱల షిరిడీ నుండి వెళ్ళుటకు బాబా వద్ద నుండి సెలవు

పొందుటకు అడిగినప్పుడు "తొందరపడకు, మరుసటిరోజు బయలుదేరుదువు" అని బాబా చెప్పినను వినక బయలుదేరి వెళ్ళుచుండగా గుఱ్ఱము బెదరి పరుగెత్తుటలో బండి తలక్రిందులై ఆ పెద్ద మనిషి గాయపడి కోపర్గామ్ ఆసుపత్రిలో చేరిరి. ఇట్టివి ఎన్నో సంఘటనలున్నవి.

కాకా మహాజని బొంబాయి నుండి షిరిడీకి బాబా దర్శనమునకు వచ్చిరి. బాబాను దర్శించగనే "ఎప్పుడు వెళ్ళుదువు, రేపు పొమ్ము" అని బాబా అనిరి. అతనికి ఉండవలెనని యున్నను బాబా ఆజ్ఞ ధిక్కరించరాదు. గాన అతడు మరుసటి రోజు బొంబాయి చేరెను. అచ్చట అతని యజమాని అతని కొఱకు ఎదురు చూచుచుండెను, అట్టి అనుభవమే భాఊ సాహెబు ధూమల్ అను ప్లీడరుకు కూడ కలిగినది. ఇప్పుడు కూడ ఎందఱో సాయి భక్తులు బాబా ఆజ్ఞ లేనిదే ఏ పని చేపట్టరు. వారి ధ్యానములో బాబా ఆజ్ఞ పొందుట కాని, సాయి అంకిత భక్తులను అడిగి అది సాయియే చెప్పినాడను విశ్వాసముతో కాని, పూర్తి నమ్మిక గల సాయి భక్తులు బాబా పటము ముందు చీట్లు పెట్టుట ద్వారా కాని, నిర్ణయించుకొని నడచుకొనుట జరుగుచున్నది. పాఖడే అను భక్తునికి బాబా కలలో కన్పించి చెప్పినట్లు అతడు పట్టు ధోవతి తెచ్చెను. దానిని మాధవరావు దేశ పాండే (శ్యామా)కు ఈయుమని కాకా సాహెబును కోరెను. కాని బాబా తనను తీసికొనుమని సలహా ఈయలేదు కనుక శ్యామా తీసుకొనననిి నిరాకరించెను. అప్పుడు కాకా సాహెబు దీక్షితు చెప్పిన ప్రకారము బాబా వద్ద చీట్లు వేసి తీసుకొనుటకు శ్యామా సమ్మతించెను. "పుచ్చుకొనుము", "నిరాకరించుము" అను రెండు చీట్లు వ్రాసి బాబా పాదుకల వద్ద పెట్టిరి. అందులో నుండి ఒక బాలునిచే ఒక చీటి తీయించిరి. ఆ చీటిలో "పుచ్చుకొనుము" అని యున్నది. అప్పుడు శ్యామా అది బాబా ఆదేశముగా ధోవతి తీసికొనుటకు ఆమోదించెను. ఎవరి విశ్వాసము వారిది. ఏమైనా సాయి భక్తులమైన మనము పూర్తి విశ్వాసము సాయి యందు కలిగియుండి, సర్వము ఆ తండ్రిపై భారము వేసిన మనకు వచ్చు ఆలోచనలు సాయి ఆదేశములే యని గ్రహించవలెను.

## పుత్ర సంతతి కలిగించుట

సపత్నేకరు తన కుమారుడు చనిపోగా మనస్శిమితము లేక అతడు బాబాను ఆశ్రయింపగా, మొదట బాబా అతనిని ఆమోదించటపోయినను చివరకు

బాబా ఆశీర్వదించి ఒక టెంకాయ యిచ్చి అతని భార్య కొంగుకు కట్టుమని చెప్పిరి. వారికి ఒక సంవత్సరములో కొడుకు పుట్టెను.

నాందేడు నివాసి రతన్‌జీ షాపుర్జీ వాడియాకు చాలా కాలము వఱకు సంతతిలేదు. అతని జాతకములో సంతతి లేదని జ్యోతిషులు చెప్పిరి. బాబాను ఆశ్రయించగనే "చీకాకు పడకు", నీ కీడు రోజులు ముగిసినవి. అల్లా నీ మనస్సులోని కోర్కెను నెరవేర్చునని" చెప్పిరి. రెండవ భార్యకు పుత్ర సంతతి కలుగునని దీవించిరి. వారికి పుత్ర సంతానము కలిగినది. 12 మంది సంతానములో 4గురు బ్రతికిరి.

భక్త మహాల్సాపతికి 4గురు కుమార్తెలు, ఒక కుమారుడు కలుగగా ఆ కుమారుడు కొంత కాలమునకు చనిపోయెను. అతడు రాత్రులందు బాబాతో మసీదులో పడుకొనుచుండెను. మహాల్సాపతిని ఇంటి వద్ద పడుకొనుమనియు, కుమారుడు జన్మించుననియు బాబా చెప్పినను అతడు వినకపోగా బాబా అతనిని 1896 కృష్ణాష్టమిరోజున కాశీరాం షింపెతో బలవంతముగా ఇంటికి పంపిరి. 1897 కృష్ణాష్టమి నాటికి అతనికి ఒక కుమారుడు కలిగెను. అతడే మార్తాండ్ మహాల్సాపతి, మహాల్సాపతి కోరకపోయినను ఒక కుమారుని ప్రసాదించి తన భక్తుని అవసరమేమో బాబా తానే స్వయముగా చూచుకొందురనెడి నిదర్శనము బాబా మనకు ఇచ్చిరి. ఇంక మనము సంశయాత్ములము కారాదు.

హరి వినాయక్ సాతె మొదటి భార్య చనిపోయినది. రెండవ వివాహము చేసికొనినచో నీకు పుత్ర సంతానము కలుగునని బాబా సాతెను ఆశీర్వదించిరి. రెండవ వివాహము చేసుకొనగా ఆమెకు ఇద్దఱు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగిరి.

అహమదు నగరు వాస్తవ్యుడైన దాము అన్నా (దామోదర్ సావల్‌రామ్ రాసనె) కు ముగ్గురు భార్యలున్నను అతనికి సంతానము లేదు. జాతకములో దుష్ట గ్రహముల వలన సంతానము లేదని తెలిసినది, కాని యతనికి బాబా యందు పూర్తి నమ్మకమున్నది. ఒకసారి అతడు బాబా వద్దకు రాగా వానికి నాలుగు మామిడి పండ్లిచ్చి (ఆమ్రమలీలు) "నీవు తినవద్దు. నీ చిన్న భార్యకు

ఇమ్ము. ఈ పండ్లు ఆమెకు నలుగురు కుమారులను, నలుగురు కుమార్తెలను ప్రసాదించును" అని బాబా చెప్పిరి. బాబా వాక్కును జ్యోతిషుని మాటలేమి చేయగలవు ? బాబా మాటలు నిజమై దాముకు సంతతి కలిగినది. ఇటులనే వానిని ప్రత్తి, ధాన్యము, జట్టి వ్యాపారములు చేయవద్దని బాబా చెప్పి నష్ట పడకుండా కాపాడిరి.

కోపర్‌గాంలో పోలీసు సర్కిలు ఇన్‌స్పెక్టరుగా పనిచేసిన గోపాలరావు గుందుకు ముగ్గురు భార్యలున్నను సంతతి లేదు. బాబాను ఆశ్రయించగా, బాబా ఆశీర్వాదముతో అతనికి ఒక కొడుకు పుట్టెను.

సకోరి నివాసి యైన హంసరాజును ఒక భూతమావేశించి సంతానము లేకుండా చేస్తున్నదని, సాయిబాబాను ఆశ్రయిస్తే భూతాన్ని తఱిమివేయుదురని శ్రీ నరసింగ్ మహారాజ్ హంసరాజ్‌తో చెప్పారు. హంసరాజు బాబాను దర్శించినపుడు అతడు చెప్పకముందే బాబా హంసరాజు చెంపపై రెండు దెబ్బలు కొట్టి "దుష్ట గ్రహమా ! బయటకు పో"అని గర్జించారు. ఆ దుష్ట గ్రహము వెంటనే తొలగిపోయినది. హంసరాజుకు సంతానము కలిగినది.

షోలాపూర్ నివాసి ఔరంగాబాద్‌కర్ అను వాని భార్యకు 27 సంవత్సరములయినను సంతానము కలుగలేదు. బాబా ఆశీర్వాదముతో ఒక కొడుకు కలిగినాడు. 5వ మాసములో ఆ బిడ్డను తల్లిదండ్రులు మసీదుకు తీసికొని వచ్చి బాబా పాదముల చెంత నుంచి ప్రణమిల్లిరి. ఔరంగాబాద్‌కర్ ఇచ్చిన రూ. 500/-లతో శ్యామకర్ణ అను గుఱ్ఱమునకు బాబా శాల కట్టించిరి. నీమ్‌గామ్ నివాసి నానా సాహెబుకు బాబా అనుగ్రహముతో పుత్ర సంతతి కలిగెను. బల్వంత్‌నాచ్నేకు సాయి పుత్ర సంతతి ప్రసాదించిరి. అతని కొడుకే కాలూరామ్.

అప్పుడే కాదు; ఇప్పుడు కూడ సాయినాథుని ఆశీస్సులతో సంతానము పడయుచున్నవారు లెక్కకు మిక్కిలిగా నున్నారు. సాయి యందు విశ్వాసముంచి సాయి సత్యవ్రతములు, సాయి చరిత్ర పారాయణలు నియమముగా చేసి యిప్పుడును సంతతి పొందుట మనందఱికి తెలిసిన విషయమే.

## చనిపోయిన వారికి ప్రాణ దానము చేయుట

క్షయ రోగియైన మాలన్ భాయిని బాబా ఆశీర్వదించి కేవలము పట్టి నీరు మాత్రమే త్రాగుమని, దుప్పటి మీద మాత్రమే పడుకొనుమని చెప్పినారు. కాని వారము రోజులలోనే ఆమె మరణించినది. ఆమె మరణించిన రోజున ఉదయము గం. 8-00 అయినను బాబా చావడిలోనే ఉన్నారు. ఆమె దహన క్రియలకు ఏర్పాటు జరుగుచుండగా ఆమెకు తిరిగి ప్రాణము వచ్చినది "నన్నెవరో నల్లని మనిషి మోసుకొని పోవుచుండగా నా కేక విని సాయి నన్ను వాని నుండి విడిపించి చావడిలోనికి దించారు" అని ఆమె చెప్పు చుండగా సాయి ఆవేశముతో నేలపై సటకాతో కొట్టుచు ఆమె చెంతకు వచ్చిరి.

## గత జన్మల స్మృతులు గుర్తు చేయుట

శ్రీ నానాసాహెబు చాందోర్కర్ తాను ఉన్నతోద్యోగినని, సాయి ఎన్ని సార్లు కబురు చేసినను వెళ్ళలేదు. చివరకు ఒకసారి వెళ్ళి "బాబా! యెందుకు కబురు చేశారు?" అని నానా అడుగగా "నేను ఊరకనే కబురుచేస్తానా? అందరికి కబురు చేస్తున్నానా? నీకు - నాకు ఉన్న సంబంధము అటువంటిది" అని వారి యిద్దరి గత జన్మల కలయికను నానాకు నిదర్శనముగా చూపినారు.

దాదాసాహెబు ఖాపర్డే భార్య గత ఐదు జన్మలలో ఆమె యెత్తిన జన్మలను చెప్పి ఆమెతో "రాజారాం మంత్రము" ఎల్లప్పుడు జపించుము. నీ జీవితాశయము నెఱవేరును. నీకు మేలు కలుగునని చెప్పిరి. శ్రీమతి తర్ఖడ్‌తో బాబా ఒకరోజు "ఎన్ని జన్మలలో మీతో ఉన్నానో, ముందు జన్మలన్నింటి లోను అట్లే మీతో ఉండగలను. మనమందఱము కలుసుకుంటాము. నాకు సమర్పించిన ప్రతి పైసాకూ నేను భగవంతునికి లెక్క చెప్పుకోవాలి" అని పలుకుచు "ఎవరినీ మధ్యలో విడువను. చివరికంటా గమ్యము చేరుస్తాను" అని అన్నారు.

ఒకసారి బాబా మాధవరావు దేశపాండే (శ్యామా) బుగ్గ గిల్లగా, శ్యామా ఏక వహించినాడు. అప్పుడు "శ్యామా! 72 జన్మల నుండి నీవు నాతో

నున్నప్పటికి నేను నీ బుగ్గ గిల్లలేదు" అని వాని జన్మలతో బాబాకు సంబంధ మున్నదని బాబా తెలిపిరి. రఘువీర్ పురందరేతో ఏడు శతాబ్దాల నుండి సంబంధముందని, "నేనితని నెప్పుడు మర్చిపోను" అని అన్నారు బాబా. కళ్యాణ్ నివాసి టి ఎ కార్నిక్‌ను 2000 సంవత్సరముల నుండి ఎఱుగుదును. "వాడు పెడబుద్ధి, కోతి యుక్తులు కలవాడని" అన్నారు. నార్కె నాకు 30 జన్మల నుండి తెలుసునన్నారు బాబా.

మనుష్యులే కాదు. పశు పక్ష్యాదుల యందును వాని సంబంధములు గల గత జన్మల స్మృతులు బాబా ఎట్లు చెప్పిరో చూడుడు. రెండు మేకల కథలో "గత జన్మలో ఈ రెండు మేకలు మానవులు. నా జతగా ఉండెడివారు. సోదరు లిద్దఱు కలహించి ఒకరి నొకరు చంపుకొనిరి. మఱు జన్మలో మేకలుగా జన్మించిరి. వారినీమేకల మందలో గుర్తు పట్టి వాటిని కొని వేరుశనగపప్పు తిండిగా పెట్టితిని" అని శ్యామా, తాత్యాలకు బాబా చెప్పిరి.

ఒక పాము కప్పను పట్టుకొని మ్రింగుటకు సిద్ధముగా నున్నప్పుడు ఒక భక్తుడు బాబాతో చెప్పగా "అదెట్లు తినగలదు. నేను దానిని రక్షించెదను" అని చెప్పి వాని గత జన్మల గుఱించి ఇట్లు చెప్పిరి. మాయూరికి 4, 5 మైళ్ళ దూరమున శిధిలావస్థలో నున్న ఒక దేవాలయము కలదు. ఆ ఆలయ పునర్నిర్మాణమునకు ప్రజలు వసూలు చేసిన విరాళములు తీసికొని పునర్ని ర్మాణము చేయని ధనవంతుడు, ఆ పనికి తన సొమ్ములు ధనవంతుడైన భర్తకు ఇచ్చి అందుకు గాను ఆలయ పూజారికి తాకట్టు భూమి ఒక ఎకరము వ్రాయించి యిచ్చిన ధనవంతుని భార్య, ఆ ధనవంతునికి భూమి తాకట్టు పెట్టిన "డుబ్కీ" అనే ఆమె వారు మువ్వురు మఱు జన్మలో వీర భద్రప్పగా పూజారి కూతురు గౌరిగా చెన్నబసప్పలుగా జన్మించి పొలము అమ్మగా వచ్చిన ధన విషయములో తగువులాడుచు మఱు జన్మలో వీర భద్రప్ప పాముగాను, చెన్న బసప్ప కప్ప గాను జన్మించిరి". చెన్నబసప్పను వీర భద్రప్ప నుండి కాపాడుదునని బాబా యిచ్చిన అభయ ప్రదానముచే ఇప్పుడు పాము నుండి కప్పను రక్షించి వాని జన్మల రహస్యములు చెప్పుట జరిగినది బాబాను ఆశ్రయించిన వారికి వారి వారి అన్ని జన్మలలోను బాబా తన అభయము ఇస్తూనే యుందురని మూడవ జన్మలోని ఈ రక్షణ మనకు నిరూపించుచున్నది.

చేసే వానికి మనస్పర్థలు రావు. బాబా బోధలలో, చర్యలలో జ్ఞాన బోధ మాత్రమే ఉండునని భావించరాదు. మన నిత్య జీవితములోని నడవడిక, ఆరోగ్య పరిరక్షణతో కూడిన సత్కార్మాచరణ కూడ మన కందించారు.

## భక్తుని రక్షించుటకు దెబ్బలుతిన్న సాయి

ఉబ్బసముతో బాధపడుచున్న హంసరాజ్‌కు ఆరోగ్యము చేకూర్చిరి సాయి. అతనిని తినవద్దన్న పుల్లపెరుగు తింటాడని సాయి తాను పిల్లి రూపముగా ఆ పుల్లపెరుగు తిని తన భక్తుని రక్షించుటకు ఆ భక్తునిచే కఱ్ఱ దెబ్బలు తినినారు సాయి.

## షిరిడీలో ఏదైనా నా ప్రసాదమే

సదాశివ జోషి స్వగ్రామము వెళ్ళుచుండగా బాబా అతనికి ఊది, మిఠాయి ప్రసాదముగా ఇచ్చిరి. ఆ ప్రసాదము ఇంట్లో అందరికి చాలదని జోషి అనగా బాబా అతనికి ఎనిమిది అణాలు ఇచ్చి "షిరిడీలో ఎక్కడైనా మిఠాయి కొని ఇంటికి తీసికొని పో. అది కూడా నా ప్రసాదమే" అని అన్నారు. బాబా యందు విశ్వాసము గల భక్తులు సాయినాథుని మనోవాక్కాయ కర్మలను తలచి తీసికొను ప్రసాదము బాబా ప్రసాదమే యగును గదా !

## శ్యామకర్ణ గుఱ్ఱము

వాయినతారా నినాసి సత్కార్ అనే ముస్లిమ్ సాయిని దర్శించునపుడు అతని వద్ద నున్న గొడ్డుది అయిన ఒకజాతి గుఱ్ఱమును గురించి చెప్పుచు "ఆ గుఱ్ఱానికి పిల్ల పుట్టినచో నా కిచ్చెదవా" అని అన్నారు బాబా. ఆ గుఱ్ఱము సంవత్సరములోపే ఈనింది. శివ నెలలోనే ఆ గుఱ్ఱపు పిల్లను బాబాకిచ్చాడు. ఆ గుఱ్ఱపు పిల్ల పేరే శ్యామకర్ణ.

ఈ గుఱ్ఱము చెవులు నల్లగా ఉండుటచే దీనికి "శ్యామకర్ణ" అనే పేరు బాబా పెట్టిరి. బాబా దీనిని శ్యామ సుందర్ అని కూడ పిలిచే వారు. ఈ శ్యామకర్ణ, లోగా శ్యామ నడిపిన పాఠశాల ప్రస్తుత ధుని సమాధులు ఉంచ బడుచున్న గదిలో ఉండేది.

ద్వారకామాయిలో హారతి ప్రారంభించుటకు ముందు ఈ శ్యామకర్ణను అందముగా అలంకరించి ద్వారకామాయి యందు గల హాలులో ప్రస్తుతము తాబేలు ఉన్న ప్రాంతములో ఉంచేవారు. హారతి జరుగునంతవఅకు అచటనే నిలబడి హారతి పాటకు అనుగుణముగా లయానుసారముగా శిరస్సు నూపుచు కాళ్ళుఆడించేది హారతి పూర్తి కాగానే ద్వారకామాయి మెట్లపై తన ముందు కాళ్ళుఉంచి బాబాకు వంగి నమస్కరించేది. బాబా ముందుగా దాని నొసటన ఊది పెట్టి దీవించిన తరువాతనే యితరులకు ఊది యిచ్చేవారు.

చావడి ఉత్సవములో కూడ ఈ శ్యామకర్ణాను పూర్తిగా అలంకరించే వారు. దాని కాళ్ళకు చిన్న గజ్జెలు కట్టబడేవి. చావడి ఉత్సవము ముందు ఇది నృత్యము చేస్తూ చావడి వద్దకు వెళ్ళేది. చావడిలో హారతి అగువఅకు అలానే నిలువచుండెడిది. హారతి కాగానే చావడి ముందు ఉండెడి పెద్ద రాతిపై తన కాళ్ళను ఉంచి బాబాకు నమస్కరించేది. బాబా పవిత్రదేహము సమాధి చేయబడిన తరువాత కూడ ద్వారకామాయిలో ఇదే విధముగా జరిగేది.

ఈ శ్యామకర్ణా జంతువైనప్పటికి బాబా అనుగ్రహమున పునీతమై 1945 లో మఱుజన్మ ఎత్తనవసరము లేకుండానే బాబా పాదముల చెంత చేరి సద్గతి పొందినది. మానవ జన్మ ఎత్తిన మనము పొందలేని సద్గతిని జంతువైన శ్యామకర్ణ పొందినది. దీని సమాధిని బాబా తపోవనమైన లెండి తోటలో దత్తాత్రేయుని విగ్రహమునకు వెనుక ప్రక్క సమాధి చేయబడినది. సాయి అంకిత భక్తిని పొందిన ఈశ్యామ సుందర్ సమాధిని భక్తులు దర్శించు కొని దీని యొక్క గొప్ప తనమును గుర్తు చేసుకొనుచున్నారు. ఈ విగ్రహమును గుర్తించుటకు ద్వారకామాయి ముందు గల షెడ్‌లో భక్తులు దర్శించు కొనుటకు ఏర్పాటు చేయబడినది.

## కొన్ని లీలలు – మహిమలు

1899 లో కోపర్గామ్‌లో మమలతదారుగా పని చేసిన బాలాభాటే సాయిబాబాను పిచ్చి ఫకీరనియు వారిని వ్యర్థముగా పూజించుచున్నారనియు

విమర్శించుచుండెడివాడు. ఒకసారి అతడు బాబాను దర్శించినప్పుడు బాబా అతనిపై శాలువ కప్పిరి. అప్పటి నుండి అతని జీవితములో మార్పు వచ్చి ఉద్యోగము కూడ వదలుకొని తన జీవితమును బాబా సేవలో గడిపినాడు.

దుర్భర దారిద్ర్యమనుభవించుచున్న కార్నిక్‌ను సాయిబాబా నవ్వుచు "ఆవో సాహుకార్" అని అన్నారు. ఒక సంవత్సరములోనే అతడు కోటీశ్వరుడైనాడు.

అడవిలో హరిశ్చంద్రగుట్ట వద్ద మండుటెండలో నానా సాహెబు చాందోర్కర్ దప్పిగొని మంచినీటి కొఱకు అలమటించుచుండగా భిల్లుని రూపములో అచటనే ప్రత్యక్షమై "నానా కూర్చున్న బండ క్రిందనే నీరున్నద"ని చెప్పి నానాను దప్పిక నుండి కాపాడిరి సాయి. నానా ఆ నీటిని త్రాగులోపే ఆ భిల్లుడు అదృశ్యమయ్యెను. నానా షిరిడీ వచ్చి సాయిని దర్శించుటకు రాగా ఆ లీలను గుర్తు చేయుట జరిగినది.

దాసగణు కోటు, తలపాగా మొదలగు ఆడంబరమైన దుస్తులు ధరించి హరికథ చెప్పబోవుచుండగా వానిని తీసివేయించి నారదీయ పద్ధతి ప్రకారము ధోవతి మాత్రము కట్టించి హరికథ చెప్పించిరి. దీని వలన సదాచారమును సాయి గౌరవించుట తెలియుచున్నది.

ఎంతో దూరమున సముద్ర మధ్యలో నౌక మునిగిపోవుచున్నప్పుడు జహాంగీర్ అనే నౌకాధికారి తన జీవితమునకు ఆశ వదలుకొని చివరిగా 'బాబా' అని ఆర్తితో పిలిచినంత మాత్రముననే బాబా మసీదులోనే ఉండి అచట ప్రత్యక్షమై ఆ నౌకాధికారిని 'నౌకతో పాటు కాపాడారు సాయి.

శ్యామా మొదటలో బాబాను విశ్వసించలేదు. శ్యామా యిల్లు తగులబడిన సంగతి బాబాతో చెప్పుకోగా "నీవు చెప్పుకొనుటకు నేనైనా ఉన్నాను. నా డబ్బు పోతే ఎవరికి చెప్పుకొనేది" అని లోగడ బాబాకు పంపిన దక్షిణ రూ. 2/- లను శ్యామా బాబాను పరీక్షించుటకు మసీదు ముందు పూడ్చి పెట్టుటను గుర్తు చేసి తన తప్పిదమును గ్రహింపచేసిరి.

ఒకసారి వి. హెచ్. ఠాకూరు, సాయిని దర్శించినపుడు "ఇక్కడ లభించే మార్గము కన్నడ సాధువు 'అప్పా' చెప్పినంత తేలిక కాదు. దున్నపోతు మీద నాన్షే ఘాట్ అను లోయను దాటడం కంటె కష్టం! ఆధ్యాత్మిక మార్గములో శక్తినంతటిని వినియోగించి కృషి చేసిన గాని ఫలితముండదు. అది చాలా కష్టము" అని బాబా అతనితో చెప్పి, "అప్పా" అను కన్నడ యోగిని ఠాకూరు కలియుట, నాన్షే ఘాట్ దాటుట గుర్తు చేసి "గ్రంథము చదువుట చాలదు. మననము చేసి, ఆచరించాలని, గురుకటాక్షం కావాలని" బాబా అతనికి చెప్పారు.

ఫిలాజీ గురవే భార్యకు బాబా కలలో కనుపించినప్పుడు "తన బాబుకు (బిడ్డకు) ఒక గుడ్డ యిాయుమని" బాబాను అడుగగా "తర్వాత ఇస్తాలే" అని అన్నారు బాబా" దేహత్యాగము చేసినప్పుడు వారి శరీరానికి ఉన్న గుడ్డను తీసి ఫిలాజీ గురవే కుమారునకు ఇచ్చుట ద్వారా బాబా తాను స్వప్నములో చెప్పిన మాటను నిలబెట్టుకొన్నారు.

బాబా వద్దకు వచ్చిన ముస్లిం దంపతులలో యౌనవవతి, సౌందర్యవతి యగు స్త్రీ మునుగుతో సాయికి నమస్కరించునపుడు ఆమె మేలి ముసుగు తొలగగా, అచటనే యున్న ఉన్నతోద్యోగియు, పండితుడును అగు శ్రీ నానా సాహెబు చాందోర్కర్ మనస్సు ఆమె అందమునకు చలింపగా బాబా గుర్తించి "నానా ! చూచుట తప్పుకాదు కాని, బుద్ధి పెడత్రోవ పట్టరాదు. అంతయు భగవంతుని రూపమని గ్రహించగలిగినచో బుద్ధి చాపల్యము కలుగదని" చెప్పి వారి ఆశీస్సులతో నానా సాహెబు చాందోర్కరు మనస్సును నిష్కల్మష మొనరించిరి.

## బాబా ఛాయాచిత్రములు

కొందఱు భక్తులు బాబాను ఫోటో తీయడానికి అనుమతి కోరగా బాబా అయిష్టంగానే అంగీకరించారు. వారు బాబా ఫోటో తీయగా ఆ ఫోటోలో బాబా పాదాలు మాత్రమే ఉన్నవి. ఆ విషయము బాబాతో చెప్పగా "ముఖ్యమైనవి పాదాలే కదా!" అని బాబా అన్నారు. మఱి మనము గురువునకు చేసేది

పాదపూజే గదా! ఈ ఫోటో ఇప్పుడు ఎక్కడ ఉన్నదో తెలియదు. మఱియొక భక్తుడు బాబా అనుమతి పొందక ఫోటో తీయగా అందులో పడినది బాబా ఫోటో కాక అతని గురువు ఫోటో మాత్రమే. ఒకసారి కొందఱు యువకులు బాబా ఫోటో తీయటానికి శ్యామాను కోరగా "బాబాను సాఠె వాడ వద్ద నిలిపెదను. ఫోటో తీసికొను"డన్నాడు. అప్పుడు శ్యామా ! "ఏమిటా గోల, ఫోటో తీయవద్దని చెప్పు అడ్డుగోడ కూలదోస్తే అదే చాలు" అని తన ఫోటో తీయనీయలేదు బాబా.

బాబా దేహధారిగా ఉండగా ఈ క్రింది ఫోటోలు మాత్రమే తీయబడినవని 1992 జులై నెల "సాయి పథం" మాస పత్రికలో వ్రాయబడినది.

1) బాబా మసీదులో ధుని ప్రక్కన చెయ్యి ఆనించి కూర్చొని ఉండగా శ్రీ కాశీరాం షింపే తీయించిన ఛాయాచిత్రమే మొదటి ఫోటో.

2. శ్రీ మహాల్సాపతి, శ్రీ భాగోజి షిండేలతో కలసి బాబా తమ కాళ్ళు బారచాపుకొని కూర్చున్న ఫోటో.

3. మసీదు ముంగిట నున్న బండరాతి మీద కాలుపై కాలు వేసుకొని కూర్చొని యుండగా తీసిన ఫోటో.

4) శ్రీ వాసుదేవ సదాశివ జోషి, వి.యస్. ఫోటో గ్రాఫర్ అనే అతనిని షిరిడీ పంపి బాబా ఫోటో తీయించారు. ఇది వరదముద్రలో నున్న ఫోటో. ఈ ఫోటోలో బాబా ప్రసన్నత గోచరించును. (ఈ ఫోటో ఆ పత్రికలో ప్రచురించారు). జోషి ఫోటో తీయమని పంపగా, ఫోటో తీయకుండా ఫోటో గ్రాఫరు కూర్చున్నాడు. అప్పుడు "ఫోటో తీయడానికి వచ్చి కూర్చున్నావేమి ? ఫోటో తీసికో" అని అన్నారు బాబా స్వయముగా కోరి తీయించుకొన్న ఫోటో యిది.

5) బాబా భిక్షకు వెళ్ళుచు చావడి ముందు నిలచి ఉండగా తీసిన ఫోటో.

6) బాబాకు కుడివైపున శ్రీ ఖానా సాహెబు విమోనక్కర్, ఎడమవైపున శ్రీ బాపు సాహెబు బూట్టీ, బాబాకు గొడుగు పట్టుకొన్న శ్రీ భాగోజి షిండేలతో లెండికి వెళ్ళుచు దారిలో ఒక ఇంటి గోడకు ఆనుకొని బాబా నిలచి ఉండగా తీసిన ఫోటో.

పై ఫోటోలు అన్నియు భక్తులకు అందుబాటులో లేవు.

బాబా యొక్క తైలవర్ణ చిత్రము గీయించుటకు శ్యామారావు జయకర్ అను ప్రఖ్యాత చిత్రకారుని థాణా నుండి ప్రధాన్ అను భక్తుడు షిరిడీ తీసికొని వచ్చి బాబా అనుమతి కోరాడు. "నేను పేద ఫకీరును; నా చిత్రము గీయడ మెందుకు ? శ్యామా ! నీ చిత్రమే గీయించుకో" అని బాబా అన్నారు. చివరకు భక్తుల కోరిక మీద బాబా అంగీకరించారు. అప్పుడు శ్యామారావు జయకర్‌చే బాబా తైలవర్ణ చిత్రము గీయబడినది.

బాబాను అప్పుడు కాని. యిప్పుడు కాని నూటికి 99 మంది లౌకిక ప్రయోజనముల కొఱకే ఆశ్రయించుచున్నారు. "అనేక మంది నా వద్దకు వచ్చి ధనము, ఆరోగ్యము, పలుకుబడి, గౌరవము, ఉద్యోగము, రోగనివారణ మొదలగు ప్రాపంచిక విషయములే యడుగుదురు. బ్రహ్మ జ్ఞానమీయుమని అడుగువారు తక్కువ పారమార్థిక విషయమును యోచించువారు మిక్కిలి యరుదు. నా ఖజానా నిండుగానున్నది. ఎవరికేది కావలసిన దానిని వారికి ఈయగలను. కాని వానికి పుచ్చుకొను యోగ్యత యుండవలెను" అని బాబా ఒకసారి చెప్పినారు. చావడి ఉత్సవము చేయు పల్లకి ఉంచడానికి రఘువీర్ పురందరే స్వయముగా తన సొంత ధనముతో మసీదుప్రక్క షెడ్‌కు గోడలు పెట్టి నిర్మించాడు. అప్పుడు బాబా పురందరేను "వీలైనప్పుడు తఱచు షిరిడీ వచ్చుచునుండుము" అని అన్నారు. మీరు సంకల్పిస్తేనే నేను రాగలను అని పురందరే అన్నాడు. షిరిడీకి నేను అందఱిని పిలుస్తాను. కాని వచ్చుటకు అందఱు సిద్ధముగా ఉండరు" అని అన్నారు బాబా.

కనుక సంసారమును త్యజించి సన్యసించవలసిన పనిలేదు. అరణ్యములకు, ఆశ్రమములకు వెళ్ళి ముక్కు మూసుకొని కూర్చుండవలసిన పనిలేదు. సంసార జీవితములోనే నిస్సంగులమై విహిత కర్మలనాచరించుచు సద్గురు సాయినాథుని ఆశ్రయించి మానవజన్మను సార్థకత పఱచుకొందము. కలి మాయ నుండి కడ తేర్చగల కలియుగావతారుడైన సాయినాథుని వాగమృతమును త్రాగి. లీలా సముద్రమున మునిగి తేలియాడుదము.

ఓం శ్రీ సాయి నాథాయ నమః



నరుని వలెఁదోతు వీవ; యీశ్వరుఁడవీవ;
కర్తవీవ; క్రియయు నీవ; కర్మమీవ;
పావనుఁడవీవ; యుత్తమ వ్యక్తి వీవ;
సర్వ జగముల ప్రభువీవ; సాయిదేవ !

# సాయిబాబా చరిత్రము

## పంచమాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# సాయిబాబా దేహత్యాగము - అభయ ప్రదానము

ఈ కలియుగములో ధర్మ సంరక్షణ చేయుటకు జ్ఞానబోధ ఒక్కటే చాలదు. యాంత్రిక జీవితమును గడుపుచు, కామ - క్రోధ - లోభ మోహములతో జీవించుచు, ఆహార, ధన సంపాదనల కొఱకు శ్రమించు మానవులను సన్మార్గములుగా చేయుటకు, సమైక్యపఱచుటకు, భగవంతుడు మానవ రూపములో దేహధారిగా మానవుల మధ్య సంచరించుట అవసరమని తలంచి పరిపూర్ణ పరబ్రహ్మము మానవ రూపధారియై సాయినాథుడుగా మానవుల మధ్య సంచరించుచు సత్కర్మలనాచరించినాడు. భక్తులకు తన తత్త్వమును అందింపచేయుచు, భగవంతుడు సాకారుడు కాడనియు, నిరాకార స్వరూపుడనియు నిరూపించి, తన దేహమును త్యజించినను సర్వగతుడై తన అవతార కార్యమును కొనసాగించుచునే యున్నారు సాయి, ఈ కలియుగములో షోడశ కళా ప్రపూర్ణావతారము సాయి. వారి దేహత్యాగములో కూడ ప్రత్యేకత యున్నది. వారి దేహత్యాగము, అభయ ప్రదానముల గుఱించి తెలుసు కొందము.

## బాబా యోగాభ్యాసము

బాబాకు అన్ని యోగములు తెలుసు. మసీదుకు చాలా దూరమున గల మఱ్ఱిచెట్టు వద్ద నున్న బావి వద్దకు మూడు రోజులకు ఒకసారి బాబా వెళ్ళి ముఖ

ప్రక్షాళనము, స్నానము చేసెడివారు. బాబా స్నానము చేయునప్పుడు తన శరీరమును ఎవరిని తాకనిచ్చేవారుకాదు. కొంత కాలము తరువాత బాబా స్నానానికి భక్తులు రెండు బక్కెట్లతో వేడి నీళ్ళు మసీదులో పెట్టేవారు. బాబా మసీదులో స్నానము చేయునప్పుడు తెరలు వేసేవారు. సుమారు గంటన్నర కాలము బాబా స్నానము పట్టేది. స్నానము అయిన తరువాత బాబా ధుని వద్ద నిలబడగా భక్తులు తుడిచేవారు.

బాబా "ధౌతి" యోగము చేసెడివారు. ధౌతి యోగమనగా 3 అంగుళముల వెడల్పు 22 1/2 అంగుళముల పొడవు గల గుడ్డను మ్రింగి కడుపులో అర గంట వఱకు ఉండనిచ్చిన పిమ్మట తీయుట. కాని బాబా విధానము దీనికంటె ప్రత్యేకమయినది. ఒకరోజు బాబా తన యూపిరితిత్తులను బయటకు క్రక్కి ఆ యూపిరితిత్తులను నీటితో శుభ్రపఱచి నేరేడుచెట్టుపై ఆఱవేయుట కొందఱు చూచినారు.

బాబాకు శరీర భాగములను విడదీసి వేఱు వేఱు ప్రదేశములలో పెట్టు ఖండయోగము కూడ తెలుసు. ఒకనాడొక పెద్ద మనిషి (షిరిడీ నివాసి అప్పాభిల్) బాబా తన శరీరావయవములన్నియు వేఱుచేసి మసీదు నందు వేఱు వేఱు స్థలములలో విడిచి పెట్టుటను చూచి బాబాను ఎవరో ఖూనీ చేసిరని భయపడి యీ సంగతి తాను చెప్పిన తననే అనుమానించెదరని ఊరకుండి, మరుసటి రోజు ఉదయము అతడు మసీదుకు వెళ్ళగా బాబా హాయిగా కూర్చొని ఉండుట చూచి ఆశ్చర్యపడెను.

## బాబా 72 గంటల సమాధి

సాయిబాబా భక్త మహాల్సాపతితో "నా శరీరమును మూడు రోజుల వఱకు కాపాడుము. నేను తిరిగి వచ్చినట్లయిన సరే. లేనియెడల నా శరీరమును ఎదురుగా నున్న ఖాళీ స్థలములో పాతిపెట్టి. దానిపై గుర్తుగా రెండు జెండాలు పాతుము" అని చెప్పి 1886 మార్గశిర పూర్ణిమ రోజు రాత్రి గం. 10-00 ల నుండి మహాల్సాపతి తొడపై పడుండి బాబా సమాధిలోనికి వెళ్ళిరి. అనగా దేహము నుండి శ్వాస వదలి నిర్జీవులైరి. ముటల మూడవ

రోజు తెల్లవాఱు జామున గం. 3-00 లకు బాబా శరీరములోనికి ప్రాణము వచ్చి చైతన్యము పొందిరి. ఇది అపూర్వ సంఘటన. పరబ్రహ్మ మైన సాయికి తప్ప మానవులకు సాధ్యము కాదు భక్త మహాల్సాపతి నిద్రాహారములు మాని బాబా నిర్జీవదేహమును తన తొడపైననే పెట్టుకొని యుండెను. కొందఱు బాబా చనిపోయినారని చెప్పినను వినక కంటికి ఱెప్పవలె కాపాడి, సాయిని మనకందించినారు. "సాయి లీలామృతము"లో ది. 13-8-1886లో సాయి తీవ్రమైన ఉబ్బసము వ్యాధితో బాధపడుచు రాత్రి గం. 10-00 లకు భక్త మహాల్సాపతితో "నేను అల్లా హే వద్దకు వెళ్ళుచున్నాను. తిరిగి వస్తే మూడు రోజులలో వస్తాను శరీరాన్ని ఆరుబయట పాతి పెట్టి, గుర్తుగా రెండు జెండాలు పాతు" అని చెప్పి ఒరిగిపోయిరి. మఱల 16-8-86 తెల్లవాఱు జామున గం. 3-00 లకు నాడి, శ్వాస ప్రారంభమై లేచిరి. "దేవా! ఎక్కడికి పోయినావు" అని శ్యామా అడిగితే "అల్లా వద్దకు వెళ్ళాను మొదట నేను తిరిగి రాదలచలేదు కాని అల్లాహే నీవు చేయవలసిన దెంతో ఉంది ! బెంగాల్‌లో గంగాధర్ అనే మహాత్ముడు నాలో కలవాలని ఆరాటపడుచున్నాడు. కాని అతని పుణ్య ఫలము, అవతార కార్యంబులే మిగిలాయి. నీవవి తీసికొని అతనిని విడుదల చేసి నీ స్థలానికి వెళ్ళు"అని అన్నారు. నేను అలాగే చేశాను. ఆరోజు రాత్రి గం. 1-02 లకే శ్రీ రామకృష్ణ పరమహంస నిర్యాణ మయ్యారు" (గంగాధరుడు) అని ఉన్నది. ఈ సంఘటన జరిగిన తరువాత 1886 నుండి సాయి లీలలు ఎక్కువగుట. భక్తులు ఎక్కువగా వచ్చుట జరిగినది. నానా సాహెబు చాందోర్కర్ ప్రచారము వలనను, దాసగణు మహారాజు హరికథల ద్వారా జరిపిన ప్రచారము వలనను షిరిడీ వచ్చు భక్తుల సంఖ్య పెరిగినది.

## సీమోల్లంఘనము

బాబా నిర్యాణమునకు రెండు సంవత్సరముల ముందు జరిగిన సంఘటన. 1916 విజయదశమి రోజున సీమోల్లంఘనము చేసి (పారువేట, గ్రామము సరిహద్దు దాటుట) తిరిగి రాగానే బాబా హఠాత్తుగా కోపోద్రిక్తులై తమ తల గుడ్డ, కఫ్నీ, లంగోటి ఊడతీసి వానిని చించి ధునిలో వేసి దిగంబరుడై నిలచి

ఎఱ్ఱగా మండుచున్న కన్నులతో "ఇప్పుడు సరిగా గమనించి నేను హిందువునో, మహమ్మదీయుడనో చెప్పుడు అని బిగ్గరగా అఱచిరి. కుష్ఠురోగి భాగోజీ షిండే ధైర్యముతో బాబా దగ్గఱకు పోయి లంగోటి కట్టి "బాబా ! సీమోల్లంఘనము నాడు ఇదంతయు నేమి? యనెను దానికి జవాబుగా "ఇది నా సీమోల్లంఘనము" అనుచు బాబా తన సటకాతో నేలపై కొట్టెను. ఒక గంట తరువాత బాబా మామూలు స్థితికి వచ్చిరి. బాబా తన నిర్యాణమునకు రెండు సంవత్సరములకు ముందే అదే రోజున తన నిర్యాణము జరుగునని, సూచన చేసినను అది యెవరికి అర్థము కాలేదు.

## బాబా దేహత్యాగము – ఇటుకరాయి

బాబా భౌతిక దేహమును విడచుటకు కొన్ని దినములకు ముందు, బాబా రాత్రుల యందు తల క్రింద పెట్టుకొనెడి యిటుకరాయి. బాబా మసీదులో లేనప్పుడు, మసీదు శుభ్రము చేయు మాధవు ఫస్లే అను బాలుని చేతి నుండి జారి క్రిందపడి రెండు ముక్కలైనది. ఈ సంగతి బాబాకు తెలియగనే "ఇటుకరాయి కాదు. నాయదృష్టమే ముక్కలు - ముక్కలుగా విఱిగిపోయినది. అవి నా జీవితపు తోడు - నీడ" అని అన్నారు. దాసగణుతో "దీనికి నా గురువు యొక్క పాద స్పర్శ యున్నది. కనుక దీనిని నా తల క్రింద నుంచుకొనుచున్నాను. ప్రతిరోజు తెల్లవాఱగనే మీరందఱు వచ్చి నా కాళ్ళమీద పడుదురు, మీ నమస్కారములన్నియు నేను నా గురువునకు సమర్పించుచుందును" అని బాబా చెప్పిరి.

1918 సెప్టెంబరు 28వ తేదిన బాబాకు కొంచెము జ్వరము తగిలినది. రెండు మూడు రోజుల వఱకు జ్వరముండెను. బాబా భోజనము మానిరి. అందుచే క్రమముగా బలహీనులగుచుండిరి. మానవులు దేహత్యాగము చేయుటకు ముందు ఆధ్యాత్మిక చింతనతో గడుపవలెనని చెప్పుటకు బాబా నిర్యాణమునకు ముందు "వాఝే" అను భక్తునిచే 'రామ విజయము' చదివించి వినిరి. 1918 అక్టోబరు 15వ తేదిన మంగళవారము మధ్యాహ్నము గం. 2-30లకు దశమి వెళ్ళగా ఏకాదశి గడియలలో "తనకు ఆ స్థలము (మసీదు) బాగుగాలేదని బూటి వాడకు తీసికొని పోయినచో అచట బాగుండునని చివరి

సారిగా పలుకుచు బాబా బాయాజీ శరీరముపై ఒఱిగి ప్రాణములు విడచిరి. ప్రాణములు విడచుటకు ముందు మాధవ ఫస్లే నడిగి "పాన్" తీసుకొన్నారు బాబా. పాన్ వేసుకొని నీళ్ళు త్రాగారు. కాని కొన్ని నీళ్ళు మాత్రమే లోనికి వెళ్ళినవి. ప్రాణములు విడచిన తరువాత నానా సాహెబు నిమోన్కర్ నీళ్ళు తెచ్చి బాబా నోటిలో పోసెను. అవి బయటకు వచ్చుట చేబిగ్గరగా "ఓ దేవా" యని నిమోన్కర్ అఱచెను. బాబా కన్నులు తెరచి మెల్లగా "ఆహ" యనెను. అంతే. బాబా భౌతిక శరీరము నుండి పంచ ప్రాణములు అనంత వాయువులలో లీనమయినవి. బూటి వాడ నుండి పరుగున వచ్చిన డాక్టరు పిళ్ళే నాడి పరీక్షించి కంటనీరు పెట్టారు. ఆ సమయములో లక్ష్మీభాయి షిండే. భాగోజి షిండే, బాయాజీ, లక్ష్మన్ బాలా షింపి, నానా సాహెబు నిమోన్కర్ అక్కడ ఉండిరి. చివరిసారిగా బాబా అబ్దుల్లాను రమ్మనమని కబురు చేశారు. కాని అబ్దుల్లా వెంటనే రాలేదు. అతడు వచ్చునప్పటికి బాబా దేహత్యాగము చేయుట చూచి తన దురదృష్టమునకు దుఃఖించాడు అబ్దుల్లా. భక్తులతోపాటు పురజను లందఱు దుఃఖిస్తూ మసీదు చేరారు.

బాయాజీభాయి తనకు చేసిన సేవకు ఆమె కుమారుడైన తాత్యాను మరణము నుండి రక్షించుట కొఱకు బాబా దేహత్యాగము చేసిరని భక్తులు భావించిరి. దానికి ఈ క్రింది కారణము కనిపించుచున్నది. రామచంద్ర పాటీలు తీవ్రముగా జబ్బుపడినప్పుడు"నేను ఎప్పుడు మరణింతునో చెప్పు"మని బాబాను రామచంద్ర పాటీలు కోరగా "నీ చావు తప్పినది త్వరలో బాగు పడెదవు. కాని తాత్యా కోతే పాటీలు 1918 విజయదశమినాడు మరణించును. ఈ విషయము వానికిని, ఎవరికిని తెలియనీయకుము"అని బాబా రామచంద్ర పాటీలుతో చెప్పెను. బాబా చెప్పినట్లే 1918 అశ్వయుజములో తాత్యాకు జబ్బు చేసి విజయదశమి నాటికి ఎక్కువ అయినది. బాబా దేహత్యాగము చేయుటతో తాత్యాకు కలిగిన జబ్బు తగ్గినది.

1916లో సాయిబాబాకు తీవ్రముగా జ్వరము వచ్చినది సాయి పరిస్థితి విషమించుచుండగా నానా సాహెబు చాందోర్కర్ వంటి సన్నిహిత భక్తులు షిరిడీ వచ్చి బాబా ఆరోగ్యము కొఱకు అభిషేకములు చేయించిరి. బాబా

పరమపదించినచో అంత్యక్రియలు ఏ విధముగ చేయాలో చెప్పమని నానా సాహెబు చాందోర్కర్‌ను భక్తులు అడిగినారు. కాని నానా ధైర్యము చేయలేదు. సాయి నానాకు కబురు చేసి "నేను నిర్యాణము చెందుటలేదు. అట్టి ఆలోచన వద్దు. ఆ సమయము వచ్చినప్పుడు ఏర్పాట్లన్నియు నేనే స్వయముగా చేయగల"నని చెప్పిరి.

ఒకసారి భక్త మహల్సాపతితో "అరె భగత్! నేను ముందు పోవు చున్నాను. నీ వింకను నాలుగు సంవత్సరములు ద్వారకామాయికి వచ్చు చుండుము" అని తన నిర్యాణమును గురించి, తన భక్తుడగు మహల్సాపతి నిర్యాణమును గురించి బాబాచెప్పిరి. 1918లో కొద్ది నెలలు గడచిన తరువాత షిరిడీ దర్శించిన ఉద్ధవేశీబువా మరియు శ్రీమతి చంద్రాబాయి బోర్కర్‌లతో ఒకరోజు "ఇక నుండి మీరు శ్రమపడి తరచు షిరిడీ రానక్కరలేదని" బాబా అన్నారు. సమాధి చెందుటకు, కొంత కాలము ముందు ఒకరోజున హేమాడ్ పంతుకు బాబా ఒక గిన్నెడుమజ్జిగ త్రాగుమని యిచ్చి"దానినంతయు త్రాగుము. నీకిక మీదట ఇట్టి అవకాశము దొరకదు" అని చెప్పిరి. అతడు తన కడుపు నిండుగ నున్నప్పటికి అమృతము వంటి ఆ మజ్జిగను త్రాగెను.

ఇట్లే రఘువీర్ పురందరేకు "నేను ముందు వెళ్ళుచున్నాను. మీరు తరువాత వస్తారు"అని చెప్పి అతనికి సెలవిచ్చుచు, "నా సమాధి మాటాడును; నా నామము పలుకును; నా మట్టి సమాధానమిచ్చును" అని బాబా అతనితో అన్నారు. కనుక బాబా వాక్కుకు తిరుగులేదు.

విజయదశమికి నాలుగు రోజుల ముందుగానే "నందు మార్వాడి" భార్యతో "ద్వారకామాయిలోను, చావడిలోను ఉండుటకు విసుగు పుట్టినది. నేను బూటి వాడకు పోతాను. అక్కడ నాకు పెద్ద పెద్దవారు సేవలు చేస్తూ ఉంటారు" అని సాయి చెప్పినారు.

బాబా శరీరాన్ని భక్తులు సందర్శించి నమస్కరించుకొనుటకు వీలుగా మసీదులో కూర్చుండ పెట్టిరి. పిమ్మట బాబా నిర్జీవదేహమును షిరిడీలో

ఊరేగించి బూటి నిర్మించిన మందిరములో మురళీధరుని ప్రతిష్ఠించుటకు నిర్ణయించిన చోట 17వ తేదీన సమాధి చేసిరి. ఇదే ప్రస్తుతము భక్తులు దర్శించు సమాధి మందిరము. బాబా ఎల్లప్పుడు రాత్రులందు తలగడ క్రింద పెట్టుకొను ఇటుకరాయి క్రిందపడి విఱిగిన రెండు ముక్కలను కలిపి తీగతో కట్టి సమాధిలో బాబా తలక్రింద నుంచిరి. బాబా తన దగ్గఱ నుంచుకొనెడి మూటలోని కాశీరాం ఏనాడో కుట్టి యిచ్చిన ఒక ఆకుపచ్చ కఫ్నీ, ఆకుపచ్చ టోపి కూడ సమాధిలో నుంచిరి. బాబా దేహత్యాగము చేసిన పిమ్మట, 36 గంటలు గడచిన తరువాత గాని సమాధి జరుగలేదు. 36 గంటలు గడచినను బాబా నిర్జీవదేహము బిగిసికొనిపోలేదు. అవయవములన్నియు సాగుచునే యుండెను. వారు ధరించియున్న కఫ్నీ చింపక సులభముగానే ఆ నిర్జీవ దేహము నుండి తీయగలిగిరి. కారణజన్ములు సాయి. వారిది స్వచ్ఛంద దేహత్యాగము. పంచ భూతములను శాసించు సాయి యొక్క పాంచభౌతికమైన, దేహము బిగిసికొనుపోవుట జరుగునా ?

బాబా ఉత్తర క్రియలు (మానవుడుగా దేహము ధరించిరి కనుక) బాలా సాహెబు బాటే ఉపాసనీ బాబాలు నెరవేర్చిరి. విరివిగా అన్నసంతర్పణలు చేయబడినవి. యం. డబ్ల్యు. ప్రధాన్ వదినెగారికి బాబా కలలో "మీ సంచిలో నున్న పీతాంబరము నా సమాధిపై కప్పడానికి షిరిడీ పంపండి" అని చెప్పిన ప్రకారము ఆమె పంపిన పీతాంబరమే 1923 దాక సమాధిమీద కప్పినారు.

బాబా దేహత్యాగము చేసిన మఱురోజు అనగా బుధవారము ఉదయము శ్యామాకు మేనమామ యగు లక్ష్మణమామా జోషికి బాబా స్వప్నములో గాన్పించి, చేయిపట్టి లాగి "త్వరగా లెమ్ము, బాపు సాహెబు నేను మరణించితి ననుకొనుచున్నాడు" అందుచే నతడు రాడు. నీవు పూజ చేసి కాకడ హారతిని ఇమ్ము" అని చెప్పిరి. సనాతనాచారపరుడైన లక్ష్మణమామా జోషి పూజా ద్రవ్యముల పళ్ళెము చేత ధరించి మౌల్వీలు అటంకపఱచుచున్నను లెక్కించక బాబా స్వప్నములో చెప్పిన ప్రకారము ఆ నిర్జీవ దేహమునకు కాకడ హారతి యిచ్చినారు. మధ్యాహ్న హారతికి మాత్రము బాపు సాహెబు జోగ్ అందఱితో మామూలుగా వచ్చి హారతి యిచ్చిరి.

అటులనే దాసగణుకు బాబా కలలో చెప్పి ఆ నిర్జీవ దేహమునకు పూలచే కప్పి అలంకరింప చేయించుకొన్నారు. ఇప్పుడు కూడ షిరిడీలో నాలుగు వేళల హారతులు ఇచ్చుట, ప్రతి హారతి సమయములోను బాబా విగ్రహమునకు సమాధికి వస్త్రములచే, పూలచే అలంకరించుట జరుగుచున్నది. భక్తులు కూడ ఈ నాలుగు వేళలలో జరుగు హారతులలో పాల్గొనుట, పూలదండలతో, పూలగుత్తులతో, నూతన వస్త్రములతో బాబా సమాధిని, విగ్రహమును అలంకరింప జేయుట జరుగుచున్నది. మాతృశ్రీ పూలమ్మగారు ఎప్పుడును సాయిని "పాపం ! ముసలాయన"అని సంబోధించునట్లు, అభిషేక సమయములో ముసలాయనగా కనిపించు సాయి, వస్త్రముల, పూల అలంకరణతో రాజాధిరాజుగా దర్శనమిచ్చు బాబాను భక్తులు వారి వారి మనోభావముల ప్రకారము ఇప్పుడు షిరిడీలో దర్శించుచున్నారు.

## పెద్దల మాటలలో సాయి

95 సంవత్సరముల వయస్సు గల విఠోభా భక్తుడైన గౌలిబువా యను వృద్ధుడు బాబాను చూచి "వీరు పండరీనాథుని అవతారమే! అనాథల కొఱకు, బీదల కొఱకు వెలసిన కారుణ్య మూర్తి"అని అనిరి. పుణితాంబే నుండి వచ్చిన 'గంగఘీర్' బాబాను చూచి "ఈ మణి యిచ్చట ఉండుటచే షిరిడీ పుణ్యక్షేత్రమైనది. ఈ నేల పుణ్యము చేసుకొన్నది. కనుక సాయిబాబా అనే మణిని రాబట్టుకొన్నది" అని అనిరి. ఆనందనాథుడనే యోగి పుంగవుడు బాబాను చూడవచ్చి "ఇది అమూల్యమైన రత్నము ముందు ముందు ఈ సంగతి మీకే తెలియగలదు" అని అనిరి.

దాదా సాహెబు ఖాపర్డే తన డైరీలో (ది. 16-1-1912న) "సాయి ఎంతో ప్రసన్నముగా చిఱునవ్వులొలికించారు. ఆ నవ్వును ఒక్కసారైనా చూచుటకు ఇక్కడ (షిరిడీలో) కొన్ని సంవత్సరాలైనను వేచి యుండవచ్చు. పట్టరాని సంతోషముతో నేను పిచ్చివానిలా చూచుచుండిపోయితిని"అని వ్రాసుకొన్నారు. మోరేశ్వర్ ప్రధాన్ బాబా ముఖము, కళ్ళు చూచి "నయమే, అశ్రద్ధ చేయకుండా వచ్చాను. ఇది అదృష్టము" అని అనుకొన్నారు.

దాము అన్నా బాబాతో "బాబా ! మీరు భౌతిక దేహము విడచిన పిమ్మట నా గతి ఏమి ?" అని ప్రశ్నించగా "ఎక్కడైనను, ఎప్పుడైనను నా గురించి చింతించినచో నేనక్కడనే యుండెదనని" బాబా చెప్పిరి. పూనా యింజనీరింగ్ కాలేజి ప్రిన్సిపాలుగారైన 'నార్కె' బాబాను గురించి చెప్పుచు "వారి నేత్రాలు నన్ను అణువణువు గ్రుచ్చి చూచాయి. బాబా ఆకారము నా హృదయములో ప్రశాంతముగా ముద్రించుకొన్నది. వారు నా అంతర్యామి వారు నాతో మాటాడునప్పుడు నా హృదయములో కూర్చుండువాని వలె మాటాడిరి. వీరు నాలో నున్న భగవంతుడు" అని అన్నారు.

యతీశ్వరులు ఇతరులకు నమస్కరించు ఆచారము లేదు. కాని శ్రీ వాసుదేవానంద సరస్వతి (టెంబె స్వామి) బాబాను తనకు అగ్రజునిగా తెలిపి నమస్కారము సమర్పించుకొన్నారు. "సాయిబాబాను సేవించుట, భగవంతుని సేవించుటయే" అని మెహర్‌బాబా అన్నారు "సకల అవతారముల సారాంశము (ప్రయోజనము) శ్రీ సాయిబాబా యందు గలుగుటచే శ్రీ సాయి అవతారము సంపూర్ణావతారమని నిస్సంకోచముగా చెప్పవచ్చునని" శ్రీ శివానంద సరస్వతి స్వామి (శ్రీ హృషీకేశ స్వామి) పేర్కొన్నారు. "సాయిబాబా 5 1/2 అడుగుల ఎత్తుండేవారు శరీరము. పచ్చని పసిమి, వారి కనుగ్రుడ్లు నీలముగా నుండి చీకటిలో మెరిసేవి. అతని నవ్వు మధురముగా నుండేది. అతని ముక్కు పుటాలు పెద్దవి" అని శరణానంద వర్ణించారు.

యస్.బి. ధూమల్ "ఇరువది నాలుగు గంటలు బాబా అభయ (రక్షణ) హస్తము నన్నాదుకొనియే యుండును. నేను కావించు ప్రతి కార్యము బాబా అధీనమై జరుగును. బాబాను అర్థము చేసుకోవాలంటే స్వయముగా అనుభవము పొందాలి. అయన యిప్పటికి ఉన్నారు. మహా సమాధి చెందక మునుపటి కంటె గూడ అయన యిప్పుడే అనగా మహా సమాధి చెందిన తరువాతనే ఎక్కువగా భక్తుల నాదుకొనుచున్నారు" అని బాబాను గురించి యనిరి.

ఇందూరు హైకోర్టు జడ్జీగా చేసిన యం బి. రేగే యిట్లనిరి "బాబా నశించు శరీరము మాయమైనది గాని, దానిలో నుండు 'బాబా' మాత్రము

ఇప్పటికి అనంత శక్తి వలె నిలచి, వారు సమాధి చెందక ముందు భక్తులకు తోడ్పడినట్లు ఇప్పటికి నిశ్శబ్దముగా వారినే ఆశ్రయించు అసంఖ్యాకులగు భక్తులకు సహాయపడుచున్నారు".

బ్రిటిష్ ప్రభుత్వమువారు సాయిబాబాపై నిఘా ఏర్పరచిరి. హిందు, ముస్లిమ్ మతస్థులైనచో అభిమానము చూపుదురని క్రైస్తవుడైన చక్రనారాయణ్ అను పోలీసు కానిస్టేబులును నియమించిరి. అతడు బాబా విధానమును చూచి అతనికి బాబాపై భక్తి శ్రద్ధ లేర్పడినవి. "నేను బాబాపై నిఘా వేశాను ఎంతో అనుమానముతో గమనించినప్పటికి నాకు వారిపై అభిమానమేర్పడినది. స్త్రీల పట్ల - ధనము పట్ల నిర్లిప్తుడు. బాబాకు ఎవరైనా దక్షిణ ఈయకున్న నిందించుట - ద్వేషించుట లేదు. వచ్చే దక్షిణ కంటె ప్రతిరోజు ఎక్కువ మొత్తము పంచేవారు, అవి ఎక్కడ నుండి వచ్చేవో కనిపెట్టలేకపోయినాను. ఆయనకు దివ్య శక్తులున్నాయని నాకర్థమయింది. అన్ని మతముల పట్ల ఆయన ప్రవర్తన ఎంతో ఉన్నతముగా ఉండేది. గ్రామములో ఫౌజుదారు క్రైస్తవుడని ఒకరు బాబాతో చెపితే "అతడే నేను. అతడు నా సోదరుడు అని బాబా అన్నారు. వారి శక్తులు అద్భుతమైనవి. బాబా ఊదితో ఎందరో జబ్బులో తగ్గించిరి" అని చక్రనారాయణ్ చెప్పెను.

పూర్వశ్రీ శివనేశన్ స్వామి "సమాధి యైన వెనుక యిప్పుడు కూడ బాబా భక్తులకు దర్శనమిచ్చి కాపాడుచున్నారు" అని స్వయముగా నాతో చెప్పిరి.

బాబా పరబ్రహ్మ స్వరూపమైన దత్తాత్రేయావతారము. దత్తాత్రేయుడు ఈ యుగాలున్నంత కాలము ఉండును. ఒకప్పుడుండును. ఒకప్పుడు లేడు అనే వేలేదు సృష్టి యున్నంత కాలముండును. ఆ దత్తాత్రేయుడే సాయిబాబా. యుగానికొక సంపూర్ణావతారము వస్తుంది. ద్వాపర యుగములో శ్రీకృష్ణ పరమాత్మ సంపూర్ణావతారము. ఈ కలియుగములో శ్రీ సాయిబాబా సంపూర్ణావతారము. మిగిలినవారు అంశావతారములు, సంపూర్ణావతార ముండుట లేకపోవుట అనేది యుండదు. పరబ్రహ్మ స్వరూపము కలవాడే సమర్థ సద్గురువు. సమర్థ సద్గురువనగా తన శిష్యుని (ఆశ్రితుని) ప్రారబ్ధాన్ని కూడ

నశింపజేయువాడు. అట్టివాడే జగద్గురువు, దత్తాత్రేయుడు, సమర్థ సద్గురువు శ్రీ షిరిడీ సాయినాథుడు" అని శ్రీ షిరిడీ డెవలప్ కమిటి అధ్యక్షులు శ్రీ మహాభాష్యం రంగాచార్యులుగారు ది. 3-3-93న వారిని కలిసినప్పుడు ఈ రచయితతో చెప్పారు.

ఎనిమిది సంవత్సరముల వయస్సులోనే, శ్రీ బి. వి. నరసింహ స్వామి గారి ప్రేరణతో శ్రీ సాయినాథుని ఆశ్రయము పొందిన 80 సం॥ల వయస్సు గల సాయి అంకిత భక్తురాలు పూలమ్మగా ప్రసిద్ధి చెందిన మాతృశ్రీ చుండూరు కామేశ్వరమ్మగారు ది. 29-7-93న శ్రీ సాయినాథునిలో సాయుజ్యము చెందుటకు కొలది రోజుల ముందు అనగా ది. 20-7-93న ఆఖరిసారిగా వారితో కలసి మాటాడునప్పుడు "మహా విష్ణువైన సాయబాబా మనకు అండగా ఉన్నాడు. ఇక నీవు మంత్రాలు, తాయెత్తులు వంటివి కాని, ఎవరిని గాని ఆశ్రయించవద్దు" అని చెప్పిరి. ఆ మాతృమూర్తి నాకు నిచ్చిన చివరి సందేశమిదియే.

శ్రీ ఎక్కిరాల భరద్వాజగారు, పరిపూర్ణుడైన మహనీయుడు దొరకవలె ననియు, ఆయన కృపకు అర్హులము కావలెననియు, పూర్వజన్మ సంస్కారము నకు అనుగుణమైన సాధనమార్గము లభించవలెననియు అన్వేషణ ప్రారంభించిరి. ఒకప్పుడు పూణెలోని శ్రీ గుళవణి మహారాజ్ అను యోగి పుంగవుని ఆచార్యులవారు దర్శించినపుడు "సాయిబాబా విషయములో అట్టి సందేహము అవసరము లేదనియు, ఆయన సాక్షాత్ దత్తాత్రేయావతారమనియు సమాధి చెందిన పిమ్మట కూడ ఎందఱికో భౌతికముగా దర్శనమిస్తూ. ఆయన ఉద్ధరిస్తున్నాడనియు నీవు నడుస్తున్న బాట మంచిది కాబట్టి ఆ మార్గానే వెళ్ళుము" అని చెప్పి వారి సందేహమును తీర్చారు ఒకసారి ఆచార్యులవారు గురుచరిత్ర పారాయణ చేసిన నాటి రాత్రి స్వప్నములో బాబా కనుపించి "నీవు గురువు దొరకలేదని ఎందుకు బాధపడతావు. నేనున్నాను కదా !" అని ముమ్మారు పలికారు అని వారి అనుభవమును తెలిపిరి. ఇప్పుడు కూడ సాయి బాబానే సద్గురువుగా ఆశ్రయించవచ్చునని, యితరులను ఆశ్రయించవలసిన పనిలేదని ఒక సందర్భములో రచయితతో చెప్పిరి.

"నన్ను నమ్ముకొని నాకు శరణాగతి చెంది సర్వము నాకు సమర్పించి, నీకు ఏమి - ఏమి కావాలో నన్ను అడిగి తీసికొనుచున్నచో, నీ చేత ఏ - ఏ పనులు సేవ చేయించాలని ఆశించుదునో అవి చేయించుకొందును. నా సేవలోనే నీకు ఆనందముంది. అదే హాయి ఇంకొక విధముగా పొందలేవు" అని బాబా తనకు స్వప్నములో ఆదేశమిచ్చారని "ఏమి నిన్నుపేక్షింతునా?" అను "సాయి తత్త్వ" పత్రికా సంపాదకులు శ్రీ బాపట్ల వేంకట పార్థసారథిగారు ది. 5-9-93న రచయితతో చెప్పినారు. మఱియు బాబా సార్వభౌముడే. "భువి హాయి దాయి" పరిపూర్ణ ప్రేమ స్వరూపుడు" అని చెప్పారు.

"సాయి నేటికిని సజీవుడే. ఒక ఆకారము కోరి ధరించినప్పుడు సహజ రీతిని శరీరమునకు కలుగు అవస్థలన్నింటిని తాము కూడ అనుభవించినట్లు అగుపడి అనుభవించుట ఆదర్శ పురుష లక్షణము సాయి త్యజించినది భౌతిక శరీరము మాత్రమే బాబా నిర్యాణము చెందెననుట వట్టి భ్రమ సాయి సకల చరాచరగామి' అని సాయి అంకిత భక్తులు కీ॥ శే॥ వేమూరు వేంకటేశ్వర్లుగారు తాము వ్రాసిన "బాబా జీవిత చరిత్ర"లో తెలిపిరి.

శ్రీ సాయినాథుడు, తన అంకిత భక్తురాలు మాతాజీ కృష్ణప్రియ ద్వారా భక్తులకు ఇచ్చిన ఆదేశములలో ఈ క్రింది లీలలు రెండింటిని తెలుసుకొందము.

9-4-53న బాబా చెప్పినది "విశ్వాసము గల వారికి ఒక్క నిదర్శనము. నడచుటకు ఒక్క మార్గము. తరించుటకు ఒక నామము" అని చెప్పిరి.

23-4-53న బాబా చెప్పినది "భక్తి కలదేని బాబా కలడు వారలు మల్లీలలు గాంచ గలరు. సంశయాత్ములకు అదియు, ఇదియు సున్న".

శ్రీ సాయిబాబా దేహధారిగా నున్నప్పుడు, సమాధి గతుడైన తరువాత షిరిడీ దర్శించిన శ్రీమతి మేనేజర్ "బాబా మన ఒక్కరి హృదయములోనే కాక ప్రతి వారి హృదయములోను నిండి యున్నారు. ఆయన సర్వాంతర్యామి. ఆయన ప్రతి నిమిషము రెండు చైతన్యాల కలయికగా ఉండేవారు. ఒకటి దేహపరమైన సాయిబాబాగాను, రెండవది విశ్వమంత వ్యాపించి ఉన్న అనంత

చైతన్యముగాను; ఆయనకు పరిమితులుండేవి కావు. ఇప్పుడు ఆయన గతించిరని చెప్పజాలము. ఆయన ఇప్పటికిని జీవించి యున్నారు" అని చెప్పిరి. ఇది వారు చెప్పిన విషయములోని సారాంశము మాత్రమే.

"సాయి ప్రేమ స్వరూపుడు. అందఱిలో ఉన్నాడు. సేవయే సాయి తత్త్వము. సాయి భక్తులెల్ల సైనికులవలె బాబాయొక్క సేవా మహా యజ్ఞములో పాల్గొనవలెను" అని ఆంధ్ర రాష్ట్ర సాయి సేవక సంఘ గౌరవాధ్యక్షులు శ్రీ సత్యపదానంద ప్రభుజీగారు తెలిపిరి.

వీరు హైదరాబాదుకు 35 కిలోమీటర్ల దూరములో గల కీసర గ్రామ సమీపమున 30 ఎకరముల స్థలములో "సాయిధామాశ్రమము"ను నెలకొల్పి, అనాధ బాలుర - వృద్ధుల - స్త్రీల సంక్షేమాదులు మఱియు వివిధ సేవా కార్యక్రమములు నిర్వహించుచున్నారు.

## సాయి మందిరములు – సేవా సంస్థలు – కర్తవ్యము

సాయి తత్త్వము ననుసరించి బీదల-అనాధల-రోగుల - అంగవికలుర వృద్ధుల సంక్షేమమునకు సేవా కార్యక్రమములు కూడ చేపట్టవలసి యున్నది. సమాజములోని మార్పులను అవసరములను గుర్తించి, ఆ సంస్థలు సేకరించు నిధుల నుండి "మానవ సేవయే మాధవ సేవ" యను గుర్తింపుతో ఎక్కువ మొత్తములు ఈ సేవా కార్యక్రమములకు కేటాయించవలెను.

నైతికమైన విలువల పునరుద్ధరణకు సాయి భక్తులైనవారు వారి కుటుంబములలోని స్త్రీలు గర్భము ధరించినది మొదలు బిడ్డకు జన్మనిచ్చు వఱకు ఆ గర్భిణీ స్త్రీలు సుఖ - శాంతులతో ఉండునట్లు సాయి ప్రేమను ఆ గర్భిణీ స్త్రీలకు అందించుచు, బోధించినచో జన్మనిచ్చిన శిశువులు దిన దినాభివృద్ధి చెందుచు బాల్యము నుండియే సత్సంగము, సత్త్వగుణము మున్నగునవి కలిగినవారై ఉత్తమ పౌరులు కాగలరు. సాయి సంస్థలెల్ల "శ్రీ షిరిడీ సాయి విద్యాలయములు" ప్రారంభించి, అనాధ పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పి నైతికమైన విలువల పునరుద్ధరణకు కృషి చేయవలెను.

ఆర్. గోపాలరావు, (ప్లాటు నెం. 15, ఇంటి నెం 7-204, కమలా నగర్, ఇ సి యల్ - X రోడ్డు, హైదరాబాద్ - పిన్ - 500 072) అను భక్తునకు ది. 16-9-94న వారి ధ్యానములో బాబా కనుపించి, ఈ సాయిబాబా చరిత్రము ద్వితీయ ముద్రణలో ఈ క్రింది "సందేశము" చేర్చుమని సలహా యిచ్చినట్లు ది. 20-9-94న వ్రాసిన లేఖలో రచయితకు తెలిపిరి.

ఆ సందేశమేమనగా "తల్లి తండ్రులు కఱవై రోడ్డుమీద బ్రతుకుచున్న అనాధ బాల బాలికలను చేరదీసి నా పేర నిర్మించు గుడులలో వారికి ఆశ్రయ మిచ్చినచో నా యజమాని (భగవంతుడు) పిల్లలకు నేను సేవ చేసుకొనే భాగ్యమును నాకు ప్రసాదించిన వారుగా మీరు అగుదురు" -సాయి

కనుక సర్వ జీవులలో సాయిని దర్శించి సేవ చేయుటయే సాయి సేవా సంస్థల కర్తవ్యము.

## సద్గురువును తెలుసుకోవాలి, లేకపోతే ఎందుకు వచ్చినట్లు ? పిడకలేరుకొనుటకా ?

బాపు సాహెబు జోగ్ "బాబా! నా సేవ పూర్తియైనట్లు గుర్తేమి?" అని ప్రశ్నించగా "నీవు పూర్వ బంధాలు విడచి, భిక్షువై నావలె జీవించ గలగడమే" అని బాబా అన్నారు. ఉపాసనీ బాబాను నాలుగు సంవత్సరములు షిరిడీలో ఉండుమని, తనంత వాడవు కాగలవని బాబా అన్నారు. కాని 3 1/2 సం॥లు మాత్రమే షిరిడీలో ఉండగలిగాడు ఉపాసనీ బాబా. సాఠెను బలవంతముగా షిరిడీ నుండి పంపవలసి వచ్చినది. సాయి సంస్థానమును ఏర్పఱచుటకు, అచట జరుగు అన్ని కార్యక్రమములు తన కనుసన్నలలో నిర్వహింపజేసిన రాధాకృష్ణమాయి చివరి దశలో ఆమెను ఎవరు దర్శించుటకు కూడ వీలులేక పోయినది. ఆమె చనిపోయిన తరువాత మూడు రోజులకు గాని తెలుసుకొనలేక పోయిరి.

దాసగణు తన ఉద్యోగమును మానుకొందునని చెప్పి మానకపోవుటచే గత్యంతరము లేని పరిస్థితి బాబా కల్పించినప్పుడే ఉద్యోగము మానుకొన్నాడు.

సారె ఒక మహిళ వద్దకు వెళ్ళి మాటాడుచు బలహీనతకు లోను కాబోవుచుండగా బాబా ద్వారము వద్ద కనబడి నీవు షిరిడీ వచ్చుట ఇందుకా ? అని గద్దించగా తన తప్పును తెలుసుకొన్నాడు. కర్మానుభవము తప్పదు. బాబా లీలలు అర్థము చేసుకొనుటకు మన శక్తి చాలదు.

మూలే శాస్త్రి, మేఘుల యొక్క కుల గర్వము, నానా సాహెబు చాందోర్కర్ విద్యా గర్వము, కార్టిన్ అధికార గర్వము, కుశాభావు తంత్ర విద్యాగర్వము, హరికనోబా ధన గర్వము, హాజీ యాత్రా గర్వము, సోమనాథ స్వామి సదాచార గర్వము, దాసగణు భక్తి గర్వము, తంబోలి శక్తి గర్వము బాబా తన లీలల ద్వారా తొలగించారు.

దాసగణు బాబా పాదతీర్థము త్రాగుటకు సందేహించాడు. అందు బాటులో నున్నను అనుభవించలేరు కొందఱు. సాయి యొకసారి ఉల్లిగడ్డలు తిని కక్కినప్పుడు అవి కందమూలాలైనవి. ఆ గురూచ్ఛిష్టమును, బాబా వారిస్తున్నా కుశాభావు తిన్నాడు. కనుక సద్గురువును తెలుసుకోవాలి. లేకపోతే ఎందుకు వచ్చినట్లు? పిడకలు ఏరుకోడానికా?" అని బాబా చెప్పినది అర్థము చేసుకొనవలెను.

## బాబా అభయ ప్రదానము

"సమాధి చెందినప్పటికి నా సమాధి నుండి నా యెముకలు మాటాడును. అవి మీకు ఆశ, నమ్మకమును కలిగించును. నేనే గాక నా సమాధి మాటాడును కదులును. మనస్ఫూర్తిగా శరణు జొచ్చిన వారితో మాటాడును. నేను మీ వద్ద యుండనేమో యని మీరాందోళన పడవద్దు నా యెముకలు మాటాడుచు మీ యోగక్షేమములు కనుగొనుచుండును. ఎల్లప్పుడు నన్నే జ్ఞప్తియందుంచు కొనుడు. నా యందే మనః పూర్వకముగను, హృదయ పూర్వకముగను నమ్మకముంచుడు. అప్పుడే మీరు మిక్కిలి మేలు పొందెదరు" అని బాబా అభయ ప్రదాన మొసంగిరి. ఈ అభయ ప్రదానమునే యేకాదశ సూత్రము లలో చూడవచ్చు.

సాయినాథుడు ఎప్పటివాడో కాదు. 75 సంవత్సరముల క్రిందటి వఱకు (1993వ సం॥నకు) అనగా 1918 వఱకు దేహధారిగా మన మధ్య సంచరించి, తరువాత సర్వగతుడై మన యందఱిలో, సర్వ ప్రాణులలో - అంతటా - అన్నిటా - తానై యున్న యిప్పటి వాడే సాయిబాబా యని ప్రతి సాయి భక్తుడు గుర్తించవలెను. సాయిని ప్రత్యక్షముగా సేవించుకొనుటకు ఇప్పుడు వారు లేరు అని తలచరాదు. ఈ విశ్వమంతా తానైన సాయికి మరణమే లేదు. బాబా దేహత్యాగము చేసిన రాత్రి గం. 12–30 ని॥లకు శ్రీమతి ప్రధాన్‌కు బాబా కలలో కనుపించి "మహాత్ములు చనిపోరు, సమాధి అవుతారు"అని చెప్పారు. అంతకుముందే "దామ్యా" అను భక్తునితో నాకు మరణమెక్కడిది? అని బాబా అన్నారు. బాబా తన శిష్యునిగా ఎవరిని ప్రకటించలేదు. తన ప్రతినిధిగా, వారసునిగా ఎవరిని నియమించలేదు. సమాధిగతుడై కూడ తానే తన అవతార కార్యమును కొనసాగించుచున్నారు. సాయినాథుని సర్వ వ్యాపకత్వమును గుర్తించలేని భక్తులకు సాయినాథుడు సద్గురువుగా తన కార్యక్రమమును షిరిడీనుండి ఇప్పటికీ, ఎప్పటికీ కొనసాగించుటకు ఈ క్రింది సుస్థిరమైన ఏర్పాట్లు షిరిడీలో చేసి యుండుటను ఈ చరిత్ర ద్వారా భక్తులు గమనించవచ్చు.

1) పైకి వెళ్ళుటకు (అనగా ఆత్మజ్ఞానము పొందుటకు) షిరిడీ నుండి కూడ మార్గము కలదని మార్గ దర్శకునిగా (గురువుగా) తాను సిద్ధముగా ఉన్నానని చెప్పిరి.

2) 1908 గురుపూర్ణిమ రోజున ధునివద్ద స్తంభాన్ని పూజించు కొనుమని చెప్పి, తాను సద్గురువుగా పూజ లందుకొని అనుగ్రహించి ఆచరింప చేయుచున్నారు.

3) శిష్యులకు గురు పాదుకలే ముఖ్యమని స్వహస్తములతో స్పృశించ బడిన పాదుకలను తన ప్రతినిధిగా గురు స్థానములో 1912 లో స్థాపింప చేసినారు.

4) ధునిని ఏర్పాటు చేసి సర్వకాల సర్వావస్థలలో తన శిష్యుల ఈతి - బాధలు తీర్చుటకు, ఆత్మజ్ఞానమును పొందుటకు 'ఊది'ని ప్రసాదించిరి.

5) మనలోని జ్యోతిని దర్శించు కొనుటకు లెండితోటలో నంద దీపమును శాశ్వతముగా స్థిరపరచిరి.

6) తన చరిత్రను తానే వ్రాసుకొని తనబోధ నిరంతరము భక్తులకు అందునట్లు చేసి మన సద్గురువుగా తన చరిత్రనే అందించినారు.

7) ఎల్లవేళల గురువును గుర్తునందుంచు కొనుటే శిష్యుని కర్తవ్యమని గుర్తింపు చేయుచు, నాలుగు వేళల హారతులు జరిపించు చున్నారు.

8) తనకు, తన పటము (విగ్రహము) నకు భేదము లేదని నిరూపించారు.

9) తానే స్వయముగా చెప్పి సమాధి మందిరమును నిర్మింప జేసుకొని అందులో తన పవిత్రదేహము నుంచి దానిని కేంద్ర స్థానముగా (రిమోట్ కంట్రోల్)తన భక్తులు క్షేమమును బాబా చూచుచున్నారు.

బాబా యందు పూర్తి విశ్వాసముతో బాబా ఏర్పాటు చేసిన శాశ్వతమైన పై మార్గముల పయనించు భక్తులకు బాబా దేహధారిగా లేడను ప్రశ్నలేదు. (ఇంకను వివరములకు ఈ రచయితచే వ్రాయబడిన సద్గురుబోధ-శ్రీ షిరిడీ సాయిబాబా" అనే గ్రంథములో చూడవచ్చు.)

కనుక స్వామి దినచర్యలు సదా మనము చేసుకొనుచు ఆచరణలో పెట్టి తరించవలెను. శ్రీ షిరిడీ సాయిబాబా దేహధారిగా వారి దినచర్యలు భక్తులకు దారి చూపు పూలబాటలు. "నేనెవరిని మధ్యలో విడువను. చివరి వఱకు గమ్యం చేరుస్తాను" అనెడి బాబా అభయ ప్రదానమును గుర్తుంచుకొని మన సర్వస్వమును ఆ సద్గురు సాయినాథునికే యర్పింతము.

సాయినాథుని జీవిత కాలములో కంటె ఇప్పుడు శ్రీవారి భక్తులు లెక్కకు మిక్కిలి కోట్ల సంఖ్యలో నున్నారు. అనంతములైన వారి లీలలను బాబా ఇప్పుడును చూపుచునే యున్నారు. అభయప్రదానము చేయుచునే యున్నారు.

సత్యం - జ్ఞానం - అనంతం - బ్రహ్మ

ఇదియే సాయి స్వరూపము. ప్రపంచ మానవులకు సాయి తత్త్వమే శరణ్యము.

ఓం శ్రీ సాయి నాథాయ నమః

# సాయిబాబా చరిత్రము

## షష్ఠాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# సాయి చరిత్ర పారాయణ - సశరీరముగ దర్శన మొసంగుట

అన్ని మత గ్రంథముల సారమైన శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత చరిత్ర యీ కలియుగ మానవులను సంరక్షించు పవిత్ర గ్రంథము శ్రీ సాయినాథుడు 'విష్ణు సహస్ర నామము,' 'గురు చరిత్ర' మొదలగునవి పారాయణ చేయుమని కొందరికి చెప్పినారు. కుశాభావుచే గురు చరిత్ర 108 సార్లు పారాయణ చేయించారు. ప్రతి వారికి అర్థమగు సాయి చరిత్ర అర్థవంతముగా పారాయణ చేయవచ్చు. సాయి చరిత్ర పారాయణము ఇహమందలి కోరికలు సంప్రాప్తింప జేయుటయే కాక పరమందలి సుఖములను కూడ ప్రసాదించి, మనము కోరక పోయినను మనకవసరమగు మేలును సమకూర్చగలదు. అట్టి సాయిబాబా జీవిత చరిత్ర ప్రత్యేకతను గూర్చి వివరముగా తెలుసుకొందము.

## సాయిబాబా జీవిత చరిత్ర – వ్రాయుటకు కారణము

సద్గురు శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత చరిత్రను శ్రీ గోవింద రఘునాథ్ ఉరఫ్ అన్నా సాహెబు దబోల్కర్ (హేమాడ్ పంతు) మరాటి భాషలో వ్రాసినారు. ఆ గ్రంథము 53 అధ్యాయములుగా వ్రాయబడినది. ఈ చరిత్రను తెలుగులోనికి అనువదించి, ఆంధ్రప్రదేశ్‌లోని భక్తులు బాబా లీలలు తెలుసు కొనుటకు అవకాశమిచ్చిన ఘనత కీ॥ శే॥ శ్రీ ప్రత్తి నారాయణరావు గారికి దక్కినది. బాబా చరిత్ర అనగా బాబా తన భక్తులకు ప్రసాదించిన అనుభూతు లతో, అభయ ప్రదానములతో, చిన్న చిన్న నీతి కథలతో కూడి, ఆధ్యాత్మిక

శక్తిని ప్రసాదించి, సత్కర్మాచరణ ఆచరించి చూపిన లీలలే బాబా చరిత్ర. హేమాడ్ పంతు బాబా దేహధారిగా ఉండగా స్వయముగా సాయినాథుని ఆశీస్సులు పొంది చరిత్ర వ్రాయుట ప్రారంభించినారు. "బాబా లీలలు, చర్యలు మనస్సునకు ఆనందము కలుగజేయునని, అవి భక్తులకు బోధలుగా ఉపకరించునని, తుదకు పాపములు పోగొట్టునని" హేమాడ్ పంతు భావించి బాబా యొక్క పవిత్ర జీవితమును, వారిబోధలను వ్రాయుటకు ప్రారంభించినట్లు హేమాడ్ పంతు తెలిపియున్నారు. "బాబా నీతి బోధకములగు కథలు శాంతిని సమకూర్చును. సద్బుద్ధిని ప్రసాదించును. బాబా బోధలు విని, వానిని మననము చేసినచో భక్తులు వాంఛించునవి అనగా బ్రహ్మైక్య యోగము, అష్టాంగ యోగ ప్రావీణ్యము, ధ్యానానందము పొందెదరని" కూడ హేమాడ్ పంతు చెప్పి యున్నారు. సాయి చరిత్ర వ్రాయుటకు తాను నిమిత్త మాత్రుడనేనని, బాబా కటాక్షము వలన తనకు సిద్ధించినదని కూడ చెప్పిరి.

1910లో ఒకరోజు బాబా మసీదులో తిరుగలిలో గోధుమలు పోసి స్వయముగా విసరుచుండగా అచట నున్న భక్తులలో 4 గురు స్త్రీలు బాబాను లేపి తామె ఆ గోధుమలు విసరి, ఆ విసరిన గోధుమ పిండి బాబాకు అవసరము లేదని ఆ నలుగురు స్త్రీలే పంచుకొనుచుండగా బాబా వారిని మందలించి, వారి చేతనే ఆ గోధుమ పిండిని ఊరి పొలిమేరలో చల్లించిరి. అట్లు చల్లించుట-కలరా గ్రామములోనికి రానీయకుండుట యని భక్తులు భావించిరి. హేమాడ్ పంతు ఈ లీలను చూచిన తరువాత బాబా జీవిత చరిత్ర వ్రాయుటకు సంకల్పించి 1917వ సంవత్సరము నుండి వ్రాయుట ప్రారంభించి, 1929 నాటికి గ్రంథమును పూర్తికావించిరి

"హేమాడ్ పంతు మీ చరిత్ర వ్రాయుటకు కోరుచున్నాడు, మీ అనుమతి కావలెనని" శ్యామా బాబాను కోరినప్పుడు, హేమాడ్ పంతును బాబా ఊది ప్రసాదముతో ఆశీర్వదించి "వాడు నిమిత్తమాత్రుడే. ముఖ్య విషయములు టూకీగా వ్రాయుమనుము. నా జీవిత చరిత్రను నేనే వ్రాసుకొని నా భక్తుల కోరికలు నెరవేర్చెదను. వాని అహంకారము పూర్తిగా పడిపోయిన పిమ్మట, అది మచ్చుకైన లేనప్పుడు, నేను వాని మనస్సులో ప్రవేశించి నా చరిత్రను నేనే వ్రాసుకొందును. నా కథలు, బోధలు విన్న భక్తులకు భక్తి

విశ్వాసములు కుదురును. వారు ఆత్మసాక్షాత్కారము పొందెదరు" అని హేమాడ్ పంతును గురించి శ్యామాతో బాబా చెప్పిరి. 40 రోజులలో తెలుగు లోనికి అనువదించిన శ్రీ ప్రత్తి నారాయణరావుగారు దీనిని బాబాయే వ్రాసు కొన్నట్లు తెలిపియున్నారు "జీవిత పరమావధి యగు ఆత్మసాక్షాత్కారమునకు ఈ గ్రంథము తోడ్పడును కాన దీనిని శ్రద్ధగా పారాయణము చేసి భగవంతుని భక్తి - ప్రేమలు సంపాదింపుడని" ప్రత్తి నారాయణరావుగారు భక్తులకు విజ్ఞప్తి చేసియున్నారు.

## సాయిబాబా జీవిత చరిత్ర ఎందుకు పారాయణ చేయవలెను ?

సాయి చరిత్రకు ఎంతో ప్రాముఖ్యమున్నది. యాంత్రిక జీవితములో పయనించు మనము, స్థిర చిత్తముతో నియమముగా సాయి చరిత్ర పారాయణ చేయుటవలన మనస్సుకు ఏకాగ్రత కుదిరి, ఆధ్యాత్మిక చింతనకు దోహదకారి యై ప్రశాంతత పొందెదరని పారాయణ నియమము ఏర్పఱచబడినది. ఈ చరిత్రలో ప్రతి అధ్యాయములో బాబా లీలలు, బోధలు మహిమాన్వితమైనవి. సాయి చరిత్ర చదువుట ద్వారా, సాయి చెప్పిన నీతి కథలు వినుట ద్వారా సాయి భక్తుల సందేహములు నివృత్తి యగుటయే కాక, మనస్సు నిర్మలము చెంది, సన్మార్గులగుట, సుఖ - సంతోషములు పొందుట జరుగును. మనము ఆత్మజ్ఞానము పొందుటకు కాంతిమంతములైన మణులిందులో కలవు. అందుకే బాబా "నా లీలలు శ్రద్ధాభక్తులతో ఎవరు వినెదరో వారికి ప్రపంచమందు మమత క్షీణించును. బలమైన భక్తి - ప్రేమ తరంగములు లేచును. ఎవరైతే నా లీలాంబుధిలో మునిగెదరో వారికి జ్ఞానరత్నములు లభించును. నా కథలే వినినచో సర్వ రోగములు నివారింపబడును. గర్వాహంకారములు నిష్క్రమించును. మనఃపూర్వకమైన నమ్మకము కలుగును" అని చెప్పినారు. సాయినాథుడు చెప్పినట్లుగా ఇప్పుడును జరుగుచుండుట ప్రత్యక్ష నిదర్శన ముగా మనము చూచుచున్నాము.

సాయిబాబా జీవిత చరిత్రయే మనకు సద్గురువు. మన సమస్యలకు మార్గము చూపునది బాబా జీవిత చరిత్రయే. సాయి భక్తులకు సమస్యల

వచ్చినప్పుడు బాబా జీవిత చరిత్ర తీసికొని తెఱచినచో, ఆ తెఱచిన పుటలో ఎందఱికో సమాధానములు దొరకుట జరుగుచున్నది. ఎవరైనను సాయి భక్తులు వారి కష్టములను పెద్దలైన సాయి అంకిత భక్తులకు చెప్పుకొన్నప్పుడు "మీరు సాయిబాబా జీవిత చరిత్ర పారాయణ చేయుడు. మీ కష్టములు తీరును" అని చెప్పుట మన యందఱి అనుభవములోనిదే.

సాయిబాబా జీవిత చరిత్ర ఎన్నిసార్లు చదివినను, ఇది తెలిసినదే అని అనిపించుట కాని, విసుగు కలుగుట కాని యుండదు. సాయి చరిత్ర చదువుట వలన మొదటిసారి కంటె రెండవసారి, రెండవసారి కంటె - మూడవసారి క్రొత్త క్రొత్త విషయములు గోచరించును మనస్సును వికాసపఱచును. ఎన్ని సార్లు చదివినను తనివి తీరదని, పూర్తి సారము గ్రహించలేమని అనిపించు చున్నది. ఏ కొద్దిపాటి చదువున్నవారు కూడ ఇతరుల సాయము లేకయే యీ సాయి చరిత్ర చదివి అర్థము చేసుకొనగలరు. చదువురానివారు సహితము ఇతరులు బాబా జీవిత చరిత్ర చదువుచున్నప్పుడు వివరణ కోరకుండగనే అర్థము చేసుకొనగలరు. బాబా చరిత్రను ఆధునిక గురుచరిత్రగా హేమాడ్ పంతు అభివర్ణించుట గమనించదగినది.

## సాయి చరిత్ర ఎట్లు పారాయణ చేయాలి ?

బాబా చరిత్ర పుస్తకములో వ్రాయబడియున్న విధానము ననుసరించి పారాయణ చేయవలెను. అయితే ఆరోజు చదువవలసిన అధ్యాయము ఎప్పటికి పూర్తి చేయగలమా అని పుటలు చూచుకొనుచు పారాయణ చేయుచుందుము పారాయణ చేయుట చాలా అవసరము. కాని అర్థవంతముగా పరాయణముతో (తత్పరత్వముతో) పారాయణ చేయుట మంచిది. ఆయా అధ్యాయములలో విషయములు, లీలలు అర్థము చేసుకొనుచు పారాయణ చేయవలెను. ప్ర మహిమ వెనుక చెప్పేదానిని అర్థము చేసుకొనవలెను. పఠన సమయము బాబా మనతో చెప్పుచున్నట్లు భావన పొందవలెను.

## పారాయణ ఫలితము - పెద్దల సూక్తులు

శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టారుగారిని సాయిబాబా మందిర నిర్మాణవ

గురించి అడిగినప్పుడు "శ్రీ సాయినాథుని జీవిత చరిత్ర 40రోజులు పారాయణ చేయండి. మీ కోరిక సాయియే తీరుస్తారు" అని చెప్పారు మరియు "సాయి చరిత్ర పారాయణ వలన, చింతన వలన అన్ని రూపాలు భగవంతునివే నన్న గుర్తింపు ఎల్లప్పుడు ఉండును. గురువుగా బోధించును. మానవ జాతికి ఎదురగుచున్న సమస్యలన్నింటికి పరిష్కారము ఈ చరిత్రలో లభిస్తుంది. ఈ చరిత్ర పారాయణ చేసిన తరువాత చేయు పూజలు, భజనలు, జపములు ప్రేమతో, భక్తితో చేయబడి శక్తిమంతములగును" అని సాయి లీలామృతము లోని ఉపోద్ఘాతములో శ్రీ మాష్టారుగారు చెప్పియున్నారు. ఒకసారి కీ॥ శే॥ చోడవరపు సాంబమూర్తి గారిని హైదరాబాదులో వారి ఇంటి వద్ద కలిసి నప్పుడు వారి వద్ద సాయిబాబా జీవిత చరిత్రలుంటే (ఎచ్చట దొరకనప్పుడు) ఒకటి ఈయుమని కోరగా "ఆపత్తులలో, కష్టములలో ఉండి వాచ్చేవారు పారాయణ చేయుటకు ఇచ్చుటకు కొద్దిగానే యున్నవి" అని అన్నారు. అనగా సాయి చరిత్ర పారాయణయే సర్వ ఆపత్తులను నివారణ చేయగలదని తెలియ చెప్పిరి. ఇట్లే ఒకసారి కీ॥ శే॥ ఆదిపూడి మోహనరావుగారు మాటల సందర్భములో "బాబా చరిత్ర భక్తి శ్రద్ధలతో రెండు-మూడు పారాయణలు చేయుచుండగనే తలచిన కోర్కెలు తీరుచున్నవని, మంచి ఫలితములు కలుగుచున్నవ"ని వారు చెప్పారు.

మాతృశ్రీ చుండూరు కామేశ్వరమ్మగారు (పూలమ్మ) నిత్యము ఆమెను దర్శించు సాయి భక్తులకు వారి సమస్యలు తీరుటకు సాయిబాబా జీవిత చరిత్ర పారాయణ చేయుమని, సాయి సత్యవ్రతములు చేయుమని చెప్పుచు నుండెడి వారు. "సాయి లీలలు అందరికి బాగుగా తెలియాలి. సమాధి తరువాత కూడ బాబా ఉన్నాడు. ఆ లీలలు తెలియాలి, అటువంటి పుస్తకాలు కావాలి" అని శ్రీ శివనేశన్ స్వామివారు అన్నారు. ఈ తెలిపిన విషయములన్నియు స్వయముగా రచయిత విని వ్రాసినవే. చాలామంది సాయి భక్తులు వారి కోరికలు తీరుటకు సాయిబాబా జీవిత చరిత్రను నియమ ప్రకారము,నిర్ణయించు కొన్న సప్తాహ పారాయణము చేసి ఫలితములు పొందుట జరుగుచున్నది.

ఈ విధముగనే తమ తమ అభీష్టములను తీర్చుకొనుటకు తమ యిష్ట మైన పదార్థములను నియమముగా విడచి పెట్టుటయు జరుగుచున్నది. గోవా

పెద్ద మనిషికి బాబా ఫకీరు రూపములో వచ్చి అతని పని పూర్తి అగుటకు "షిరిడీ సాయి యను ఔలియా యున్నారు, వారికి మ్రొక్కుము, నీకు ప్రియమైన యాహారమును విడువుము. నీ మనస్సులో సాయి దర్శనము చేయువఱకు ప్రియమైన యాహారము తిననని మ్రొక్కుకొనెను" అని చెప్పిరి. ఆ పెద్ద మనిషి "బాబా ! నా ద్రవ్యము దొరికిన పిమ్మట, మీ దర్శనము చేసినపిమ్మట, నేనన్నము తినెదను" అని మ్రొక్కుకొనెను. 15 ధినములలో పోయిన తన ధనము దొరకగానే షిరిడీ వచ్చి బాబాను దర్శించుకొని తన మ్రొక్కు తీర్చుకొన్నాడు.

ఆల్ ఇండియా సాయి సమాజ్ అధ్యక్షులు శ్రీ బి. వి. నరసింహస్వామి గారు సాయినాథుని అనుగ్రహముతో సాయిని సేవించిన అప్పటి భక్తులను కలసి సాయిబాబా లీలను సేకరించి వానిని అంగ్ల భాషలో గ్రంథరూపమున మనకందించారు. శ్రీ బాపట్ల హనుమంతరావుగారు వానిని తెలుగులో "ఏమి నిన్ను పేక్షింతునా"అను పుస్తకము ద్వారా అనువదించి యున్నారు. ఆ విధముగనే శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాష్టారుగారు అప్పటి భక్తులను, మఱికొంతఱిని కలసి వారి నుండి సేకరించిన సమాచారముతో, ప్రస్తుత భక్తుల అనుభవములతో పుస్తకముల ద్వారా ప్రచురించియున్నారు. పై పుస్తకములలో సాయి లీలలు మఱెన్నో తెలుసుకొనవచ్చు. ప్రస్తుత కాలమున శ్రీ సాయినాథుని శరత్‌బాబుగారు ఆనాటి యింకా నిగూఢమైన సమాచారములను సేకరించియు, ఇతర గ్రంథముల నుండి తెలుగులోనికి అనువదించియు, వివిధ గ్రంథముల రూపముగను, సంచికలుగను ప్రచురించుచున్నారు. ఇవి సాయి భక్తులకు ఎంతయో ఉపయోగపడగలవు.

షిరిడీలోని చావడిలో ఇప్పుడు సాయిబాబా జీవిత చరిత్రలు (మరాటి) ఉంచి, భక్తులు పారాయణ చేసుకొనుటకు ఏర్పాటు చేశారు. కనుక సాయి భక్తులు సాయినాథుని జీవిత చరిత్రను నిత్య పారాయణ చేయుట మంచిది.

## సాయినాథ సగుణోపాసన - హారతులు

బాబా జీవిత చరిత్ర వలెనే నాలుగు వేళల బాబాకు ఇచ్చు హారతులు

కూడ బాబాయే స్వయముగా తమ ఆశీర్వాదముచే వ్రాయించుకొన్నారు. కృష్ణారావు జోగేశ్వరు భీష్మ శిరస్సుపై బాబా తన చేయి యుంచి అశీర్వదించగనే అతనికి దివ్యమైన పారవశ్యము కలిగినది. "ప లడ్డులు ఈయుమ"ని బాబా అతనిని కోరిరి. మఱురోజు భీష్మ 5 పాటలు వ్రాసి బాబా ముందుంచారు. ఆ పాటలను భీష్మచే పాడించి మఱల అతని తలపై చేయిపెట్టి ఆశీర్వదించగనే అతనికి స్ఫూర్తి కలిగి పాటలు ధారగా వ్రాసి బాబాకు వినిపించారు భీష్మ. అంటే బాబాయే వ్రాసుకొన్నారు. దాసగణు మహారాజ్ కొన్ని పాటలు, శ్రీ ఉపాసనీ బాబా కొన్ని పాటలు సంస్కృతములోను వ్రాశారు. మాధవరావు అడ్కర్ "ఆరతి సాయిబాబా"అనే పాట వ్రాశారు. నానాసాహెబు చాందోర్కర్ ఈ పాటలు పరిశీలించి సరిగా యున్నవంటేనే హారతులలో చేర్చేవారు. ఈ హారతులు సంస్కృతము. మరాటి, హిందీ భాషలలో నున్నవి. ఈ హారతి పాటలన్నింటిని "సాయినాథుని సగుణోపాసన"అనెడి పుస్తకరూపముగా దాదా సాహెబు ఖావర్డే తన సొంత ఖర్చుతో ఆనాడే ముద్రించారు. 1923 తరువాత సాయి సంస్థానము మఱల ముద్రించినది. సాయి భక్తులకు ఈ హారతులు అత్యంత ప్రీతి పాత్రమైనవి.

## సత్సంగము

"నాపై నీ దృష్టి నిలిపిన, నీపై నా దృష్టి నిలుపుదును" అని బాబా అభయ ప్రదానమిచ్చారు. అంటే బాబా దృష్టి అందఱిపై ఉంటుంది. మన దృష్టి బాబాపై ఉంచినప్పుడే బాబా దృష్టి మనపై ఉన్నదని తెలుసుకొనగలుగుదుము. మన దృష్టిని బాబాపై స్థిరముగా ఉంచినప్పుడు బాబా దృష్టి వలన మనము పోషించబడుదుము పాలించబడుదుము. సంతుష్టులగుదుము. కనుక నిరంతరము ఆ స్వామి యందు దృష్టిని నిలుపుటకు ఈ సత్సంగములు మనకు ఉపయోగపడుచున్నవి.

శ్రీ షిరిడీ సాయి విధానములో సత్సంగమునకు ప్రత్యేక స్థానమున్నది. బాబా తన చుట్టు భక్తులు పరివేష్టించి యున్నప్పుడు సందర్భానుసారముగా వారితో బాబా ముచ్చటించుచు చిన్న చిన్న కథల ద్వారా నీతి బోధ చేయుట జరిగినది. పదిమంది ఒకచోట కలసి, హాయిగా, సమిష్టిగా కూర్చొని బాబా

ము చ్ఛటించిన భగవద్విషయములతో కూడిన లీలలు మననము చేసుకొనుచు, సంకీర్తన చేయుచు సద్గురు సంబంధమైన ఒకరి అనుభూతులను ఇంకొకరు తెలుసుకొనుచు ఆనందించు సాధనయే సత్సంగము అనబడును.

ఈనాడు షిరిడీ క్షేత్రమును దర్శించునప్పుడు ఇతర క్షేత్రములలో వలె కాక అచ్చట భక్తులందఱు ఎక్కువ సమయము మసీదులోనో, ద్వారకామాయి లోనో గడుపుచు బాబా లీలలు చెప్పుకొనుటలోనే ఆనందిస్తారుకాని వ్యర్థముగా కాలము గడుపరు. బాబా లీలలతో కూడిన చరిత్ర పారాయణ చేస్తూ ఉంటారు. కనుక ఎచ్చటనైనను, బాబా లీలలు చెప్పుకొనుచు ఆనందించుటయే సత్సంగము.

కనుక షిరిడీ సాయి విధానములో ఈ సత్సంగ విధానమునకు ఉన్న ప్రాధాన్యత గుర్తించిన మనము కూడ సక్రమముగా ఈ సత్సంగములను నిర్వహించుచు జీవితములను చరితార్థము చేసుకొందము.

## సత్సంగమెట్లు నిర్వహించవలె ?

సత్సంగములో మూడు ముఖ్య భాగములున్నవి. 1) పూజ 2) చరిత్ర పఠనము 3) భజన వీని నిర్వహణకు సమయమును విభజించి ఆ సమయములో అవి జరుగునట్లు చూడవలెను. ముమ్మందుగా ఓంకారమునో ప్రారంభించవలెను. షోడశోపచార విధులతో పూజ జరుపవలెను. బాబా అష్టోత్తరనామములు చెప్పునప్పుడు అచట ఉన్న భక్తులందఱు ఆనామములను పలుకవలెను. పూజ పూర్తికాగానే బాబా జీవిత చరిత్రలో ఒక అధ్యాయము నైనను అచట చేరిన భక్తులకు అర్థమగురీతిలో చదివి వినిపించవలెను. అడిగిన వారి సందేహములు తీర్చవలెను. సమయమునుబట్టి భక్తులు వారి వారి అభిప్రాయములను, అనుభూతులను అందఱికి చెప్పుచు బాబా లీలలకు ఆనందించవలెను. సత్సంగములో బాబాను గుఱించి తెలుసుకొనుట అత్యంత ప్రధానము.

తరువాత బాబా లీలలతో, అభయ ప్రదానములతో కూడిన చిన్న చిన్న పాటలను, అందఱికి అర్థమగు చిన్న చిన్న చరణములతో కూడిన పాటలు

కొన్ని ఎన్నుకొని ప్రతి సత్సంగములోను ఆ పాటలను పాడుట మంచిది. ఆర్తికిప్రాధాన్యత ఈయవలెను. తరువాత హారతి యిచ్చి, రెండు నిముషముల పాటు ధ్యానము చేసి శాంతి మంత్రమును చదివి, విభూతిధారణ చేసి ప్రసాద వినియోగము అయిన తరువాత బాబా లీలలు చెప్పుకొనుచు గృహములకు వెళ్ళవలెను.

మానవుల మనుగడకు సుస్థిరతలేని యీ జీవిత సమయములో మనము ఈ సత్సంగములను నిర్వహించుకొనుచు, నిస్సంగులమై, నిర్మోహత్వముతో జీవన్ముక్తులమగుటకు ప్రయత్నింపవలసి యున్నది.

## నామ సంకీర్తన - సప్తాహములు

ప్రతిచోట నామ సంకీర్తన జరుగుచున్నది. బాబా, నామ సంకీర్తనకు అధికముగా ప్రాధాన్యత యిచ్చెడివారు. భక్తులకు నామ సంకీర్తన చేయుమని బాబా ఎల్లప్పుడు చెప్పెడివారు. షిరిడీలో 1913 నుండి ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పాడ్యమి నుండి నామ సప్తాహము రాధాకృష్ణమాయి కృషితో ప్రారంభమై బాబా సముఖములో జరుగుచుండెడిది. నామ సప్తాహమనగా ఏడు రోజులు రాత్రింబవళ్ళు భగవన్నామస్మరణ చేయుట. ఒకప్పుడు బాబా దాసగణు మహారాజును నామ సప్తాహము చేయుమనిరి. సప్తాహము ముగియు నాడు విఠల్ దర్శనము కలుగునని వాగ్దానమిచ్చినచో నామ సప్తాహమును చేసెదనని దాసగణు చెప్పెను. భక్తుడు భక్తి - ప్రేమలతో నున్న తప్పక విఠలుడు దర్శనమిచ్చునని, విఠలుని పండరి,శ్రీకృష్ణుని ద్వారక యీషిరిడీలోనే యున్నవని, భక్తి-ప్రేమలతో కీర్తించిన విఠలుడు ఇక్కడనే దర్శనమిచ్చునని" బాబా చెప్పిరి. సప్తాహము పూర్తియైన తరువాత విఠలుడు పటరూపమున దర్శనమిచ్చిరి. 1914లో "రేగే"అను భక్తుడు "అవస్తే" అను తన మిత్రునితో షిరిడీ వస్తూ రైలులో రాత్రి యంతయు భజన చేశారు. షిరిడీలో బాబాను దర్శించుకోగానే బాబా రేగేను చూపుచు "ఇతడు రాత్రి యంతయు నన్ను కన్ను మూయనీయలేదు. నా పడకచుట్టు "బాబా-బాబా" అని అన్న కేకలే అని అన్నారు. కనుక మనము చేయు నామము భక్తి-ప్రేమలతో ఉండవలెననుట గమనించవలెను. ది. 10-12-1981లో షిరిడీలో అనుభూతి పొంది

"ఓం సాయి శ్రీ సాయి జయ జయ సాయి" అను నామ సంకీర్తన సప్తాహములు దేశ-విదేశములలో నిర్వహించుచున్నట్లు ఆంధ్ర రాష్ట్ర సాయి సేవక సంఘ అధ్యక్షులు శ్రీ డి. శంకరయ్యగారు స్వయముగా నాతో చెప్పియున్నారు.

## సమాధి అనంతరము సాయి సశరీర దర్శనము మఱియు అభయ ప్రదానములు

బాబా, సమాధి చెందిన తరువాత ప్రత్యక్ష నిదర్శనములు ఎందఱికో ఇచ్చుచున్నారు. వానిలో కొన్ని తెలుసుకొందము.

1918 నవంబరు 13న కాకా మహాజనికి సాయి స్వప్నములో కనుపించి "నేను సమాధి చెంది ఒక నెల అయినది. మానసిక పూజ చేయుము" అని చెప్పిరి.

కె.కె. ప్రధాన్‌కి అనేక పర్యాయములు గురు స్థానములో భౌతికముగా దర్శనమిచ్చిరి.

సాయి మహాసమాధి చెందిన తరువాత హర్దా నివాసి సదాశివ్ దుఃఖించారు. ఒకరోజు బాబా అతనికి స్వప్నములో దర్శనమిచ్చి "ఇప్పుడు నేను ఖేడాలో ఉన్నాను. వచ్చి దర్శించుకో" అని అన్నారు. ఖేడాలో ఉన్న ధునివాలా బాబా అనే మహాత్ముని సదాశివ్ దర్శించగానే ధునివాలా బాబా స్థానములో కొద్ది నిమిషముల పాటు సాయిబాబాగా దర్శనమిచ్చారు. వారిద్దఱు వేఱుకాదని నిరూపించారు.

షిరిడీ సంస్థానము వారు బాబా విగ్రహమును తయారు చేయించుటకు బొంబాయి నుండి "తాలిమ్" అనే శిల్పిని పిలిపించారు. అతనికి బాబా పటముల లోని వివిధ కోణములు పరిశీలించినను బాబా శిల్పము చెక్కుట కుదరలేదు. అతడు సాయిబాబాను ప్రార్థించగా ఆ రోజు రాత్రి సాయి స్వప్నములో కనుపించి "నా రూపమును మఱల మఱల చూడవలెనన్న సాధ్యము కాదు. జాగ్రత్తగా చూచుకో" అని అతనికి చెప్పి బాబా తన విగ్రహమును చెక్కించు కొన్నారు. బాబాయే స్వయముగా చెక్కించుకొన్నందున సాయికి - సమాధి

మందిరములోని సాయి విగ్రహమునకు భేదము లేదు.

రమణ మహర్షి భక్తురాలైన డోంగ్రేకు తాము రమణ భక్తులమని, సాయి వేఱు అనెడి భావముండెడిది. ఆమె, తన స్నేహితురాలు శ్రీమతి భాట్కర్‌తో కలసి షిరిడీ వెళ్ళినప్పుడు గురుస్థానములోని సాయి పటములోనే వారిద్దఱికి రమణ మహర్షి దర్శనమయినది. వారు తృప్తిపడి అక్కడనే సాయిబాబా జీవిత చరిత్రను పారాయణ చేశారు.

దక్షిణ భారతదేశములో 1940 ప్రాంతములో సాయితత్త్వ ప్రచారము చేసిన శ్రీ బి వి. నరసింహస్వామిగారు తన ముగ్గురు పుత్రులు అకాలమరణము చెందుటచే విరక్తి పొంది, శ్రీ శృంగేరి పీఠాధిపతిని, రమణ మహర్షిని ఆశ్రయించిరి. అయినను మనస్థిమితము లేక తీర్థయాత్రలు చేయుచుండగా "ఖుర్దివాడి"లోని శ్రీ నారాయణ మహారాజను యోగిపుంగవుడు "నీవు వెంటనే షిరిడీ పొమ్ము. నీవు కోరు మహారత్నము నీకు లభింపగలదని" చెప్పిరి. నరసింహస్వామిగారు వెంటనే షిరిడీ వచ్చి మసీదులో ధుని ముందు బాబా కూర్చుండు ప్రదేశములో కూర్చుండి ధ్యానము చేసిరి. తరువాత సమాధి మందిరములో బాబా సమాధి దగ్గరగా కూర్చుండి "బాబా అనుగ్రహమునకు నేను పాత్రుడనైనచో, సాయి తత్త్వమును భూతలమున వ్యాపింపజేయు భాగ్యము నాకు కలుగుటకు గుర్తుగా ఒక పిచ్చుక నా తలపై జేరి కూర్చుండు నటుల ప్రసాదింపుము" అని బాబాను ప్రార్థించి ధ్యాన నిమగ్నులు కాగా, ఒక పిచ్చుక వారి తలపై నిలచినది. అచట (షిరిడీలో) వారు మనశ్శాంతిని పొందుట. పిచ్చుక ద్వారా బాబా వారికి ఆశీస్సులనిచ్చుట జరిగినది. అలాగునే సమాధి మందిరము ముందు కూర్చొని యుండగా బెంగుళూరు నుండి ఒక వ్యక్తి వచ్చి వారికి ఒక పొట్లమిచ్చి, "ఈ ధనమును సాయి ప్రభువుకుపయోగించుమని" చెప్పెను. పిమ్మట ఆ పొట్లమును విప్పి చూడగా అందు రూ 11455/- లు ధనమున్నది ఆ పైకముతో బాబా తత్త్వ ప్రచారమునకై పుస్తకములు ముద్రించి భక్తులకు పంచిపెట్టిరి. పిమ్మట శ్రీ బి.వి. నరసింహస్వామిగారు, మద్రాసులో ఆల్ ఇండియా సాయి సమాజ్‌ను స్థాపించి, సాయి తత్త్వమును బహుళ ప్రచారము చేసినారు. 1944లో ఆంధ్రప్రదేశ్‌లోని పలు పట్టణములలో కూడ సత్సంగములు జరిపి సాయి తత్త్వమును ప్రచారము

చేసియుండిరి. నేటికిని ఈ సంస్థ సాయి తత్త్వ ప్రచారమునకు కృషి చేయుచున్నది.

పూజ్యశ్రీ పూర్ణానంద స్వామిగారితో వారి గురువు సిద్ధపురుషుడైన "రాఖాడ్ బాబా," "నీవు షిరిడీలో ఒక సప్తాహము సాయిని సేవించి, (సాయి సమాధి అయిన తరువాతనే) ఆయన ప్రేరేపించిన చోట ఆశ్రమవాసివై యుండుమని" చెప్పిరి. అలాగే యిప్పుడు శ్రీ పూర్ణానంద స్వామివారు శ్రీశైలము (సున్నిపెంట) లో ఆశ్రమమును స్థాపించి అచట నివసించు చున్నారు.

శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాష్టారుగారు 1963లో వారి రెండవ అన్న గారైన వేదవ్యాస్‌గారితో షిరిడీ వెళ్ళిరి. అప్పటికి వారికి సాయి యందు ఎట్టి విశ్వాసము లేదు. బాబాను గుఱించి ఎప్పుడో చనిపోయిన వారిపై విశ్వాస ముంచుట, ఆ చనిపోయిన వారి దేహమును సమాధి చేయుట వారికి బాధ కలిగించినది. ఆ దేహము ఈ సరికి ఎంతగా కుళ్ళి ఉండునో కదా! దాన్ని కప్పిపుచ్చుట కొఱకు కాబోలు అంత ధూపము వేస్తున్నారు" అని వారికనిపించి నది. ఆ బాధతో బాబా మందిరము నుండి వారి గదికి వెళ్ళి నిదురించిరి. మఱురోజు ఉదయము ఫలాహారము చేయుటకు షిరిడీలోని మద్రాసు హోటలుకు సమాధి మందిరము ముందుగా వెళ్ళుచు, బాబా సమాధి వద్ద పూజారులు మాత్రమే యుండుట చూచిరి. జీవకళతో కళకళలాడుచున్న బాబా విగ్రహాన్ని చూడాలని హోటలుకు వెళ్ళకుండానే మందిరములోనికి ప్రవేశించి విగ్రహము ముందు నిలచి బాబా విగ్రహముపై దృష్టి నుంచిరి. సాయినాథుని దృష్టి అంతర్ముఖమై యేదో అతీత స్థితిలో నున్నట్లు వారికి తోచినది. ఒక అనిర్వచనీయమైన ఆనందము, అనుభవము వారికి కలిగినది. వారి అన్నగారు వచ్చి మాష్టారుగారిని కదిలించగా అప్పుడు వారికి బాహ్య స్మృతి కలిగినది. అప్పటికి ఐదు గంటల నుండి బాబా విగ్రహము ముందుండినట్లు గ్రహించిరి. ఇదే వారి జీవితములో మఱపురాని సంఘటన. నాటి నుండి సాయి తత్త్వముపై మనస్సు కేంద్రీకరించి సాయి తత్త్వమును బహుళ ప్రచారము చేయుచు సాయిలో ఐక్యమయిరి.

పోలీస్ ఆఫీసరుగా పని చేసిన శ్రీ బి. ఉమామహేశ్వరరావు (సాయిప్రభ సంపాదకులు)గారు 1960 నుండి గుండెజబ్బుతో బాధపడుచుండిరి. వైద్యులు ఆపరేషన్ చేయవలెనన్నారు. 1980లో షిరిడీ వచ్చి అప్పటి నుండి సాయిని ప్రార్థిస్తూ యున్నారు. ఇట్లుండగా 1983 నవంబరు 16వ తేది రాత్రి వారు సాయినాథుని ధ్యానించుచుండగా ఎదురుగా నున్న సాయి పటము నుండి చిత్రమైన కాంతి వారి గుండెమీద పడి శరీరములో కరెంటు ప్రవహించినట్లయినది. వారి ఎడమ రొమ్ము చుట్టు వలయాకారముగా కాలినట్లయినది. అప్పటి నుండి గుండె జబ్బు తగ్గి పూర్తిగా ఆరోగ్యవంతులైరి. ఇప్పటికిని బాబా సేవ చేయుచునే గుంటూరులో ఉన్నారు.

శ్రీ బాపట్ల హనుమంతరావుగారు తెలుగు పండితులుగా పని చేయుచు, ఆర్థికస్థితి సరిలేక కుటుంబ భారమును మోయలేక జీవితముపై విరక్తి పొంది ఆత్మహత్య చేసుకొనవలెనను తలంపుతో ఉండగా ఆ రోజు అనగా ది. 27-12-1944వ తేది రాత్రి వేకువఝ్జామున గం 5-00లకు స్వప్నములో లేత పసుపు రంగు లాల్చీ ధరించి, అట్టి పసుపు రంగు వస్త్రమునే తలకు ముడివైచుకొని ఒక వ్యక్తి వారికి సాక్షాత్కరించి "నేను సాయిబాబాను. నీవు అనేక గ్రంథములు రచించితివి........వీనిని కూడ వ్రాయుము" అని చెప్పిరి. అప్పటికి వీరికి సాయిబాబాను గురించి తెలియదు.

మఱురోజు ఉదయము చీరాల నుండి బందా ఆదినారాయణగారు చిన గంజాములో ఉన్న వీరి వద్దకు వచ్చి "అఖిల భారత సాయి సమాజ అధ్యక్షులు శ్రీ బి.వి. నరసింహస్వామిగారు చీరాల వచ్చిరి. సాయిబాబా వారికి స్వప్నములో కన్పించి మీ చేత కొన్ని గ్రంథములు వ్రాయించుమని చెప్పినారట. అందువలన నిన్ను తీసుకొని రమ్మని నన్ను పంపినారని" చెప్పి యిద్దఱు చీరాల వెళ్ళిరి. శ్రీ బి. వి. నరసింహస్వామిగారు, హనుమంతరావుగారికి (ఇంతకుముందు ఒకరికి ఒకరు తెలియదు) ఒక సాయిబాబా ఫోటో యిచ్చుచు, తాను ఆంగ్లమున బాబాను గురించి వ్రాసిన గ్రంథములను హనుమంతరావు గారికి ఇచ్చి వానిని తెలుగున అనువదించుమని చెప్పిరి. వారికి ఇచ్చిన ఫోటో రాత్రి తనకు స్వప్నములో కనుపించినవ్యక్తియే అంటే సాయియే. ఆత్మహత్యకు సిద్ధపడిన వ్యక్తిచేత తన లీలలు వ్రాయించి "ఏమి నిన్ను పేక్షింతునా"అను

పుస్తకము ద్వారా తన తత్త్వమును ఆంధ్రప్రదేశ్‌లో ప్రచారము చేయించు కొన్న సాయి లీల ఏమని చెప్పగలము?

ఒకరోజు హనుమంతరావుగారు వినగంజాము వద్ద రైలుపట్టాల మధ్యగా నడుస్తూ ఉండగా (వీరికి చెముడు, వినపడదు) వెనుక నుండి వచ్చు రైలును, గమనించని వీరిని రైలు క్రింద పడకుండ శ్రీ సాయి భౌతికముగా వీరికి కనుపించి వీరిని ప్రక్కకు లాగి రైలు క్రింద పడకుండ కాపాడిరి. సశరీరముగా దర్శనమిచ్చుటే కాక, వారికి భుక్తి - ముక్తి ప్రసాదించిరి,

1957లో శ్రీ సాయినాథుని చరిత్ర వ్రాసిన కీ॥ శే॥ వేమూరి వేంకటేశ్వర్లు గారు తన విద్యార్థి దశలో 24 సం॥ల వయస్సులోనే 1929 ప్రాంతములో ఇలస్ట్రేటెడ్ వీక్లీలో శ్రీ సాయిబాబాను గురించి వ్రాయబడిన వ్యాసము ద్వారా ఆకర్షించబడి సాయి సేవ చేసిన వీరికి సాయినాథుడు ప్రత్యక్ష నిదర్శనములు ఇచ్చియున్నారు.

1935 నవంబరు 20వ తేదీన తెనాలిలో రైల్వే స్టేషన్‌కు గుఱ్ఱపు బండి మీద వీరు వెళ్ళుచుండగా బండి చక్రము ప్రక్కన నున్న "శాయమేకు" పోవుటను గమనించని వీరికి మానవరూపధారిగా బండి వెంబడి కేకలు వేయుచు పరుగెత్తి వచ్చుచు ఆ విషయము చెప్పి వారు కాల్వలో పడకుండ రక్షించి నారు సాయి.

1942లో దసరా ఉత్సవములకు శ్రీ వేంకటేశ్వర్లుగారు ఒక్కరే షిరిడీ వెళ్ళుటకు బయలుదేరి బొంబాయి మెయిలులో డోండ్‌స్టేషనులో దిగి కోపరగాం వెళ్ళుటకు రైలు కొఱకు నిరీక్షించుచుండిరి. వీరికి బహిర్‌భూమికి పోవుటకు అవసరమేర్పడినది. దగ్గఱ చెంబు లేదు. ఎటు పోవుటకు తెలియదు. వీరికి అచటి భాష తెలియదు. అట్టి సమయములో ఒక కొల్లాయిగుడ్డ కట్టుకొని, మఱొకటి కప్పుకొన్న వ్యక్తి వీరి మనస్సులోని [అంతరంగము] విషయము తెలిసినవానివలె వచ్చి స్వచ్ఛమైన తెలుగులో మాటాడుచు, నీటి చెంబు ఇచ్చి వెళ్ళవలసిన ప్రదేశమును చూపి వీరి పంచె వద్ద కాపలా ఉండి తన లీలను సాయి ప్రత్యక్షముగా చూపినారు.

వీరి భార్యకు క్షయ యని వైద్యులు చెప్పగా, ధుని ఊది సేవించుట వలన ఎట్టి మందు వాడకయే, బాబా అనుగ్రహము వలన డాక్టర్లు మఱల పరీక్షించినప్పుడు ఏ వ్యాధియులేదని చెప్పుట జరిగినది. అటులనే వీరి శ్రీమతికి సుఖప్రసవము కాదని చెప్పినప్పుడు కూడ ఊది సేవించుట వలన సుఖ ప్రసవమైనది. అశరీరవాణిగా సాయి వాక్కు వీరు వినుట కూడ జరిగినది.

(ఈ లీలలు వారు వ్రాసిన సాయినాథుని చరిత్ర 2వ భాగములోని వి)

నారికురుపుతో బాధపడు పిళ్ళెగారి కర్మను పది జన్మలలో కాక, పది రోజులలో తొలగించగలనని బాబా చెప్పుట విన్నాము. కాని బాబా దేహ త్యాగము తరువాత ఒక భక్తురాలి ప్రారబ్ధ కర్మసంక్షయము చేసిన లీల కూడ తెలిసికొందము.

గోదావరి జిల్లాలోని రామచంద్ర పురంలో 1923వ సం॥లో జన్మించిన మాతాజీ కృష్ణప్రియకు 1950 జులై 14న (ఆమె అప్పటికి సాయిబాబాను ఆశ్రయించలేదు) బాబా స్వయముగా దర్శనమిచ్చి, వారి లీలలు మాతాజీ కృష్ణప్రియగారి ద్వారా ప్రకటించుట ప్రారంభించి ఊది ప్రసాదించుచు, తులసి ఆకులు ఇచ్చుచు, రోగ నివారణ సూచించుచుండిరి. మఱి ఏ జన్మలో ఇచ్చిన అభయప్రదానమో, ఆమె చేత తన తత్త్వ ప్రచారము చేయవలసి యుండియో, మాతాజీ కృష్ణప్రియ కోరకపోయినను, ఆమె ఎనిమిది జన్మలలో అనుభవించ వలసిన ప్రారబ్ధ కర్మను 8 మాసములలో సంక్షయము చేయుదు నని చెప్పినారు బాబా. 8 మాసములలోను ప్రతి నెలలోను ఆమె బయట చేరు సమయమున విపరీతముగా ఆమెకు జబ్బు చేయుట, కొన్ని నిమిషములలో ప్రాణము లేని శవమువలె అగుట జరిగెడిది. అట్టి చావు నుండి బాబా ఆమెను రక్షించుచు అనేక నిదర్శనములనిచ్చి కాపాడిరి. వేయేల! ఈ ఒక్క నిదర్శనము చాలదా మన విశ్వాసమునకు! 10వ తరగతి కూడ చదువని మాతాజీ భగవద్గీత, ఉపనిషత్తులు చెప్పి, సాయి చరిత్ర వ్రాసి భక్తుల నెందఱినో సాయిని ఆశ్రయింపజేసిన - నామ జపమే ముక్తికి మార్గమని చెప్పిన - సాయి అంకిత భక్తురాలు మాతాజీ కృష్ణప్రియ.

మాతాజీ కృష్ణప్రియ భర్త శేషగిరిరావుగారికి (పోస్టల్ డిపార్టుమెంటులో పని చేసియున్నారు) బాబా యందు విశ్వాసము కలుగుటకు ఇచ్చిన నిదర్శనములలో ఈ క్రింది అద్భుత లీల తెలుసుకొందము.

ఒకరోజు శేషగిరిరావుగారు ఆఫీసు నుంచి సా॥ గం. 5-00 లకు ఇంటికి వచ్చిరి. వారి శ్రీమతి కృష్ణప్రియగారు బిడ్డల సంగతి చూచుచున్నది. ఆమె వీరిని గమనించలేదు. అప్పుడు ఆమె 'ఛా'(టీ)యీయదని తలచి వారు నిరుత్సాహముతో పంచలో ఒక కుర్చీలో కూర్చుండిరి. కాని ఐదు నిమిషములలో వారి శ్రీమతి వారికి 'ఛా' అందించినది. ఆ టీ మామూలుగా కాక అతి రుచిగా ఉన్నట్లు వారికి అనిపించినది.ఆ టీ త్రాగి మఱికొంచెము త్రాగవలెనను ఉద్దేశముతో లోనికేగి మఱియొక కప్పు 'ఛా' యిమ్మని భార్యనడిగిరి. ఆమె పది నిమిషములలో పెట్టి తెస్తానన్నది. ఇప్పుడే కదా యిచ్చితివి. పెట్టి తెస్తానంటావేమి? అని, ఆ 'ఛా'యే త్రాగాలని అన్నాడు. కాని వాస్తవమునకు ఆమె 'ఛా' అప్పటికి పెట్టలేదు. భర్తకు ఈయలేదు. ఆ సమయములో తన కుమార్తెకు జడవేయుచున్నది. ఆ దంపతుల ఆశ్చర్యమునకు అవధులు లేవు. ఆ 'ఛా' కప్పు శేషగిరిరావుగారే స్వయముగా అందుకొనిరి. 'ఛా' యిచ్చి ఆమె లోపలకు వెళ్ళినది. మఱి ఎవరామె? ఎంత ధన్యుడు మాతాజీ భర్త. సక్కుబాయి రూపమున వచ్చిన విఠలుని కథ విన్నాము. మఱి మాతాజీ రూపమున తన సేవలందించిన సాయిని పొగడు శక్తి మనకెక్కడిది.

శ్రీ వేదవ్యాస్ **I.A.S.** గారు 1956లో **I.A.S.** చదువుచున్న రోజులలో గుంటూరులోని తన మిత్రుడు శ్రీ వేమూరి కోటి సూర్యప్రకాశరావు గారి ఇంటికి వెళ్ళి వారితో మాటాడి తిరిగి వెళ్ళునప్పుడు వరండాలో టేబులుపై పడవేసి ఉన్న ఒక పుస్తకము (మాసి నలిగిపోయి అట్ట పగము చినిగినది)చేతిలోనికి తీసికొనుట జరిగినది. అట్ట తీసి చూస్తే సాయినాథుడు అని ఉన్నది. ఏమిటిది అనుకొనుచు పుట తెరువగా లోపల కాలుమీద కాలువేసుకొని ఉన్న సాయినాథుని చిత్రము చూచుట జరిగినది.ఎవరీతడు ? చూస్తే ముష్టివాడుగా ఉన్నాడే. ఈయనకు చరిత్ర ఏమిటి? అని అనుకొనుచు పుస్తకము తెఱచి చూశారు. "బాబా తాను భోజనానికి వస్తానని చెప్పి నల్ల కుక్క రూపములో వస్తే ఇనుప కడ్డీ విసరగా తన వీపుపై గాయమైనది"అని ఉన్న పుట కనుపించి

నది. అప్పటి వరకు సాయి ఎవరో తెలియని శ్రీ వేదవ్యాసగారు "ఈయన ఎవరో సాధారణ మహాత్ముని వలె లేడే" అని తలచి ఆ పుస్తకము ఇంటికి తీసికొని వెళ్ళి తెల్లవారు లోపల పూర్తిగా చదువుట జరిగినది. ఆ పుస్తకము పూర్తి చేయునప్పటికి బాబా లీలలకు ఆనందబాష్పాలతో తలగడ అంతా తడిసిపోయినది. వారి ఐ.ఎ.యస్. పరీక్ష హాలు టిక్కెట్టు నుండి ప్యాసు అగు వరకు బాబాను పరీక్ష పెట్టి ఐ.ఎ.యస్. ఆఫీసరు అయి ఆశ్చర్యకరమైన అనుభూతులు పొంది షిరిడీ దర్శించుట జరిగినది. ఇప్పుడు సాయి తత్త్వ ప్రచారము జరుపుచున్నారు. శ్రీ వేదవ్యాసగారు చెప్పినట్లుగా మార్గము లేని మార్గముగా బాబా వీరికి అనుగ్రహ మార్గము ప్రసాదించారు.

ఈ రచయిత హైదరాబాదు వెళ్ళినపుడు (ది. 3-3-93) శ్రీ యం. రంగాచార్యులుగారు (షిరిడీ డెవలప్‌మెంటు కమిటీ అధ్యక్షులు) తెల్పిన ముచ్చటైన మూడు శ్రీ సాయి లీలలు.

1992 అక్టోబరులో హిమాచల్ ప్రదేశ్‌లోని ధర్మశాలలో బాబా విగ్రహము ప్రతిష్ఠించుటకు నన్ను రమ్మని ఆహ్వానించినారు. అప్పటి పరిస్థితులలో ఆ ప్రదేశమునకు ప్రయాణము చేయుట చాలా కష్టము కనుక మా యింట్లో ఎవరు నేను వెళ్ళుటకు ఒప్పుకొనలేదు. ప్రయాణమునకు ఒకరోజు ముందుగా ఉదయమున ఒక కోయవాడు మా యింటికి వచ్చినాడు. ముందు ఆఫీసులో కూర్చొని యున్న మా అబ్బాయి వద్దకు అతడు వచ్చి మీతో ఒక విషయము చెప్పాలి. వినండి అని అన్నాడు. ఏదైనా భయపెట్టేది చెపుతాడేమోనని, మేము వినమని, రూ. 5/-లు మా అబ్బాయి అతనికి ఈయబోయెను. అప్పుడు కోయవాడు నేను అడవిలో ఉండేవాడిని, అంత దూరము నుండి మీకు చెప్పటానికి వచ్చానని, డబ్బు కొరకు రాలేదని అన్నాడు. ఈలోపుగా లోపల నుండి నేను అచటకు వచ్చాను. సాయిబాబా అనే ఆయన మీకు చెప్పమని మీ చిరునామా యిచ్చి నన్ను పంపాడు. నేను చెప్పేది వినండని అన్నాడు. అతనిని గదిలోకి వచ్చి కూర్చుండుమని చెప్పి మీరు చెప్పునది చెప్పమన్నాను. ఏమి వినవలసి వస్తుందోనని మావాళ్ళు భయపడుచున్నారు.

నన్ను చూపిస్తూ "మీకు 110 సం॥ల ఆయుష్యమున్నదని, అప్పటి దాకా శాలు సేవ చేస్తారని చెప్పి, రేపు మీరు ప్రయాణము చేయబోవుచున్నారు. ప్రయాణము సుఖముగా జరుగును. భయపడవలసిన పనిలేదు వెళ్ళి రండి అని చెప్పి, యిందులో నాదేమి లేదు. బాబా చెప్పుమంటే చెప్పాను" అని అనుచు గబగబ బయటకు వెళ్ళాడు. కోయవాడు మేమంతా ఆశ్చర్యములో నుండి తేరుకొని చూచునప్పటికి అతడు కనుపించలేదు. మా యింటిలోని వారందరు నేను ప్రయాణము జేయుటకు అంగీకరించారు. 80 సం॥ల వయస్సులో పంజాబులో కుండా మారుమూల ధర్మశాలకు 20 డిగ్రీల సెంటిగ్రేడ్ వాతావరణములో నా ప్రయాణము సుకరముగా చేయించి, ఆ స్వామి విగ్రహమును నిర్విఘ్నముగా నా చేత ప్రతిష్ఠ జరిపించుట నిజముగా సాయి కృపయే.

గోవా యందలి కులగంటి వాస్తవ్యుడైన నారాయణ అను నతడు 1983లో సౌది అరేబియా వెళ్ళాడు. ఇతడు అక్కడ ఇద్దరి మిత్రులతో కలసి ఉండేవాడు. వారికి అరేబియా దేశస్థుడు వంటచేసి పెట్టెడివాడు. 1986 లో ఒకరోజున ముగ్గురు మిత్రులు భోజనమునకు వచ్చినప్పుడు వంటవాడు వంట అంతా పాడు చేసినది చూచారు. వంట వానిని ఏమిటి యీలా చేశావు అని అడుగుచుండగా సమాధానము చెప్పక నిర్లక్ష్యముగా ఆ వంటవాడు వెళ్ళుచున్నాడు. నారాయణ అతని వెంట పడి, అతనిని మసీదుకు సమీపములో పట్టుకొని కొట్టాడు. ఆ వంటవాడు "నేను మసీదులో నుండగా నారాయణ నన్ను కొట్టాడు" అని ఖాజీకి రిపోర్టు ఇచ్చాడు. నారాయణను అరెష్టు చేసి జైలులో ఉంచారు. ఈ విషయము గోవాలో ఉన్న నారాయణ తల్లిదండ్రులకు తెలిసినది. వారికి ఏమి చేయుటకు తోచక 'హుల్వేకర్' (మాష్టార్‌జీ) అనే వారి వద్దకు వెళ్ళి ప్రభుత్వమువారి ద్వారా సౌది అరేబియాలోని రాయబారి ద్వారా పిల్లవానిని రక్షించుటకు ప్రయత్నము చేయుమని కోరిరి. అందుకు హుల్వేకర్ "అది జరిగే పనికాదు. మేలేమియు జరుగదని చెప్పుచు, సాయి భక్తులైన హుల్వేకర్ వారి వద్ద నున్న సాయిబాబా పటమును చూపి శ్రీ సాయికి నమస్కారము చేసి మీ మొఱ వినుపించుకొనుమని, సాయికి చెప్పుకొనుమన్నారు. వారు చెప్పిన విధముగా బాబా పటమునకు నమస్కరించుకొని, వారి కుమారుని కాపాడమని వేడుకొన్నారు. ఈ విధముగా ప్రతి దినము వారు సాయి పటము ఎదుట నిలచి ప్రార్థన చేయుచున్నారు.

నారాయణను అరెష్టుచేసి 20 రోజులు అయినను అతనికి అనుకూలముగా ఎవరును రానందున షరియత్ (న్యాయాధికారి) నారాయణకు అచటి న్యాయ చట్టము ప్రకారము మసీదులో కొట్టినందుకు కుడి కాలు, కుడి చేయి తీసివేయ వలసినదిగా తీర్పు ఇచ్చిరి. ఆ శిక్ష అమలుపఱచుటకు నారాయణను తీసుకొని వెళ్ళుచుండగా ఒక ఆజానుబాహుడు, తలకు గుడ్డ, కఫ్నీ ధరించిన వ్యక్తి వారి దగ్గఱకు వచ్చి, ఇతని వలన తప్పులేదు. కావున వదలిపెట్టమన్నాడు. వారు అంగీకరించకపోగా, రెండు గంటలపాటు శిక్ష అమలు చేయవద్దని వారికిరూ. 500/-లు ఇచ్చి వారిని ఒప్పించి ఖాజీ వద్దకు వెళ్ళి నారాయణ వంటవానిని మసీదులో కొట్టలేదని, మసీదుకు 100 అడుగుల దూరములో కొట్టాడని అతనికి ఈ శిక్ష వేయకూడదని చెప్పగా, 20 రోజుల నుండి ఎవరును రాలేదు. ఇప్పుడు శిక్ష అమలు చేయుటకు తీసికొని వెళ్ళారు. కాబట్టి నేను ఏమి చేయ లేనన్నాడు ఖాజీ. అలా కాదు. న్యాయస్థానమునకు వచ్చి న్యాయాధికారితో ఈ విషయము చెప్పుమన్నాడు ఆ వ్యక్తి న్యాయస్థానములో వారి ఈ వాదన న్యాయాధికారి విని చాలా ఆలస్యముగా వచ్చినావు. ఇప్పటికే మా ఉత్తర్వులు అమలు జరిగి యుండవచ్చు అని న్యాయాధికారి అన్నాడు. మీ ఉత్తర్వులను మీరు ఇవ్వండి ఆ విషయము నేను చూచుకొందును అని ఆ వ్యక్తి అన్నాడు. షరియత్ మొదటి ఉత్తర్వును రద్దు చేసి నారాయణకు కొంత డబ్బు జరిమానాగా విధించారు. ఆ మొత్తము ఆ వ్యక్తియే చెల్లించి న్యాయస్థానపు టుత్తర్వును తీసికొని నారాయణ దగ్గఱకు వచ్చాడు.

ఇంతకు మునుపు చెప్పిన రెండు గంటలకు ఇంకా ఒక అర్థగంట వ్యవధి యున్నది. వారికి ఈ క్రొత్త ఉత్తర్వును చూపి నారాయణను విడిపించి "నీవు వెంటనే గోవాకు వెళ్ళుము"అని చెప్పి అతని వద్ద పైకము లేకపోగా తానే పైకము, విమానపు టిక్కెట్టు ఇచ్చి, ఆ రోజే గోవాకు నారాయణను పంపారు.

పైన తెలిపిన లీలను నారాయణ, తండ్రితో వచ్చి శ్రీ రంగాచారిగారిని కలసినప్పుడు స్వయముగా చెప్పెను.

మఱి, ఈ లీలలో ఆ వ్యక్తి ఎవరు ? వారే సాయినాథుడు, బాబా యెవరో తెలియని నారాయణ తల్లిదండ్రులు గోవాలో బాబా పటము ముందు

ఎప్పుడైతే నమస్కరించారో అప్పుడే ఎక్కడో సౌది అరేబియాలో ఉన్న వారి కుమారుని ఆపత్తు నుండి రక్షించుట ప్రారంభించి తన లీలలు ప్రకటించారు సాయి. కనుక సాయినాథుడు సమాధి అనంతరము కూడ తన ఆశ్రితులకు స్వస్వరూపముతో ప్రత్యక్ష నిదర్శనములు ఇచ్చుచున్నారు.

సాయి భక్తులకు దర్శనమిచ్చుటలో ప్రత్యేకత లేదు గాని, సాయిని గురించి ఏ మాత్రము తెలియని వారికి కూడ సాయి తన దర్శనమిచ్చి రక్షించుట ఒక ప్రత్యేకత.

ఇట్టిదే మఱియొక లీల. హిమాలయమున సుమారు 2000 అడుగుల ఎత్తున పాకిస్థాన్, చైనా సరిహద్దులలో మిలటరీ విధులు నిర్వహించుచున్న మేజరు జనరలు సుధీర్‌కుమార్ వద్దకు 1989లో ఒక రోజున ఒక అజాను బాహుడైన వృద్ధుడు సాధు రూపముతో వచ్చి యతని యెదుట కూర్చున్నాడు. ఆ వ్యక్తిని చూచిన యతనికి ఆశ్చర్యము కలిగినది. నాకు తెలియకనే-నేను పిలువకయే ఒక వ్యక్తి నా యెదుటకు వచ్చి నా అనుమతి లేకయే కూర్చుండుట యా? అను ఆలోచనా పరంపరలతో కొంచెము సేపు సుధీర్‌కుమార్ తట పటాయించాడు. ఏది ఏమైనను నా యొద్దకు వచ్చిన వానిని పలకరించుట - సామాన్య ధర్మము గదా యని భావించి "ఎవరు మీరు? ఎక్కడ నుండి వచ్చి నారు? నా వలన మీకు కాగల సహాయమేమి? యని యడిగినాడు. అందుకు ఆ వ్యక్తి "నేను అంతట ఉంటాను" అని మాత్రము బదులు చెప్పినాడు పిమ్మట పిలువకయే ఇంటికి వచ్చి అతిధికి ఏదేని ఆతిధ్యమిచ్చి, సత్కరించుటకు సుధీర్‌కుమార్ ఇంటి లోపలకు వెళ్ళి తీసికొని వచ్చు లోపల ఆ వక్తి యచ్చట కనుపించలేదు. ఆశ్చర్యమధికమైనది. తోటి సైనికాధికారుల కీ విషయము తెల్పినాడు. వారు "ఇంత ఎత్తు ప్రదేశమునకు దోమ కూడ ప్రవేశించుటకు వీలు లేదు కదా! మనము పిలువక, మనకు తెలియక, ఎవరు ఎట్లు వచ్చెదరని సుధీర్‌కుమార్‌తో అనినారు. సుధీర్‌కుమార్ మాత్రము జరిగిన సంఘటన గూర్చి యాలోచించుచునే యున్నాడు.

మఱి కొంత కాలమునకు మఱల మునుపటి వ్యక్తియే మునుపటి రూపముతోడనే సుధీర్‌కుమార్‌కు కనిపించినాడు. ఈ పర్యాయము ఆ వ్యక్తిని

"మీరు ఎక్కడి నుండి వచ్చినారు? అని మాత్రమే కాక, మీ పేరేమి? "అని కూడ సాహసించి అడిగినాడు. ఈ ప్రశ్నలకు ఆ వ్యక్తి "నేను షిరిడీ నుండి వచ్చినాను. అందఱు నన్ను సాయిబాబా అని పిలిచెదరని సమాధానమిచ్చి, అంతటితో ఊరకొనక "ప్రమాదములో ఉన్న నిన్ను రక్షించినాను" అనియు తెల్పినాడు. ఆ మాట వినుటతోడనే సుధీర్‌కుమార్‌కు శరీరమంతయు ఆనందముతో, ఆశ్చర్యముతో పులకరించినది. ప్రమాదము నుండి రక్షించిన ఆ వ్యక్తికి కృతజ్ఞతా సూచకముగా పాదాభివందనము చేయుచుండగనే ఆ వ్యక్తి యచట నుండి అదృశ్యమైనాడు. ఈ విచిత్ర (అద్భుత) సన్నివేశమునకు సుధీర్‌కుమార్ ఆశ్చర్య చకితుడయినాడు.

మేజరు జనరలు సుధీర్‌కుమార్ 1991 సం॥లో పదవీ విరమణ చేసి చండీఘర్ వచ్చినాడు. 1992 సం॥ ఫిబ్రవరిలో బొంబాయి వచ్చి యిక్కడ షిరిడీ పట్టణము ఎచట నున్నది ? విచారించి తెలిసికొనినాడు. వెంటనే టాక్సీలో షిరిడీ వెళ్ళి "సాయిబాబా ఎక్కడ ఉన్నారు? వారిని చూడవలె"నని యచ్చటి వారి నడిగినాడు "సాయిబాబా ప్రస్తుతము లేరు కాని వారి సమాధి మాత్రము ఉన్నది. దానికి వెనుక భాగమున సాయిబాబా విగ్రహము ఉన్నది" అని యచట వారు తెల్పిరి. అతని సంతోషము అంతరించినది. ఎట్టకేలకు సమాధి మందిరములోనికి వెళ్ళినాడు. బాబా విగ్రహమునకు ఎదురుగా నిలువ బడినాడు. ఆ విగ్రహమునే కన్నులార్పక తదేక ధ్యానముతో, ఏకాగ్ర చిత్తముతో చూచుచున్నాడు.అతనికి ఆనాడు హిమాలయ పర్వత ప్రాంతములో దర్శనమిచ్చిన సాధురూపమే. మార్పు లేక యీనాడును ఈ విగ్రహమున కూడ కనుపించినది. ఆశ్చర్యమునకు అవధులు లేవు. శ్రీ సాయిబాబా గుఱించి యిచట విశదముగా తెలియజేయువారెవరైన నున్నారా ? యని యచటి వారిని అడుగగా వారు అతనిని నా వద్దకు తీసికొని వచ్చినారు. నా ద్వారా బాబా చరిత్రను సాకల్యముగా తెలిసికొని నాటి నుండి సుధీర్‌కుమార్ శ్రీ సాయి అంకిత భక్తులలో ఒకరయి తమ జీవితమును చరితార్థము చేసికొనుచున్నాడు.

మహా మహిమాన్వితములైన యీ శ్రీ సాయి లీలలను గుఱించి శ్రీ రంగాచార్యులుగారు తెలుపగా రచయిత సావధానచిత్తముతో విని పరమానంద భరితుడయినాడు.

ఈ విధముగా శ్రీ సాయిబాబా కోట్ల కొలది తన భక్తులను సదా సంరక్షించుచు, అభయ ప్రదాన మొసంగుచు, తన లీలను చూపుచున్నారు. శ్రీ సాయి యందు సంపూర్ణ విశ్వాసము కలిగి సర్వస్వము శ్రీ వారికి అర్పించుచు శ్రీ సాయినాథుని యొక్క దివ్యానుభూతిని మనమును పొంది వారి కృపకు పాత్రులమై తరించుదము గాక.

ఓం శ్రీ సాయి నాథాయ నమః



సంతసంబగు నీ నామ జపము సలుప
సంతసంబగు నీ దివ్య చరిత వినఁగ
సంతసంబగు నీ భక్త జనులఁ గలియ
సంతసంబు నీ ప్రాపు; శ్రీ సాయిదేవ !

# సాయిబాబా చరిత్రము

## సప్తమాధ్యాయము

ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

# షిరిడీ - దర్శనీయ స్థలములు - వాని విశిష్టత

షిరిడీ పవిత్ర పుణ్యక్షేత్రము. యాత్రా కేంద్రము. శ్రీ సాయిబాబా 1858 నుండి 1918 వరకు అనగా 60 సంవత్సరములు దేహధారిగా నడయాడిన దివ్య స్థలము. వారి భౌతిక దేహము సమాధి చేయుటకు శాశ్వత నివాస మేర్పరచుకొన్న పునీత ప్రదేశము.

"షిరిడీ ప్రవేశమే సర్వ దుఃఖ పరిహారము"

అని బాబా మొదటి అభయ ప్రదానము. సాయినాథుడు సద్గురువు. షిరిడీని సాయినాథుడు తన గురుస్థానమని చెప్పారు. మన గురువగు సాయినాథుని నివాసమైన షిరిడీ మనకు కూడ గురుస్థానమే. గురుస్థానమును దర్శించి, వారి సమాధిని దర్శించుట ప్రత్యక్షముగా గురువును దర్శించుటయే.

"నా సమాధి నుండియే సర్వ కార్యములు నిర్వహింతును"

అని బాబా అభయప్రదానమిచ్చి యున్నారు. ఇప్పుడును తమ అభయ ప్రదానమును తుచ తప్పక పాటించుచున్నారు. కనుక మనము షిరిడీ దర్శించి బాబాకు (వారి సమాధికి) మన కోర్కెలను విన్నవించి ఆ స్వామి కృపచే నెరవేర్చుకొందము.

# షిరిడీ

షిరిడీ మన భారతదేశములోని మహారాష్ట్రలోగల అహమద్‌నగర్ జిల్లాలోని కోపర్‌గాం తాలూకాలో ఆనాడు ఒక కుగ్రామము. ఆనాడు 80 కి మించని మట్టితో కట్టిన పూరి యిండ్లు మాత్రము ఉండెడివి. ఈనాడు పట్టణముగా రూపు దిద్దుకొని ప్రముఖ యాత్రా కేంద్రములలో ఒకటి అయినది. ఆ రోజులలో కోపర్‌గాం స్టేషన్‌లో దిగి, కోపర్‌గాంనకు తూర్పున నున్న గోదావరి దాటి టాంగాలో షిరిడీ చేరెడివారు. గోదావరిలో స్నానము చేసి అక్కడే ఉన్న దత్తాత్రేయ స్వామివారి దేవాలయమును దర్శించి నీమ్‌గామ్ మీదుగ షిరిడీ వెళ్ళెడివారు నానాసాహెబు చాందోర్కర్ షిరిడీ వచ్చిన ప్రతి పర్యాయము కోపర్‌గాం దగ్గఱ గోదావరిలో స్నానము చేసి అచటి దత్తాత్రేయ స్వామిని దర్శించి షిరిడీ వచ్చెడివాడు. ఒకసారి దత్తాత్రేయ స్వామిని దర్శించకయే షిరిడీకి రాగా బాబా అతనిని మందలించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదు నుండి అజంతా ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణించి మన్మాడ్ వెళ్ళి, అచట నుండి బస్సులో (గంటన్నర ప్రయాణములో) షిరిడీ చేరవచ్చు. లేక హైదరాబాదు నుండి షిరిడీకి రోడ్డు ట్రాన్స్‌పోర్టు వారు రెండు బస్సులు ప్రతి దినము నడుపుచున్నారు. హైదరాబాదు నుండి షిరిడీకి సుమారు 15 గంటల ప్రయాణము. బెంగుళూరు నుండి న్యూఢిల్లీ పోవు కె.కె. ఎక్స్‌ప్రెస్ రైలులో ధర్మవరము, అనంతపురము మీదుగా డోండు జంక్షన్ మీదుగా మన్మాడ్ చేరి, అచటి నుండి బస్సులో షిరిడీకి వెళ్ళవచ్చును. లేదా బొంబాయి మార్గములో రైలులో డోండు జంక్షనులో దిగి కోపర్‌గాం మీదుగా షిరిడీ వెళ్ళవచ్చు మద్రాసు - అహమదాబాద్ నవజీవన ఎక్స్‌ప్రెస్‌లో బుషావల్‌లో దిగి అక్కడ నుండి వేఱొక రైలులో మన్మాడ్ వెళ్ళి, అచట నుండి బస్సులో షిరిడీ వెళ్ళవలెను.

షిరిడీ వెళ్ళుటకు పైన తెల్పిన ప్రయాణ మార్గములే కాక 1994 ఏప్రియల్ 6వ తేది నుండి రైల్వేవారు క్రొత్తగా "దేవగిరి ఎక్స్‌ప్రెస్" అను రైలును హైదరాబాదు నుండి బొంబాయి వఱకు ప్రవేశపెట్టినారు. ఈ రైలు ప్రతి దినము ఉదయం గం. 5-30 లకు సికింద్రాబాద్‌లో బయలుదేరును.

ఈ రైలులో మన్మాడ్ వరకు వెళ్ళి అచట నుండి బస్సు ద్వారా ప్రయాణించి షిరిడీ చేరవచ్చును. హైదరాబాద్ నుండి ప్రతి శనివారము సాయంత్రము ఒక రైలు బయలుదేరి డోండ్ జంక్షన్ మీదుగా బెలాపూర్ వరకు ఉదయం 7-00 లకు పోవును. అచట నుండి బస్సులో షిరిడీకి వెళ్ళవచ్చు. మరల ఆ రైలు రాత్రి బెలాపూర్ నుండి బయలుదేరి ఉదయం హైదరాబాదు చేరును.

షిరిడీలో మనము దర్శించునది దేవాలయమా? మందిరమా? ధ్యాన మందిరమా ? ఆశ్రమమా ? గురుస్థానమా ? వారి వారి సంస్కారము, అనుభూతిని బట్టి వారి యొక్క భావన యుండును. ఎచట మనకు నిర్మలానందము. మనశ్శాంతి, తృప్తి లభించునో అదియే మనకు తగిన ప్రదేశము. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు మొదలగు వారే కాక విదేశీయులు కూడ మనకు అక్కడ కనుపించెదరు. విశ్వాత్మకుడైన గురువు (గురుస్థానము) ఎక్కడ ఉండునో అక్కడ సకల దేవతలు నివసించెదరు. సకల తీర్థములుండును. అట్టి చోట చేయు జప - తపములు అల్పములే అయినను అధిక ఫలమిచ్చును. సాయి భక్తులకు షిరిడీయే తపోభూమి. షిరిడీ శాంతినిలయం. సాయి భక్తులకు బృందావనము.

## షిరిడీలో మనము దర్శించవలసినవి

1) ఖండోబా మందిరము 2) మారుతి ఆలయము 3) ద్వారకామాయి 4) చావడి 5) గురుస్థానము 6) లెండి తోట 7) సమాధి మందిరము 8) ఇతర దర్శనీయ స్థలములు : I) శివ, గణపతి, శని దేవాలయములు, లక్ష్మీదేవాలయము II) శ్రీమతి లక్ష్మీబాయి షిండే గృహము III) శ్రీ భక్త మహాల్సాపతి గృహము IV) శ్రీ శ్యామా కుమారుడు ఉద్ధవరావు దేశపాండే గృహము. 9) సకోరీలో ఉపాసనీ బాబా ఆశ్రమము.

## వాని విశిష్టత

పై స్థలములలో బాబా దేహధారిగా ఉండి మానవ శ్రేయస్సుకు నిరంతర కృషి సలిపియున్నాడు. వారి స్పర్శననుభవించిన ఆయా ప్రదేశములను

దర్శించి, స్పృశించి, సాయి చింతనచే జన్మ తరింపజేసికొనవలెను. కనుక ఒక్కొక్క ప్రదేశము యొక్క ప్రత్యేకత తెలుసుకొందము. మనము ఆయా స్థలములు దర్శించినప్పుడు వాటిని గుర్తుకు తెచ్చుకొని, మననము చేసుకొనుచు సాయినాథుని స్పర్శానుభూతిని పొందుటకు ప్రయత్నించుదము. ఆ తండ్రిని 'కరుణించు'మని వేడుకొందము

## 1) ఖండోబా మందిరము

బస్‌స్టాండుకు ఎదురుగా ఖండోబా మందిరము ఉన్నది. ఖండోబా శివుని అవతారము. "గ్రామదేవత"గా చెప్పబడుచున్నది. ఈ మందిరమునకు అప్పటి పూజారి భక్తమహాల్సాపతి బాబా పెండ్లి బండ్ల నుండి ఖండోబా మందిరము ముందు గల ఖాళీ స్థలములోని మఱ్ఱిచెట్టు క్రింద దిగుచు ఉండగనే "దయచేయుము సాయి" అని భక్తమహాల్సాపతిచే పిలుచుట జరిగినది. ఆ మఱ్ఱిచెట్టున్న స్థలములో ఇప్పుడు ఆసుపత్రి యున్నది. మహాల్సాపతి వంశస్థులే ఇప్పటికిని ఇచట పూజారులుగా ఉన్నారు.

ఉపాసనీ బాబా ఈ ఖండోబా మందిరములో బాబా ఆదేశముతో చాలా కాలము ఉన్నారు. ఎవరితో ఎట్టి సంబంధము పెట్టుకొనక యీ మందిరములో ఊరకనే కూర్చుండుమని బాబా ఉపాసనీ బాబాను ఆజ్ఞాపించిరి. మేఘుడు ప్రతి రోజు ఖండోబాను దర్శించిన తరువాతే బాబాను దర్శించేవాడు. ఒకరోజు మేఘుడు ఖండోబా మందిరము తలుపులుతీసిలేవని ఖండోబాను చూడకుండగనే బాబా వద్దకు రాగా తలుపులు తీసియున్నవని మరల మేఘుని అచటకు పంపి ఖండోబాను దర్శింపచేసిన పిమ్మటనే తన పూజకు అనుమతి యిచ్చారు.

కనుక మనము ముందుగా ఖండోబా మందిరమును దర్శించి, ఈ లీలలు గుర్తుచేసుకొందము. ఖండోబా మందిరము ముందు ఇప్పుడున్న రావిచెట్టుకు ప్రదక్షిణ చేసి భక్తులు కొబ్బరికాయలు కొట్టుచుందురు. ఖండోబా మందిరము ముందు ఖాళీస్థలములో బాబా మొదట వచ్చిన గుర్తుగా బాబా పాదుకలు ఈ మధ్యనే స్థాపించిరి.

## 2) మారుతి ఆలయము

మసీదు - చావడి మధ్యగల సందుకు ఎదురుగా మారుతి ఆలయము ఉన్నది. ఈ మారుతియే క్షేత్రపాలకుడుగా ఉన్నాడు. బాబా మొదటి రోజులలో ఇతర సాధువులతో కలసి యిచటనే కొంత కాలము ఉన్నారు. దేవీదాసు - జానకీదాసు మొదలగు సాధువులతో ఇచటనే సంబాషించేవారు. లెండి తోటకు వెళ్ళేటప్పుడు ఈ ఆలయము ఎదురుగా ఏవో సైగలు చేసేవారు బాబా. అలాగుననే బాబా చావడికి వెళ్ళేటప్పుడు (చావడి ఉత్సవము రోజు) ఈ సందుకు ఎదురుగా ఆంజనేయస్వామి వైపు తిరిగి ఏవో సైగలు చేసేవారు. అవి వారికే తెలియాలి. ఈ ఆలయమును దర్శించి, దీపములో నూనె వేసి, కొబ్బరికాయ కొట్టి నమస్కరించి, పూజలు చేయుచుందురు.

## 3) ద్వారకామాయి

ఆ రోజులలో ఇది పాడుబడిన మసీదు శిథిలావస్థలో నున్న మట్టి కట్టడము. యిప్పటికి లోపల కప్పుకొయ్య కడ్డీలతో చెక్కరేపర్లతో వున్నది. ధునికిచుట్టు ఐరన్‌గ్రిల్ క్రింద వరసలో ఐరన్ రేకులు పై వరుసలో మూడు ప్రక్కల ఒక ప్రక్క ధునికి గోడ వున్నది. ఈ ధునికి కొయ్యపిల్లరు వున్నది. బాబా కృష్ణజీమాల్కరును ఈ పిల్లరుకే పూజ జరుపు కొనమని 1908లో చెప్పిరి. బాబా రెండవసారి షిరిడీ వచ్చినప్పటి నుండి యీ మసీదులోనే నివసించిరి. దీనికి "ద్వారకామాయి" అని బాబాయే పేరు పెట్టిరి. ఒక భక్తుడు ఆరోగ్యము పొందుటకు మసీదుకు వచ్చిన సందర్భములో" ఇది మసీదు కాదు. ఇది ద్వారవతి, ఎవరైతే యిందు కాలు మోపెదరో వారు ఆరోగ్యమును, ఆనందమును సంపాదించెదరు. వారి కష్టములు గట్టెక్కును" అని బాబా ఆ భక్తునితో అనిరి. ఈ మసీదును బాబా 'మసీదు మాయి' అని కూడ సంబోధించుట జరిగినది.

ద్వారకామాయిలో 'ధుని'ని ఏర్పాటుచినారు. మసీదు ముందు గల ఖాళీ జాగాలో అప్పుడు తులసి వనము పెంచినారు బాబా. ఈ మసీదు ముందు

జాగాలోనే పొయ్యి పెట్టి పాత్రలతో స్వయముగా 1910 వఱకు వంటలు చేసి ఈ మసీదులోనే బీదలకు పెట్టినారు బాబా ఇప్పటికిని గుర్తుగా మసీదు ముందు ఆ పొయ్యి ఉన్నది తులసి కోట ఉన్నది. వాటిని భక్తులు స్పృశించుచుందురు. తులసి కోటకు ఈశాన్య దిశ యందు ఒక గది ఉన్నది. ధుని నుండి తీయబడిన ఊదిని ఈ గదిలో ఉంచెదరు. ఇదే షిరిడీ ధనాగారము. ధునిలో వేయదగు పలు వస్తువులు కూడ ఈ గదిలో భద్రపఱచెదరు. బాబా జీవిత సమయములో ఈ గది యందు 'శ్యామకర్ణ' అను పేరు గల గుఱ్ఱమును ఉంచెడివారు. మధ్యలో ఒక స్తంభము ఉన్నది. దీనిని కవ్వమని చెప్పుదురు. బాబా పొయ్యి వద్ద కూర్చున్నప్పుడు ఈ స్తంభాన్ని పట్టుకొనేవారు. బాబా భక్తుల నుండి తీసికొన్న పాపములను ఈ కవ్వమునకు వదలేవారట. ఈ స్తంభమునకు ప్రదక్షిణ చేసి తాకినచో నొప్పులు, రోగములు మున్నగునవి నయమగుచున్నవి దీనిని పట్టుకొని కూర్చొని ధ్యానము చేసిన మంచిది. 1911లో ఈ ఖాళీ స్థలములో ఇనుప స్తంభములు పాతి కాకాసాహెబు దీక్షితుచే పై కప్పు వేయ బడినది. మసీదు ముందు మరమ్మతు పనులను వడ్రంగులైన కొండాజి, గాబాజి, తుకారం చేసిరి.

భక్తులు బాబాను ఈ మసీదులోనే దర్శించేవారు. బాబా దీపములు ఇందులోనే వెలిగించేవారు. ఇప్పుడు భక్తులు మసీదులో కాని, బయట షెడ్‌లో కాని దీపాలు వెలిగించుచుందురు. బాబా మసీదులో ధునికి ఎదురుగా కట్టడాపై తన ఎడమ చేయి వేసి కూర్చునేవారు. ఈ కూర్చున్న విధానముతో గల బాబా చిత్రరువును "ద్వారకామాయి" పటమని భక్తులు పిలుస్తారు. అనాడు మసీదుకు ఈశాన్య భాగమున బాబా కూర్చున్న స్థానము నందే కొయ్య మండపములో ద్వారకామాయి ఫొటో ఈనాడు పెట్టబడినది. ఈ ఫొటోకుముందు బాబా వెండి పాదుకలు వున్నవి. భక్తులు వాటికి నమస్కారము చేసుకొందురు బాబా అప్పుడు స్నానము చేయుటకు ఉపయోగించిన ఱాతిబండ ద్వారకామాయి పటమునకు ఎడమ ప్రక్కన ఉన్నది. అట్లే కుడిప్రక్కన బాబా ఉపయోగించిన తిరుగలి, గోధుమల బస్తా ఉన్నవి. ఈ గోధుమల బస్తా కొయ్య - అద్దాల బీరువాలో ఉంచబడినవి ఈ గోధుమలు ప్రతి సంవత్సరము శ్రీరామనవమి రోజు మార్చుచుందురు. తిరుగలి ఇనుపతీగలతో భద్రపఱచబడి యున్నది. భక్తులు వీటిని దర్శించెదరు.

మసీదులో మధ్య గోడకు ఉన్న గూటిని 'నింబారు' అని అందురు. ఇది భగవంతుని నిర్గుణ స్వరూపముగా చెప్పబడినది. అందులో వున్న ఒక ఇనుప గొలుసుకు దాని ప్రక్కనేయున్న రెండు పెద్ద ఇత్తడి దీపపుస్తంభములలో దీపములు వెలిగించబడి యుండును. భక్తులు యిందులో నూనె, నెయ్యి వేయుదురు. పూలదండలు తగిలించుచుందురు. 1912లో శ్రీరామ జన్మోత్సవములో జోగేశ్వర భీష్మ కీర్తన చెప్పుటకు, కాకా మహాజని హార్మోనియము వాయించుటకు సిద్ధముగా ఉండిరి. ముందుగా బాబావారి యనుమతి కోరుటకు, కాకా మహాజని బాబా వద్దకు రాగా బాబా మసీదులో నున్న 'నింబారు' నుండి యొక పూలమాలను కాకా మహాజని మెడలో వేసి, మఱియొక మాలను భీష్మకు పంపిరి. ఈ 'నింబారు'ను స్పృశించి నమస్కరించు చుందురు. ధునికి ప్రక్కగా ఒక కుండలో నీరుండేది. ఇప్పుడును ఆ విధముగనే నీరు ఉంచబడుచున్నది. ఆ నీరు భక్తులు త్రాగుదురు. బాబా భిక్షాటనలో తెచ్చిన పదార్థములు ఒక కుండలో ఉంచెడివారు. ఇప్పుడు దానికి గుర్తుగా ధుని ప్రక్క మట్టి పాత్ర ("కొళంబె") ఉంచబడినది. ద్వారకామాయిలో నైవేద్యము పెట్టిన రొట్టెముక్కలు ఇందులో ఉంచెదరు. వాటిని భక్తులు ప్రసాదముగా తీసికొందురు. బాబా ఉదయము ధుని దగ్గఱ కట్టెలు సవరిస్తూ కూర్చున్న చోటు గుర్తుగా సాయి పాదుకలు ప్రతిష్ఠించ బడినవి. వాటిని స్పృశించి ఆనందించుచున్నారు. మసీదు ముందు ఐరన్ గ్రిల్‌తో కటకటాలు పెట్టబడినవి. లోపల అంతా పాలరాయి పరచబడినది.

బాబా తన స్థానములో కూర్చున్నప్పుడు భక్తులు చుట్టు పరివేష్టించి బాబా చెప్పెడి బోధలను వినుచు ఉండెడివారు. బాబా చిలుము వెలిగించి తాను త్రాగి యితరులకు కూడ ఇస్తూ ఉండేవారు. అప్పుడు గోడలలోని గూళ్ళలో ఈ చిలుము గొట్టాలు పెట్టేవారు. హారతులు ఇచటనే జరిగేవి. హారతికి స్త్రీలు మసీదులో, పురుషులు దిగువ ఖాళీ స్థలము నందు నిలిచెడి వారు. హారతి జరుగునప్పుడు కూర్మ చిహ్నమున్న ప్రాంతములో శ్యామకర్ణా గుఱ్ఱము నిలబడి హారతి పాటకు అనుగుణముగ లయానుసారముగ శిరస్సు యూపుచు కాళ్ళను ఆడించెడిది. మధ్యాహ్న హారతి అయిన తరువాత బాబా మసీదు బయటకు వచ్చి రోడ్డుప్రక్క మసీదు ముందుగల గోడనానుకొని నిలచి

భక్తులను పలుకరించుచు దీవించిన స్థలములో, గుర్తుగా 4 అడుగులు ఎత్తుగా కట్టిన గోడపై బాబా పాదుకలు (చిన్నవి) అమర్చి భక్తులు స్పృశించుటకు అవకాశము కల్పించిరి. శ్రీరామనవమి, చందనోత్సవము మొదలగునవి, నామ సప్తాహములు ఇచటనే జరిగేవి. రోడ్డువైపు గోడప్రక్క కప్పునుండి ఒక పెద్ద గంట వ్రేలాడ తీయబడియున్నది. దీనిని పగలు 11-30 లకు మ్రోగించెదరని చెప్పబడినది.

బాంద్రా నివాసి రఘువీర పురందరే, 'వెండిపల్లకి' ఉంచుటకు మసీదుకు ఒక ప్రక్క పంచ నిర్మించెను. బాబా జీవిత కాలములో వాడిన పల్లకి వగైరా వస్తువులు ఇందులో ఇప్పుడు ఉన్నవి. ఈ పల్లకిని గురువారము పల్లకి వుత్సవమునకు తీసి వాడెదరు. వాటిని బయట నుండి చూడవచ్చు. ద్వారకామాయి బజారు మధ్యగల రేకులషెడ్‌లో రెండు రథములు ఉన్నవి. బాబా చావడి ఉత్సవములో అప్పుడు రథము కూడ ముందు ఉండేది. 1912లో మసీదు మరమ్మతు నానాసాహెబు చాందోర్కర్‌చే చేయబడినది. మసీదులో పాలరాతి తాపనము కాకాసాహెబు దీక్షితు చేసిరి. బాబా అనుమతి లేనిదే ద్వారకామాయి మెట్లు ఎవరు ఎక్కుటకు వీలులేదు. బాబా వెళ్ళుమని అనుమతించిన తరువాత అచట ఉండుటకును వీలులేదు. వెళ్ళిపోవలసినదే. ఇప్పుడు కూడ బాబా అనుమతి లేనిదే షిరిడీ దర్శించలేమని భక్తులు తలచుచుందురు. రాత్రులందు బాబా-భక్త మహాల్సాపతి-తాత్యా ముగ్గురు కలసి యీ మసీదులో పడుకొనెడివారు. బాబా ఈ ద్వారకామాయిలో 1858 నుండి జీవితాంతము నివసించిరి.

మసీదు ముందు రేకుల షెడ్‌లో ఒక పెద్దరాయి ఉన్నది. దీనిపై ఆనాడు బాబా కూర్చొనెడివారు. దీనికి గుర్తుగా అప్పట్లో ఆ రాయి ఉన్న చోట ఈనాడు ఒక తాబేల్లు ఆకారములో చిహ్నమును ఏర్పఱచి, ఆ రాతిని షెడ్‌లోనే ఒక గోడ ప్రక్కన ఉంచినారు. ఆ రాతిపై బాబా పాలరాయి పాదుకలు అమర్చబడినవి. వానిని చూచినవారు స్పృశించుచుందురు. ఆ రాతి వెనుక కాలుపై కాలువేసికొని కూర్చున్న శ్యామారావు జయకరు చిత్రించిన బాబా పటము ఉన్నది. ఆ పటమునకు ఒక ప్రక్క పులి, వేరొక ప్రక్క గుఱ్ఱము విగ్రహములున్నవి. 1886లో 72 గంటల సమాధి యీ మసీదులోనే

జరిగినది. 1918 సం॥ అక్టోబరు 15వ తేదీన ఇచటనే బాబా దేహత్యాగము చేసిరి. ద్వారకామాయిలోనికి మెట్లు ఎక్కేటప్పుడు పైన గ్రిల్లుకు దత్తాత్రేయ స్వామి ఫొటో ఉన్నది. దీనికి ఒక ప్రక్క నరసింహస్వామి, రెండవ ప్రక్క శ్రీపాద శ్రీవల్లభుని ఫొటోలు ఉన్నవి.ఏకాదశ సూత్రములబోర్డుకూడ ఉన్నది రేకుల షెడ్‌లోని ఇనుప స్తంభములకు శ్రీ వాసుదేవానంద సరస్వతి, శ్రీ అక్కలకోట మహారాజ్, ఏయుబాలెకుండు మహారాజస్వామి, శ్రీ గజానన మహారాజ్, భగవాన్ రామకృష్ణ పరమహంస, భగవాన్ విష్ణుమూర్తి ఫొటోలు కూడ కట్టబడి వున్నవి.

ఇప్పుడు షిరిడీ దర్శించు భక్తులు ఈ మసీదులో బాబా వాడిన పైన తెలిపిన వస్తువులు, ప్రదేశములు దర్శించి, స్పృశించి ఆనందము పొందుట జరుగుచున్నది. భక్తులు ఇచట కూర్చొని ధ్యాన-పారాయణలు చేయుచుందురు. ఇచట చేయు ధ్యాన-పారాయణలు విశేష ఫలితమిచ్చునవి భక్తుల విశ్వాసము, అనుభూతులు కూడ పొందుట జరుగుచున్నది. ఇచటకు వచ్చు భక్తులు మసీదులో గల ధునిలో 1) పీచుగల కొబ్బరికాయ 2) ఆవు పిడకలు 3) రావి పుల్లలు 4) మేడి పుల్లలు 5) తులసి పుల్లలు 6) నవధాన్యములు 7) గంధపుచెక్క 8) కర్పూరము 9) సాంబ్రాణి 10) ఆవునెయ్యి వేస్తూ ఉంటారు. భక్తులు వాటిని వెంట తీసుకొని వెళ్ళుచుందురు. ఈ విధముగా ధునిలో వేయుటవలన కర్మసంక్షయమై వారి కోరికలు తీరునని, మేలు కలుగు నని భక్తుల నమ్మకము. ఆ నమ్మకము వాస్తవమే.

ధునిలో కొబ్బరికాయలు మనము వేయుటకు వీలులేదు. అచట గల గోతపుసంచిలో వేయవలయును. నవధాన్యములు, ఆవునేయి, తులసి పుల్లలు మొదలగునవి వేయుటకు వీలుగా అమర్చిరి.

సాయినాథుని స్పర్శతో పవిత్రమైన ఈ ద్వారకామాయిని దర్శించి పై సంఘటనలు గుర్తు చేసుకొనుచు సాయినాథుని మనస్సులో నిలుపుకొని సంతోషించుదము. వర్ణ భేదములు లేకుండా అందరికి నాల్గు పురుషార్థాలకు ద్వారాలు తెఱచి యుంచినదే ద్వారకామాయి. "ద్వారకామాయి ప్రవేశించి నంతనే సుఖ సంపదలందగలరు" అను బాబా అభయ ప్రదానము సదా గుర్తుంచుకొనవలెను.

## 4) చావడి (VILLAGE Meeting Hall అని వ్రాయబడినది.

ఇది మసీదుకు సుమారు 50 గజముల దూరములో నున్నది. ఒకసారి పెద్ద వర్షమునకు మట్టికట్టడమైన మసీదు తడిసిపోయి కూర్చొనుటకు వీలులేక పోయినందున భక్తులు బాబాను బలవంతముగా చావడికి తీసుకొని వెళ్ళారు. ఆ రోజు నుండి అనగా ది. 10-12-1910 నుండి చావడిలో రోజు విడచి రోజు బాబా పడుకునేవారు. ఈ చావడి ఉత్సవములో భక్తులు ఎక్కువగా పాల్గొనే వారు. ఇప్పుడును అలాగుననే జరుగుచున్నది. మసీదు నుండి మేళ తాళము లతో బయలుదేరునప్పుడు బాబా ఎడమ చేతిని తాత్యా, కుడి చేతిని భక్త మహాల్సాపతి పట్టుకొని నడచేవారు. బాపుసాహెపు జోగ్ కాని, నిమోస్కర్ కాని బాబా శిరస్సుపై ఛత్రమును పట్టుకొనేవారు. బాబా బయలుదేరుటకు ముందు చంకలో సటకా పెట్టుకొని కుడిపాదము బొటన వ్రేలితో ధునిలోని కట్టెలను ముందుకు త్రోసి, కుడి చేతితో దీపము నార్పెడివారు. మందు సామానులు వెలిగించుచు, నాట్యము చేయుచు, స్త్రీ - పురుషులు వారి ననుస రించెడివారు. హరి వినాయక్ సాఠె బాబా యొక్క ముందు భాగమున రాజ దండము పట్టుకొని నడచెడివాడు. ఈ చావడి ఉత్సవములో పురందరే 125 వత్తుల దివిటీ పట్టుకొనేవారు. ముందు పల్లకి, రథము, శ్యామకర్ణ అశ్వము, వివిధ వాయిద్యములతో, భజనలతో, నాట్యములతో వైభవముగా మసీదు నుండి చావడికి ఊరేగింపుగా బయలుదేరెడిది. దారిలో ఆంజనేయస్వామి గుడి ఎదురుగా బజారు కూడలిలో నిలచి చేతులూపుచు ఏవో సంజ్ఞలు చేసేవారు. బాబా చావడి చేరిన తరువాత బాబాకు కిరీటము. జలతారు ఉత్తరీయము ధరింపజేసేవారు. తరువాత పూజ చేసి, శేజహారతి యీయగనే భక్తులు వెళ్ళిపోయెడివారు. ఈ ఉత్సవమునకు 2 గంటల సమయము పట్టేది. బాబా తాంబూలము వేసుకొని తన పడక మీద 50, 60 దుప్పట్లు తానే పఱచుకొని చావడిలోనే కుడి ప్రక్క వైపు పడుకొనేవారు. మఱురోజు ఉదయము కాకడ హారతి యిక్కడనే యిచ్చేవారు. అది కాగానే బాబా మసీదుకు తిరిగి వెళ్ళేవారు.

ఇప్పుడును ప్రతి గురువారము రాత్రి గం. 8-30 ల ప్రాంతములో చావడి ఉత్సవము ప్రారంభమగును. మసీదు వద్ద పల్లకి చక్కగా పూలతో అలంకరించి అందులో బాబా పటమును, పాదుకలను, సటకాను, కోటును ఉంచి

కొంతసేపు భజనచేసి మేళతాళములతో దివిటీల ఊరేగింపుతో సుమారు రాత్రి గం. 9-15 ల ప్రాంతములో చావడి వద్దకు వచ్చి అచట కొంతసేపుండి తిరిగి మసీదుకు వస్తారు. షిరిడీ దర్శించు భక్తులీ చావడి ఉత్సవములో పాల్గొనుటకు ఉత్సాహము చూపుదురు.

ఇప్పుడును ప్రతిరోజు రాత్రి గం 8-00 లకు శ్రీ శివనేశన్‌స్వామి వారు జరిపినట్లుగా నామ సంకీర్తన జరుగుచున్నది. అందఱు ఈ భజన కార్య క్రమములో పాల్గొనవచ్చును. ముందు కొద్ది పంచ వెనుక రెండు గదుల చావడి ఒక భాగములో బాబా ఉపయోగించిన కొయ్య కుర్చీ, 11 అడుగుల ఎత్తుగల ఒక బల్ల ఉన్నవి. ఈ బల్లమీద బాబా దేహత్యాగము చేసిన తరువాత స్నానము చేయించబడినది. దీనిని స్పృశించి ఆనందము పొందుదురు. 1915 ప్రాంతములో బాబాకు అస్వస్థత కలిగి, నడవలేకపోయినప్పుడు ఒక భక్తుడు బాబాకు చక్రాల కుర్చీ సమర్పించాడు. కాని బాబా దీనిని ఉపయోగించలేదు. దీనిని ఇప్పుడును చావడిలో దర్శించవచ్చును. రెండవ భాగములో బాబా ఫొటోలు ఉన్నవి. నిలువెత్తు అద్దము అలంకరణ చేయబడి యున్నది. ఈ రెండవ భాగములోనికి స్త్రీలు వెళ్ళరాదు. ఈ భాగమునకు ముందున్న పంచలో బాబా చరిత్ర పారాయణ చేయుటకు (మరాటి) చరిత్ర పుస్తకములు ఉంచిరి.

అన్నా చించనీకర్‌కు (దామోదర్ ఘనశ్యామ్ బాబరే వురఫ్ అణ్ణా చించణకర్) కలకాలము నిలచు వంశ ప్రతిష్ఠ యిస్తానన్నారు సాయి. అట్లే చించణకర్ వ్యాజ్యెములో గెలిచిన రూ. 1800/-లు బాబాను దక్షిణగా తీసికొనుమని కోరగా బాబా తీసికొనిన ఆ పైకముతో చావడి మరమ్మతు చేయించి, ఆ దంపతుల పేర్లు చావడి ముఖద్వారముపై "శ్రీ సాయినాం బాబాజీ లక్ష్మి దామోదర్ బాబరే చించణకర్ చావడి" అని హిందీలో వ్రాయించిరి. చావడి దగ్గఱలో పాలుఅమ్మేవారి నుండి పాలుకొని అచటి కుక్కలకు పోస్తారు. చావడి దర్శించినపుడు చావడి ఉత్సవమును గుర్తు చేసుకొందురు.

## 5) గురుస్థానము

సాఠెవాడ ముందు వేపచెట్టున్న (నింబ వృక్షము) ప్రదేశమే గురుస్థానము. బాబా 1854లో మొదటిసారి వచ్చినప్పుడు ఈ వేపచెట్టు క్రింద

కూర్చుండెడివారు. ఖండోబా ఆవేశించినవారు చెప్పిన ప్రకారము ఈ వేప చెట్టు క్రింద నున్న బండను తొలగించి త్రవ్వగా నందులో నాలుగు దీపములు వెలుగుచున్నవి. దాని క్రింద భూగృహము, గోముఖ నిర్మాణములు, కట్టి బల్లలు, జపమాల కన్పించినవి. "ఆ బాలుడు అచట 12 సంవత్సరములు తపస్సు నభ్యసించె"నని ఖండోబా ఆవేశించిన గణాచారి చెప్పినాడు. ఆ బాలుడు అది తన గురుస్థానమని చెప్పాడు.

శ్రీ సాయి శరణానంద అను ప్రత్యక్ష భక్తులు ఈ భూగృహమును స్వయముగా చూచినట్లు చెప్పిరి. మసీదులో ధుని దగ్గరనున్న స్తంభాన్ని బాబా శరణానందుకు చూపి "ఆ క్రిందనే గుహయున్నదని, మహాత్ములెవరైనను వచ్చి నప్పుడు తప్ప మఱెప్పుడును బయటకు రాకుండ తాము అందులోనే నివసించెడి వారమని, తన గడ్డము పొడవుగా పెరిగి నేలను తాకుచుండెడిదని" చెప్పారు. ఒకసారి సగుణమేరు నాయక్‌తో బాబా "తాను 12 సం॥లు, కేవలము వేపాకు తిని జీవించితి"నని చెప్పిరి.

హరి వినాయక్ సాఠె ఈ వేపచెట్టు చుట్టు గల స్థలమును కొన్నప్పుడు ఈ చెట్టు చుట్టు ఎత్తైన అరుగు కట్టించి దానిని ఎక్కుటకు మెట్లు కట్టించారు. బాబా ప్రథమమున షిరిడీ వచ్చి యీ వేపచెట్టు క్రింద తపస్సు చేసిన దానికి గుర్తుగా బాబా పాదుకలు ఈ చెట్టు క్రింద ప్రతిష్ఠించవలెనని సంకల్పము కలిగినది. 1912లో బొంబాయి డాక్టరు రామారావు కోఠారే బాబా రాతి పాదుకలు చేయించి షిరిడీ పంపిరి. ఉపాసనీ బాబా సలహా ప్రకారము ఆ పాదుకలపై పద్మము - శంఖము మొదలగునవి చెక్కిరి. ఉపాసనీ బాబా సలహా మేరకు ఈ క్రింది శ్లోకము వేపచెట్టు క్రింద చెక్కించిరి.

సదా నింబ వృక్షస్య మూలాధివాసాత్
సదాస్రావిణం తిక్తమప్యప్రియం తమ్ ।
తరుం కల్పవృక్షాధికం సాధయంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథం ॥

దీని భావమేమనగా "సదా చేదు రసము స్రవించు వేపచెట్టు మూలములో

నివసించి దానిని కల్పవృక్షము కంటె అధికమైన దానినిగా చేసిన ఈశ్వరునకు నమస్కారము" అని అర్థము.

ఈ చెట్టు దక్షిణపు ప్రక్క కొమ్మ ఆకులు తియ్యగను, ఉత్తరపు ప్రక్క కొమ్మ ఆకులు చేదుగా అప్పట్లో ఉండేవని చెప్పబడినది. ప్రస్తుతము తీపి దనములేదు. బాబా ఆ పాదుకలు తాకి "అవి భగవంతుని పాదుకలని, చెట్టు క్రింద ప్రతిష్ఠింపుడని యాజ్ఞాపించెను" 1912వ సంవత్సరములో శ్రావణ పూర్ణిమ రోజున ఖండోబా మందిరము నుండి వేపచెట్టు వద్దకు తెచ్చి ఈ పాదుకలను ప్రతిష్ఠించిరి ఇప్పుడు ఈ చెట్టు చుట్టు చిన్న మందిరము నిర్మించ బడినది. దాని చుట్టు ప్రదక్షిణము చేయవచ్చును. మేఘునకు బాబాచే ఈయ బడిన శివలింగము మేఘుని మరణానంతరము ఈ చెట్టు క్రింద ప్రతిష్ఠించ బడినది. (ఈ శివలింగమునే పూనా నుండి రామదాసుడనే భక్తుడు తెచ్చి బాబాకు ఇచ్చినది) ఆ శివలింగమునకు ముందు నంధి విగ్రహము వెనుక బాబా పటమున్నది. ప్రక్కనే బాబా విగ్రహమున్నది. దీనిని శ్రీ హరీష్ బాబాజీ తాలిమ్ తయారు చేసిరి. 1974 గురుపూర్ణిమ రోజున ప్రతిష్ఠింప బడినది.

భక్తులు మండపముపై ఉత్తరపుముఖముగా కూర్చుందురు. గురు, శుక్ర వారములు ఇచట ఎవరు దీపము వెలిగించి, ధూపము వేయుదురో వారు బాబా కృప వలన సంతోషముతో నుండెదరని, శుభములు కలుగునని భక్తుల విశ్వాసము. అందువలన భక్తులు తమతో సాంబ్రాణి, (గుగ్గిలము), వత్తులు, నూనె తీసికొని వెళ్ళి యచట దీపములు వెలిగించి, ముందు ఖాళీ జాగాలో ఎప్పుడు మండుచు పొగవేయు పాత్రలో సాంబ్రాణితో ధూపము వేయు చుందురు. ప్రదక్షిణము, ధ్యానము, జపము, చరిత్ర పారాయణ భక్తులు ఇచట చేయుచుందురు. రాత్రి పూట కూడ భక్తులు ఇచట ప్రదక్షిణలు చేయుచుందురు.

## 6) లెండి తోట

లెండి తోటకు గురుస్థానము, సంస్థాన కార్యాలయము దాటి పోవలెను. ఇది రోడ్డు ప్రక్కన ఉన్నది. అప్పట్లో దీని ప్రక్క లెండి అనే ఏఱు ఉండేది.

లెండితోట ఉన్న స్థలమును యం. డబ్ల్యు ప్రధాన్ రూ. 1500/- లకు కొని సాయి సంస్థానమునకు ఇచ్చెను. బాబా నిత్యము లెండి తోటకు వెళ్ళుచుండెడి వారు. లెండి తోటకు వెళ్ళేటప్పుడు మసీదు మలుపులో మారుతికి ఎదురుగాను గురుస్థానము దగ్గఱ బాబా నాలుగు వైపుల సైగ చేసేవారు. వీధి కూడలిలో కూడ సైగ చేసేవారు. అక్కడ గుర్తుగా (ఫిలాజీ గురువే యిల్లు ఉన్న ప్రాంతములో) గూటిలో బాబా పాదుకలు ప్రతిష్ఠించారు. బాబాకు ఎండ తగులకుండా ఉండుటకు లెండి తోటకు వెళ్ళే దారి పొడవున ఇనుప తీగలతో ఆర్చీగా అమర్చి, దానికి లతలు పాకించినది రాధాకృష్ణమాయి. కాని ఈ ఆర్చి ఇప్పుడు లెండి తోటలో మాత్రమే యున్నది. బాబా అచట కొంతసేపు ఉండి తిరిగి వచ్చేవారు. దగ్గఱిదారి యున్నను వెళ్ళినదారినే వచ్చేవారు. ఈ లెండి తోటకు చుట్టు గోడ నిర్మించబడినది. ఇందులో బాబా ఒక రావిమొక్క, రెండు వేపమొక్కలు నాటారు. రావిమొక్క ఏపుగా పెరుగకపోయేసరికి ప్రతిరోజు దానిని స్వహస్తాలతో వంచేవారు. క్రమముగా అది ఎంతో ఏపుగా పెరిగినది. బాబా వెంట అబ్దుల్లా లెండి తోటకు వెళ్ళేవారు. భాగోజి బాబా తలపై గొడుగు పట్టుకొని వెళ్ళేవారు.

లెండి వనములో నంద దీపము మొదట 1890 ప్రాంతములో ఒక గుంటలో ఉండేది. నాలుగు ప్రక్కల గుడ్డపీలికలు, పైన రేకుడబ్బా కప్పబడి యుండెడిది. బాబా ఆ దీపము వెనుక కూర్చుండేవారు. రెండు కుండల నిండా నీరుంచుకొనేవారు. నీటిని చుట్టు చల్లేవారు. అప్పుడు అబ్దుల్లా తప్ప ఎవరు వారి వెంట ఉండేవారు కాదు. ప్రస్తుతము ఈ అఖండ దీపము (నంద దీపము) రాతి స్తంభము పైకి మార్చబడినది. ఇది 1936లో ఇటుకరాతితో కట్టబడినది. ఈ అఖండమునకు ఒక ప్రక్కన వేపచెట్టు. రెండవ ప్రక్కన రావిచెట్టు ఉన్నవి. వీటన్నిటికి భక్తులు ప్రదక్షిణము చేయుదురు. ఈ తోటలో దత్తాత్రేయ విగ్రహము ప్రతిష్ఠించబడినది. ఆ విగ్రహమునకు ప్రక్కనే గల ఉదుంబర వృక్షము (మేడిచెట్టు) నకు ప్రదక్షిణము చేయుదురు. ఇచట బాబా త్రవ్విన బావి ఉన్నది ఆ బావి నీరు త్రాగిన జబ్బులు తగ్గునని ప్రతీతి ఆ నీటిని త్రాగుటకు ఇచ్చెదరు. ఈ తోటలో కూడ ధ్యాన పారాయణలు చేయుదురు.

లెండితోటలో ప్రవేశించే ముందు అప్పట్లో బాబాను ప్రత్యక్షముగా సేవించి బాబాలో ఐక్యమైన అంకిత భక్తులైన అబ్దుల్లా బాబా (1951), శ్రీ నానావల్లీ (1918), బహున్ మహారాజ్ కుంభార్ (1938), తాత్యా కోతే పాటీలు (1945) వారి సమాధులున్నవి. లెండి తోటలో దత్తాత్రేయ విగ్రహము వెనుకగా శ్యామకర్ణ గుర్రపు సమాధి యున్నది

# 7) సమాధి మందిరము

శ్రీ సాయిబాబా నిర్జీవ దేహమును సమాధి చేయబడిన మందిరమే సమాధి మందిరము ఇది సాఠెవాడకు (గురుస్థానము) - ద్వారకామాయికి మధ్యలో నున్నది. షిరిడీలో భక్తులుండుటకు అప్పట్లో 1) సాఠెవాడ 2) దీక్షిత్‌వాడ 3) బూటివాడ నిర్మించబడినవి. షిరిడీలో వేపచెట్టు, దాని చుట్టు గల స్థలము హరి వినాయక్ సాఠె అనువారు కొని సాఠెవాడ అను పెద్ద వసతి 1910కి పూర్వమే నిర్మించెను. ఇదియే మొదటివాడ. సమాధి మందిరమునకు గురుస్థానమునకు మధ్యలో ఈ సాఠెవాడ యున్నది. కాకాసాహెబు దీక్షిత్ 10-12-1910లో పునాది వేసి ఒక భవనమును నిర్మించెను. 1911లో శ్రీరామనవమి రోజున గృహప్రవేశము జరిగినది. ఇదే దీక్షిత్‌వాడ. ఇది గురుస్థానమ్ము-- సంస్థాన ఆఫీసుకు ఎదురుగా రోడ్డు దాటిన తరువాత పెంకు కప్పుతోటి ఉన్నది. దీనిని సంస్థానము వారి టీ స్టాలుకుపయోగించుకొను చున్నారు.

మూడవది బూటివాడ. నాగపూరు నివాసి యగు శ్రీమాన్ బాపు సాహెబు బూటి షిరిడీలో తానుండుటకు ఒక యిల్లు నిర్మించవలెనని తలచెను. ఒకరోజు దీక్షిత్‌వాడలో నిద్రించుచుండగా బాపుసాహెబు బూటికి బాబా స్వప్నములో కనుపించి ఒక వాడను మందిరముతో సహా నిర్మించుమనెను. శ్యామాకు కూడ అట్టి స్వప్నమే వచ్చెను. దానికి ప్లానులు వేయబడి, బాబాచే ఆమోదము పొందినది. పని ప్రారంభించిరి. మధ్య హాలులో మురళీధరుని విగ్రహము ప్రతిష్ఠించవలెనని బూటికి సంకల్పము కలుగగా ఆ విషయము శ్యామా బాబాకు చెప్పెను. "దేవాలయము పూర్తికాగానే, నేను అచ్చట

నివసించుటకు వచ్చెదను. వాడ పూర్తి అయిన పిమ్మట మనమే దానిని ఉపయోగించుకొనవలెను. మనమందఱము అచ్చట ఉండుదము అందఱము కలసిమెలసి యాడుకొందము. ఒకరినొకరు కౌగలించుకొని సంతోషముగా నుండవచ్చును" అని బాబా చెప్పిరి. వాడ నిర్మాణము పూర్తియైనది. బాబా సమాధి చెందుటకు ముందు (1918) అక్టోబరు 15వ తేదిన) అఖరిసారిగా "నన్ను రాతి మందిరములో నుంచుడు" అని చెప్పి శ్వాస విడిచిరి. ఈ బూటి వాడలోనే మురళీధరుని విగ్రహము ప్రతిష్ఠించుటకు నిర్మించబడిన చోట బాబా నిర్జీవదేహము సమాధి చేయబడినది. ఈ బూటివాడ నిర్మించక ముందు ఈ స్థలములోనే బాబా పూల మొక్కలు పెంచిరి. బూటివాడ నిర్మాణము మొదలు పెట్టక ముందు ఒకరోజు బాబా బూటి అల్లుడైన నార్కేతో "నీ మామ బూటి యిక్కడ ఆలయం నిర్మిస్తాడు. దానికి నీవు ధర్మకర్తవవుతావు" అని అన్నారు. ఈ బూటివాడకు బాబా చెప్పినట్లుగా బూటి తరువాత నార్కే ధర్మకర్త అయినాడు.

సమాధి మందిరములోనికి ప్రవేశించునపుడు ముఖద్వారముపై విఘ్నేశ్వరుని విగ్రహము, దాని క్రింద భాగమున హిందీలో "అనంతకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగరాజ పరబ్రహ్మ శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహారాజ్" అని వ్రాయబడి యున్నది. లోపలకు పోయి ముందు హాలు దాటగానే (కటకటాల రెండు ప్రక్కల) ఒక ప్రక్క "నిష్ఠ", రెండవ ప్రక్క "సబూరి" అని వ్రాయబడి యున్నది. బాబా విగ్రహమునకు వెనుక నున్న గోడ పై భాగమున "రఘుపతి రాఘవ రాజారాం-పతిత పావన సాయిరాం" అని వ్రాయబడిన అక్షరములు దర్శనమిచ్చును.

మొదటలో శ్యామారావు జయకర్ అనే చిత్రకారునిచే చిత్రించబడిన నిలువెత్తు బాబా పటము సమాధి వెనుక (పడమర ప్రక్క) ఉండేది ప్రస్తుతము ఈ పటము మఱియొక చోట భద్రపఱచబడినదని చెప్పుచున్నారు. ఇప్పుడు సమాధి వెనుక, నిలువెత్తు కాలుపై కాలువేసుకొని కూర్చున్న బాబా పాలరాతి విగ్రహము వెండి సింహాసనముపై ఆసీనులైనట్లు ఉన్నది. సాయి శరణానందు ఈ పాలరాతి విగ్రహమును 1956లో (సమాధి వెనుక భాగమున) ప్రతిష్ఠించిరి. ఈ విగ్రహము జీవముతో తొణికిసలాడుచు బ్రహ్మ వర్చస్సుతో

వెలుగొందుచు కరుణారసము జాలువారుచున్నట్లు మనకు స్ఫురించును. శ్రీ సాయి సమాధి చలువరాతితో కట్టబడినది. సమాధికి దక్షిణపు వైపున పాదుకలున్నవి. విగ్రహమునకు ఛత్రము అమర్చబడినది. రెండు ప్రక్కల దీపములున్నవి. రాత్రిపూట విగ్రహమునకు సమాధి మండపమునకు కలిపి దోమతెర వేయబడును.

ఇప్పుడు నాలుగు వేళల హారతులు ఇచటనే జరుగుచున్నవి. ప్రతి హారతి ప్రారంభములోను ధూపము వేయుదురు. ఉదయము 5-15 ని.లకు కాకడిహారతి కాగానే పాలతో విగ్రహమునకు, సమాధికి అభిషేకము, పూజలు జరుగుచున్నవి. భక్తులు తీసికొని వెళ్ళు సెంటు పన్నీరు, ఆవుపాలు అభిషేకమునకు ఉపయోగించుచున్నారు. ఇచట బాబా విగ్రహమునకు సమాధికి వస్త్రములతో పూలతో అలంకరణ చేయుటయే ప్రత్యేకత. సాయిని సేవించిన ప్రత్యక్ష భక్తుల చిత్రపటము మధ్యహాలులో అమర్చబడియున్నవి. దక్షిణపు ప్రక్క క్యూలో పురుషులు, ఉత్తరపు ప్రక్క క్యూలో స్త్రీలు హారతులు సమయములో దర్శనమునకు వెళ్ళుదురు. దక్షిణము ప్రక్క క్యూలో వెళ్ళుచున్నప్పుడు బాబా వాడిన వస్తువులు, వంట చేసిన రెండు పెద్ద పాత్రలు ఒక తిరుగలి, చామరము, ఛత్రము, లోటాలు, చిలుము గొట్టములు, కఫ్నీ వగైరా దర్శించవచ్చు. బాబా విగ్రహమునకు ప్రదక్షిణము చేయవలెనన్న దక్షిణపు ప్రక్కన ఉన్న వెనుక ద్వారము నుండి వెళ్ళి ఉత్తరపు ద్వారము గుండ లోపలకు రావలెను. రాత్రులలో శేజహారతికి ముందు సమాధి మందిరములో అచటికి వచ్చు భక్తులు భజన, పాటకచ్చేరీలు నిర్వహింతురు. ప్రతి సంవత్సరము శ్రీరామనవమి చందనోత్సవము, కృష్ణాష్టమి, గురుపూర్ణిమ, విజయదశమి (బాబా ఆరాధనోత్సవము), దత్తజయంతి, రంగపంచమి మొదలగు ప్రత్యేకోత్సవములు ఇచట జరుగును.

మనము తీసికొని వెళ్ళు ప్రసాదము బాబాకు తాకించి కొంచెము తీసికొని మిగిలినది మనకే యిచ్చెదరు. ఇదే నైవేద్యము పెట్టుట. కొబ్బరికాయలు లోపల కొట్టరు. మనము తీసికొని వెళ్ళు దండలు సమాధిమీద బాబా విగ్రహమునకు వేస్తారు. ఉదయము హారతి తరువాత వెన్న ప్రసాదము, అభిషేకము చేసిన పాలు తీర్థముగా ఇస్తారు. ఇతర హారతులలో ప్రసాదములు

పెట్టెదరు. మధ్యాహ్న హారతికి ముందు బాబాకు అన్నము, రొట్టె నైవేద్యము పెట్టెదరు. మనము తీసికొని వెళ్ళు వస్త్రములు బాబా విగ్రహమునకు, సమాధికి కప్పి మనకే యిచ్చెదరు. సంస్థానమునకు ఈయదలచిన వానిని డబ్బులు స్వీకరించు కౌంటరులో ఈయవలెను. బాబా సమాధిమీద కప్పిన పవిత్రమైన వస్త్రము అనారోగ్యము సంభవించినపుడు కప్పుకొనిన ఆరోగ్యవంతులగుదురని భక్తుల విశ్వాసము. వస్తువులు, పుస్తకములు మొదలగునవి బాబా విగ్రహమునకు తాకించి తెచ్చుకొందురు. భక్తులు ఈ సమాధి మందిరములో ధ్యాన - పారాయణలు జరుపుచుందురు.

మందిరమునకు ముందు గల స్థలములో పెద్ద షెడ్ వేయబడినది. అందులో ఒక వేదిక ఏర్పాటు చేయబడినది. ఉత్తరపు ప్రక్కన (రోడ్డువెంబడి) గల షెడ్‌లో సత్యనారాయణ వ్రతములు సంస్థానమువారు భక్తులచే ప్రతిరోజు చేయించుచున్నారు. భీమాజీ పాటీలు క్షయవ్యాధి బాబా అనుగ్రహముతో తగ్గిన తరువాత 1909లో సాయి సత్య వ్రతములు చేయుట ప్రథమముగా బాబా దేహధారిగా ఉన్నప్పుడే ప్రారంభించబడినవి. శ్రీ వేమూరి వేంకటేశ్వర్లు గారిచే తెలుగులో వ్రాయబడిన సాయి సత్య వ్రతము ననుసరించి ఆంధ్రప్రదేశ్ లోని సాయి భక్తులు ఈ వ్రతము చేసుకొని ఫలితములు పొందుచున్నారు. అటులనే చిన్న బాబా విగ్రహములకు అభిషేకములు కూడ చేయించు చున్నారు.

సాయి భక్తులు సాయినాథుని సమాధి, సాయి విగ్రహము దర్శించుట. నిర్ణీతమైన నాలుగు వేళలలో జరుగు హారతులలో పాల్గొనుట జరుగుచున్నది. మనము కూడ సమాధి మందిరములో పై చెప్పినవన్ని దర్శించి, అన్ని సంఘటనలు గుర్తుచేసుకొని బాబా లీలలకు ఆనందించుదము. సాయిబాబా విగ్రహమును దర్శించుట భగవంతుని దర్శించుటే సాయి సమాధిని సేవించుట సద్గురు సేవచేయుటే.

"నా సమాధి నుండియే సర్వ కార్యములు నిర్వహింతునని" బాబా పలికిన అభయ ప్రదానమునకు పాత్రులమగుటకు ప్రయత్నించుదము.

## 8) ఇతర దర్శనీయ స్థలములు

### 1) శివ, గణపతి, శని దేవాలయములు

శివ, గణపతి, శని దేవాలయములను బాబా మరమ్మతు చేయించారు. ఈ ఆలయములు శాంతినివాస్ భవనమునకు ఎదురుగా నున్నవి. ఇందులో పూజారులుండరు. ఈ ఆలయములను దర్శించి అర్చించుకొనవలెను.

### లక్ష్మి ఆలయం :

ఇది షిరిడీలో మహారాష్ట్ర టూరిజం డెవలప్‌మెంటు కార్పొరేషన్ పిలిగ్రమ్‌హౌస్ దగ్గరగా వున్నది. బాబా నల్లకుక్క రూపములో శ్రీ బాలా గణపతి షింపెకు మలేరియావ్యాధి తగ్గుటకు యిచట పెట్టిన పెరుగు అన్నము తిని యున్నారు. భక్తులు దీనిని యిచట గుర్తుచేసు కొందురు.

### II) శ్రీమతి లక్ష్మిబాయి షిండే గృహము

చావడికి ఎదురుగా ఉన్న వీధిలో శ్రీమతి లక్ష్మిబాయి షిండే యిల్లు ఉన్నది. బాబా అంత్యదశలో శ్రీమతి లక్ష్మిబాయి షిండేకు ఇచ్చిన తొమ్మిది రూపాయల నాణెములను ఇచ్చట దర్శించవచ్చు. ఆమె సమాధి కూడ ఇక్కడే ఉన్నది. 115 సం॥లు జీవించి 1963 జేష్ట శుద్ధ ఏకాదశి సోమవారము సాయిలో ఐక్యమయినది.

### III) భక్తమహల్సాపతి గృహము

శ్రీమతి లక్ష్మిబాయి షిండే యిల్లు దాటి కొంత దూరము పోయిన తరువాత శ్రీ భక్త మహల్సాపతి యిల్లు కలదు. ఇచట బాబా మహల్సాపతికి ఇచ్చిన సటకా (బెత్తము)ను. కోటును, కఫ్నీని పాదుకలను దర్శించవచ్చు.

### IV) ఉద్ధవరావు దేశపాండే గృహము

మాధవరావు దేశపాండే (శ్యామా) కుమారుడైన ఉద్ధవరావు దేశపాండే బాల్యదశ యందే బాబా స్పర్శను అనుభవించినాడు. అతడు క్రమ క్రమముగా బాబా నుండి పొందిన అనుభూతులను భక్తులు ఈనాడు వారిని దర్శించి తెలుసు

కొనుచుందురు. శ్యామాకు బాబా స్వయముగా ఇచ్చిన విఘ్నేశ్వరుని విగ్రహము ఇచట కలదు.

## 9) సకోరి – ఉపాసనీ బాబా ఆశ్రమము

షిరిడీకి 4 మైళ్ళ దూరములో సకోరి కలదు. ఇచట బాబా అనుగ్రహము పొందిన ఉపాసనీ బాబా సమాధి యున్నది. పెద్ద ఆశ్రమము కూడ కలదు. దీనిని భక్తులు దర్శించుచుందురు,

బాబా మొదటలో ఇతర సాధువులతో కలసి నాట్యము చేసిన తకియా యిప్పుడులేదు. ఆ ప్రదేశములో రథము, మహాల్సాపతి విగ్రహము ఉంచ బడినవి. మఱియు ఆ ప్రదేశమును మందిరములోనికి వెళ్ళుటకు 'క్యూ'గా ఉపయోగించుచున్నారు. బాబా సంచరించిన తుమ్మచెట్ల ప్రదేశము కూడ మార్పు చేయబడినది.

## మన కర్తవ్యము

బాబా సమాధి చెందారని చెప్పుకొనుచున్నాము గదా ! కాని బాబా యిప్పుడును ఉన్నారు. సమాధి చెందక ముందు వారు చూపిన అద్భుతాల కంటె, ఇప్పుడు ప్రదర్శించు అద్భుతాలే ఎక్కువ. సైన్సు ద్వారా జరిగే అద్భుతములకు సమాధానము చెప్పవచ్చు. కాని బాబా చూపెడి అద్భుతాలకు సమాధానములేదు. బాబా ఏదో ఒక రూపములో తన భక్తుని వద్దకు వెళ్ళును. తృప్తిగా ఎవరేది పెట్టినను బాబా దానిని స్వీకరిస్తాడు. అనామకుడైన వానికి కూడ తన ప్రతిభను (శక్తిని) చూపిస్తాడు సాయి. భగవంతుని చేరువలో విధి-నిషేధములు లేకుండా అందఱికి అందుబాటులో ఇప్పుడు కూడ ఉన్నారు సాయిబాబా-సృష్టి-జన్మల యొక్క ధర్మము - కర్మయోగము - కర్మ రక్షకుడు సాయినాథుడే. విశ్వమంతయు ఆవరించియున్న పరబ్రహ్మ మూర్తియే సాయి. ఏక లక్ష్యముతో తన నాశ్రయించిన వానిని రక్షించుచున్నారు. తద్వారా సమాజమును సంస్కరించుచున్నారు బాబా. నిజమైన మహాత్ముడెట్లుండునో ? ఎటులుండవలెనో ? బాబా జీవించి, ప్రవర్తించి, బోధించి, స్వయముగా

ఆచరించి లోకానికి చాటి నిరూపించారు. కావున సాయిబాబా ఈ కలియుగానికి సంపూర్ణ భగవదవతార పురుషుడుగా భావించి, పూజించి, యాశ్రయించుటయే మన కర్తవ్యము.

తనను భగవంతుడు ఎట్లు సృజించిన ఆ విధముగా ఉండుటలోనే తృప్తి యున్నది. నీవేమి చేసినా సంపూర్ణముగా క్షుణ్ణముగా చేయుము. లేదా చేయుటకు ఒప్పుకోకు, వాదించవద్దు-పదిమాటల కొకమాటతో సమాధానము చెప్పుము. స్వల్పముగా తినుము - రుచుల కాశించవద్దు, తల్లికి తగ్గ బిడ్డలుగా తయారు అగుడు. మీ భాండాగారములు నిలుపుకొనుడు" అని బాబా చెప్పిన సూక్తులను మనము త్రికరణ శుద్ధిగా పాటించి, వారి నిజమైన భక్తులమగుటకు ప్రయత్నించుదము.

"నా కెవ్వరి మీద కోపమురాదు. తల్లికి బిడ్డలపై కోపము కలుగునా? నేను అందఱిని సమాన దృష్టితోనే చూస్తాను. నన్ను నమ్మినవారి నెన్నడును పతనము కానీయను. నా వానిని నా నుండి దూరమేనాటికి కానీయను. నేనే అందఱికి ఇచ్చేది. ఈ విశ్వమంతయు నేనే. సద్గురువుకు పగ్గాలప్పగించిన తరువాత చింతలకు తావులేదు" అని బాబా ఇచ్చిన అభయ ప్రదానమును గాఢముగా విశ్వసించి మన పగ్గాలను బాబాకు అప్పగించుదము.

మనము శరీర భ్రమలో పడి. ఇప్పుడు కూడ ప్రత్యక్ష నిదర్శనములు ఇచ్చుచున్న సర్వవ్యాపియైన సాయినాధుని గుర్తించలేక పోవుచున్నాము. కనుక సాయిని నిజమైన ఫకీరుగా గుర్తించి, వారిని సమర్థ సద్గురువుగా ఆశ్రయము పొందుటయే సరియైన మార్గము. విశ్వాసముతో సాయిని సేవించి సద్గతి పొందుదము.

ఓం శ్రీ సాయినాథాయ నమః



## షిరిడీలో దర్శించవలసిన మందిర సముదాయపు వివరములను తెలియజేయు పటము



# షిరిడీలో దర్శించవలసిన ప్రదేశములు

## ముందు పేజీలోని మ్యాపులో గుర్తించబడిన వివరములు

1 ఇప్పుడు దీనిని ఉపయోగించుట లేదు (ఖాళీ)
2 శాంతి నివాస్ వసతి భవనము.
(గదులు, లాకర్లు ఎలాట్ చేయుట, రైల్వే టికెట్ రిజర్వేషన్, క్లోక్ రూము, డిపాజిట్ రిఫండు చేయు చోటు.)
3 శివాలయము
4 శని దేవాలయము
5 విఘ్నేశ్వరుని గుడి
6 సమాధి మందిరము
7 ద్వారకామాయి
8 మారుతి మందిరము
9 చావడి
10 గురుస్థానము
11 లెండి తోటలో బాబా త్రవ్విన బావి
12 లెండి తోటలో నందదీపము
13 లెండి తోటలో దత్త మందిరము
14 సాయి ప్రసాద్ భోజన శాల
(టిఫిన్ పాకెట్లు అమ్మే చోటు)
15 భక్త నివాస్
16 (ఇంతకు మునుపు ఇచట టిఫిన్ పాకెట్లు అమ్మేవారు)
17 క్యాంటిన్

# షిరిడీలో భక్తులు గమనించవలసిన ముఖ్య విషయములు

ఈ సాయిబాబా చరిత్రములో వ్రాయబడినవే కాక, ఈ క్రింది విషయము లను కూడా గమనించినచో షిరిడీ ప్రయాణము సుఖవంతమగును.

## వసతి

షిరిడీలో మనము బస్సు దిగిన తరువాత, బస్స్టాండు నుండి శాంతి నివాస్ వసతి భవనము వద్దకు రావలెను. నడచి రావచ్చును. సామానులు తెచ్చుటకు మనుష్యులు దొరుకుదురు. శాంతి నివాస్‌లో గల విచారణ కార్యాలయములో గదులు మరియు లాకర్ల కోసం అప్లికేషన్ ఇస్తారు. ఆ అప్లికేషన్ పూర్తిచేసి యిక్కడ ఇస్తే సీరియల్ నెంబరు వేసి కొంత చించుకొని మిగిలినది మనకు ఇస్తారు. దీనిని తీసికొని శాంతి నివాస్‌లోని దీనికి సంబం ధించిన కౌంటరులో ఇచ్చి రూము గాని, లేక లాకరు గాని ఎలాట్ చేయించు కోవాలి. ప్రస్తుతము గదికి రూ. 25/-లు, లాకరుకు అద్దె రూ. 2/- లు ఈ రెండు దొరకనప్పుడు శాంతినివాస్‌లో భక్తుల సామానులు భద్రపఱచుటకు ఉన్న గది (క్లోకు రూము) లో సమానులు పెట్టుకొనవచ్చును. మన సొంత తాళము తీసికొని వెళ్ళుట మంచిది. గదుల వద్దకు ఉదయము వేడి నీళ్ళు బక్కెట్లతో తెచ్చెదరు. బక్కెటు ఒక్కింటికి రెండు రూపాయలు వసూలు చేయుదురు. లాకర్లు తీసుకొన్నవారికి రాత్రిపూట పరుండుటకు కొద్ది చార్జిపై ఒక పరుపు, దుప్పటి యిస్తారు. గదులకు తీసికొన్న డిపాజిట్టు మనము వచ్చే టప్పుడు శాంతినివాస్‌లోనే తిరిగి ఇస్తారు. ప్రైవేటు లాడ్జీలలో సమయమును బట్టి రేట్లు పెంచుచు ఎక్కువ మొత్తం వసూలు చేయుచుందురు. ప్రస్తుతము సంస్థానమువారు "సకోరి"కి వెళ్ళు మార్గములో ఐదువందల గదులు నిర్మించి యున్నారు. ఒక్కొక్క గదికి అద్దె రూ. 60-00 లు వసూలు చేయుదురు. ఇచ్చటి నుండి సాయి మందిరమునకు పోవుటకు ఉచితముగా బస్సు సర్వీసు కలదు. సికింద్రాబాదు నల్లగుట్ట రాణిగంజి శ్రీ సాయి మందిరమువారు

షిరిడీ పట్టణమునందు జైన మందిరమునకు వెనుక భాగమున ఇరువదిగదులు నిర్మించినారు. ఒక్కొక్క చిన్న గదికి రూ. 35/- లు, పెద్ద పెద్ద గదులకు రూ. 60/-లు రుసుము చెల్లించవలెను. ఇచటనే నివసింపదలచిన యాత్రికులు రాణిగంజి మందిరము నందు గల కార్యాలయములో రుసుము చెల్లించి రసీదు తీసుకొనవలెను.

మనము షిరిడీ వెళ్ళగనే తిరుగు ప్రయాణమునకు నిర్ణయించుకొన్న తేదీకి ఈ శాంతినివాస్‌లో గల రైల్వే రిజర్వేషన్ కౌంటరులో మన్మాడ్ నుంచి వెళ్ళు రైళ్ళకు టిక్కెట్లు రిజర్వేషన్ చేయించుకొనవచ్చును. బస్సులోనే ప్రయాణము చేయవలెననుకొన్న బస్సు స్టాండులో రిజర్వేషన్ చేయించుకొన వచ్చును.

## ఇతర వసతులు

శాంతినివాస్ దాటగానే సంస్థానపు లైబ్రరీ ఉన్నది. దాని ప్రక్కన భక్తి నివాస్ ఉన్నది. దానికి ఎదురుగానే శివ, శని, గణపతి ఆలయము లున్నవి. భక్త నివాస్ దాటిన తరువాత సంస్థానమువారు నడుపుచున్న పుస్తకములు, బాబా చిత్రపటములు విక్రయించు షాపు ఉన్నది. దానికి దగ్గఱలో బాబాకు-సమాధికి కప్పిన నూతన వస్త్రములు నిర్ణీత రేట్ల ప్రకారము విక్రయించు షాపు ఉన్నది. ఇచట ప్రతి గురువారము వేలము పాట జరుగును. ఆ సమయమున కూడ వస్త్రములు వేలము పాటలో కొనవచ్చును. ఇది దాటిన తరువాత పాదరక్షలు భద్రపఱచు గది యున్నది. ఇచట పాదరక్షలు భద్రపఱచి టోకెన్ తీసికొని మందిరములోనికి వెళ్ళవచ్చును.

## భక్త మండలి

సాయి సంస్థానములోని భక్త మండలిలో శాశ్వత సభ్యత్వమునకు రూ 251/-లు సంవత్సర సభ్యత్వమునకు రూ. 11/-లు చెల్లించవలసి యున్నది. మందిరము ప్రవేశించు మెట్ల ప్రక్కన ఈ రొఖ్ఖములు తీసికొను కౌంటర్లు ఉన్నవి. అక్కడ అప్లికేషనులు తీసికొని, పూర్తిచేసి యిచ్చి రొఖ్ఖము

చెల్లించవలెను. శాశ్వత సభ్యులకు అచట నిర్వహించు కార్యక్రమములు తెలుపుచు ప్రసాదము కూడ పంపుదురు. బాబాకు-సమాధికి మనము కప్పు శాలువలు సంస్థానమునకు ఈయదలచినచో ఈ రొఖ్ఖం తీసుకొను కౌంటరులో ఇచ్చిన రశీదు ఇచ్చెదరు ఇచట జరుగు సత్యనారాయణ వ్రతము మఱియు అభిషేకములకు నిర్ణయించిన ఫీజులు క్రిందటి రోజే ఈ కౌంటరులోనే చెల్లించి రశీదు తీసికొని మఱు రోజు వాటిలో పాల్గొనవలెను.

## భోజన వసతి

సంస్థానమువారు 'సాయిప్రసాద్'లో టిక్కెట్ ఒకటికి రూ. 4/- లు చొ॥న భోజనము పెట్టుదురు. మజ్జిగ మాత్రము పోయరు. మజ్జిగ మన వెంట తీసికొని వెళ్ళుట మంచిది. ఇచట సాధువులకు ఇంకా తక్కువ రేట్లకు మనము భోజనము పెట్టించు ఏర్పాటు ఉన్నది 'సాయిప్రసాద్'కు ముందు ఉదయం-సాయంత్రం టిఫిన్ పాకెట్లు విక్రయించెదరు. గురుస్థానము ప్రక్క ఉన్న సంస్థాన కార్యాలయమునకు ఎదురుగా సంస్థానము వారిచే ఒక క్యాంటిన్ నడుపబడుచున్నది. పాలు, కాఫీ, టీ తక్కువ రేట్లపై దొరుకును. ఇది 24 గంటలు పని చేయుచుండును.

## దర్శనీయ వ్యక్తులు

పూజ్య శివనేశన్ స్వామివారు 11-2-96 న సాయినాథునిలో ఐక్యమైరి. వారి పవిత్ర దేహము షిరిడీలో సమాధి చేయబడినది. (షుమారు రెండు కిలోమీటర్ల దూరములో) సమాధి వారి సమాధి దర్శించ వచ్చును. పింపిన్‌వాడిరోడ్డులో గల శ్రీ సాయినాథుని శరత్‌బాబు గారిని "సాయిపథం" ఆశ్రమములో దర్శించి వారి ఆశీస్సులు పొందవచ్చును.

## మనము వెంట తీసికొని వెళ్ళవలసిన వస్తువులు

1) పారాయణకు బాబా జీవిత చరిత్ర, 2) హారతులలో పాల్గొనుటకు హారతి పుస్తకము, 3) ధునిలో వేయు వస్తువులు, 4) పన్నీరు, ఆవుపాలు ఆవు నెయ్యి, సాంబ్రాణి, వత్తులు ముఖ్యమైనవి.

## మనము షిరిడీ నుండి తీసికొని రావలసిన వస్తువులు

1) షిరిడీ ధుని విభూతి 2) సాయికి - సమాధికి కప్పిన వస్త్రము, సాయికి తాకించిన బాబా చరిత్ర పుస్తకము ముఖ్యమైనవి.

ప్రస్తుతము సంస్థానము వారిచే అనేకములైన మార్పులు చేయబడు చున్నవి. వసతులు కలిగించబడుచున్నవి. వానిని గమనించవలసి యున్నది.

షిరిడీ సంస్థానమునకు చెల్లించవలసిన ధనము M.O. ద్వారా పంప వచ్చు లేక సిండికేట్ బ్యాంకు లేక సెంట్రల్ బ్యాంకుపై డి.డి. ద్వారా కూడ చెల్లించవచ్చు.

రచయిత : **ఆలూరు గోపాలరావు**

## సాయిబాబా జీవిత చరిత్రకు విరాళము ఇచ్చిన వదాన్యులు

| | | |
|---|---|---|
| 1 | చి॥ నడింపల్లి నళిని, వెంకటగిరి D/o. రజనీకాంత్ | రూ 116-00 |
| 2. | శ్రీ మంత్రిప్రగడ రామకృష్ణ యం.టెక్ శ్రీమతి మంత్రిప్రగడ ఆదిలక్ష్మి కాకినాడ | రూ 116-00 |
| 3. | శ్రీమతి యస్. సుశీలాదేవి | 50-00 |
| 4. | శ్రీ శ్రీనివాసరావు | 50-00 |
| 5. | శ్రీ శ్రీగిరిరాజు శేషగిరిరావు కాకుమాను | రూ 120-00 |

